శ్రీరస్తు

# శ్రీమద్రామాయణము

సులభశైలి ద్విపదలో వ్రాయబడిన
శ్రీమద్రామాయణ ఉత్తరరామాయణ
భారత భాగవతములందు
ఇది మొదటి సంపుటము





కవిభూషణ

## కొండేపూడి సుబ్బారావు

మొదటిప్రచురణ
దుందుభినామ సం॥ర వైశాఖము
మే 1982



వెల : 12-00 లు



ప్రాప్తిస్థానము :
శ్రీ కొండేపూడి సుబ్బారావు
47-10-5, ద్వారకానగరు
విశాఖపట్టణం- 16

ముద్రణ :
శ్రీపతిప్రెస్
కాకినాడ



# కృతజ్ఞత

This book is Published with the
Financial Assistance of
**Sri Tirumala Tirupathi Devasthanams**
under their scheme
Aid to Publish Religious Books.



ఏవిభు నాత్మనెంచి రచియించితినో మహనీయ పుణ్యగా
థావళు లీపురాణకథ లాకరుణాళుఁడు వేంకటేశ్వర
శ్రీవిలసత్కృపామహిమచే లభియించెను వీనికిట్టి శో
భావహమైన రూపవిభవమ్ములు సుందరముద్రణాకృతుల్.



ఈ కావ్యము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ద్రవ్యసహాయమున ముద్రితము.
వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

# భూ మి క

## మన పురాణములు - మన సంస్కృతి

ఏ జాతివైనను తన సమాజమునకు ప్రయోజనకారిగా నుండునటుల అలవఱచుకొనిన జీవన విధానమే సంస్కృతి. కేవలము బాహ్యములగు వేషభాషలకే గాక ఆంతరంగిక మగు మనోవృత్తికికూడ సంబంధించిన విషయమిది. భారతీయ సంస్కృతి యందొక ప్రత్యేకత కలదు. ఐహిక సౌఖ్యముతో బాటు ఆధ్యాత్మికానందమును లక్ష్యముగా నెంచుకొనిన జీవన విధానము భారతీయ సంస్కృతి. భారతజాతి నొక్క దానినే కాక విశ్వమానవ జాతిని దృష్టియందుంచుకొని నిర్వచించిన పవిత్ర జీవన విధానము భారతీయ సంస్కృతి.

భారతీయ సంస్కృతికి మూలాధారములైన వేదోపనిషత్తుల యందలి కొన్ని సూత్రములను చూడుడు.

"స్వస్తి ప్రజాభ్యాః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ
మహీం మహీశాః...సహనావవతు సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై మావిద్విషా వహై,
సర్వేజనాః సుఖినోభవన్తు. ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

మన ధార్మిక గ్రంథము లన్నిటి యందును ఇత్యాదులనేకములు కలవు. ప్రజా పరిపాలనము న్యాయమార్గమున

జరిగి, ప్రజలందఱు పరస్పర విద్వేషములు లేక సుఖముగా శాంతి సంపదలతో వర్థిల్లవలయునని వీని కేంద్ర భావము. విశ్వమానవ కళ్యాణమే ఆశయముగా నిర్వచింపబడిన సార్వజనీన సార్వకాలికములైన శాశ్వతధర్మము లివి. ఈ హేతువు చేతనే భారతీయ సంస్కృతి ప్రపంచ విఖ్యాతి నందినది.

ప్రపంచమందలి ఇతర దేశములు కన్నుదెఱవని పూర్వ కాలమునందే ఇట్టి మహనీయ సంస్కృతిని విజయవంతముగ ప్రచారము చేయగల్గినది వ్యాసుడు వాల్మీకి మున్నగు మహర్షులు. బ్రహ్మజ్ఞానులు, తపస్సంపన్నులు, నిస్స్వార్థపరులు, ప్రజాసేవకులు అయిన మహర్షు లెందఱో మున్ను ఈ దేశమునం దుద్భవించుట మన భాగ్యము. ఆధ్యాత్మిక చింతనావశ్యకతతో బాటు ఉత్తమ మానవధర్మములను ప్రజలలో విస్తృతముగ ప్రచారము గావించుటకై అనేక పురాణ ఇతిహాసములను వ్రాసి ప్రజల కందజేసిన మహాత్ము లీ ఋషులే.

ఈ గ్రంథములందు భగవన్మహిమాభివర్ణనముతో బాటు, యుగయుగముల నుండి భారతదేశమున జ్ఞానయోగులు, కర్మయోగులు, ఉత్తమవర్తనులు, ధర్మపాలకులునైన పెక్కు ప్రసిద్ధవ్యక్తుల జీవిత చరిత్రములు కలవు. ప్రతి గాథ యందును దైవభక్తి, సత్యము, ధర్మము, త్యాగము మున్నగు నైతిక విషయములెన్నియో ప్రస్ఫుటముగ ప్రకాశించుచున్నవి. ఈ పురాణేతిహాసములు బహుజనములయందు

బహుభాషలందు వ్యాప్తిగాంచి జగత్పూజ్యములై యలరు చున్నవి.

అమరవాణి యగు సంస్కృతమున ఆదికావ్యముగ శ్రీమద్రామాయణమును వ్రాసిన కవి వాల్మీకిమహర్షి. శ్రీ మహాభారత, భాగవతములను వ్రాసినది వ్యాసమహర్షి. నన్నయ, తిక్కనాది మహాకవులు ఎన్నో శతాబ్దుల పూర్వమే వీనిని తెనిగించి ఆంధ్రజాతికి మహోత్కృష్టమగు సేవ గావించిరి. మనజాతి సంస్కృతికి జీవగఱ్ఱలు, ఉత్తమములు, శాశ్వతములు అయిన మానవ ధర్మములను బోధించు ఈ మహాకావ్యములకు ఆంధ్రమునందే పెక్కు అనువాదములు, అనుసరణములు ఆ తరువాత వచ్చినవి. ఇంకను వచ్చుచున్నవి.

ప్రపంచమందలి వివిధ దేశములు ఒకదానికొకటి దగ్గఱకు వచ్చుచు, ఒక జాతిని మఱొక జాతి ప్రభావితము చేయుచున్న నేటి కాలపరిస్థితులలో యుగయుగములనుండి అవిచ్ఛిన్నముగ సాగుచు సర్వ మానవజాతి కాదర్శప్రాయమైన మన సంస్కృతి, ధర్మములను మఱింత పటిష్ఠ మొనరింప వలసిన ఆవశ్యకత నేడెంతో యున్నది. ఈ జీవన విధానము నందలి గొప్పతనము, సత్యము ప్రతి వ్యక్తికిని తెలియవలయును.

ఈ ఆశయముతోడనే, వేదోపనిషత్తుల సారమగు శ్రీమద్భగవద్గీతను, సంపూర్ణముగ సులభశైలి తెలుగు పద్య

తాత్పర్యములతో ననువదించి ఇటీవలనే ప్రచురించితిని. ఆ కావ్యమునకు విశేష ప్రజాదరణ లభించినది- నేడు మరల, సామాన్యులకు కూడ బోధపడు ద్విపదలో శ్రీమద్రామాయణము, ఉత్తరరామాయణము, మహాభారతము, భాగవతములను రచించి ఆంధ్ర ప్రజల కందించుచున్నాను. అనుబంధ కథలను, వర్ణనలను వదలి ప్రధాన కథాంశమునే వీనియందు పొందుపఱచితిని.

ఈ కావ్యములవలన, మన భారతీయ జీవన ధర్మములను నైతికాదర్శములను చదువరులు ఏమాత్రము గ్రహింపగలిగినను నేను కృతకృత్యుడనని భావింతును. ఇట్టియుత్కృష్ట గ్రంథములను సంక్షేపించి వ్రాయుటలో కొన్ని లోపములు దోసగులును రావచ్చును. వానిని పఠితలు సహృదయముతో చూడవలెనని నా మనవి.

ఈ కావ్యముల ముద్రణకు కొంత ద్రవ్యసహాయము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమునుండి లభించినది. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతను, వందనములను మఱియొకసారి తెలుపుచున్నాను. శ్రీ వేంకటేశ్వరస్వామి అనుగ్రహమున నా యీ కావ్యములు ప్రజాదరణ పాత్రములు కాగలవని విశ్వసించుచున్నాను.

— గ్రంథకర్త

# సమర్పణము

దైవసన్నిభులు, భారతదేశ విఖ్యాతికి
మూలకారణులు సర్వజగత్పూజ్యులు అయిన
శ్రీ వాల్మీకి వ్యాసమహర్షుల పాదపద్మసంస్మరణ పూర్వకముగ
ఈ కావ్యము సమర్పితము.

1

శ్రీకర మున్నతాశయవిశిష్టము సర్వజనప్రమోద సౌ
ఖ్యాకర మార్యధర్మపరమార్థమునై విలసిల్లు రామగా
థాకమనీయ కావ్యకవితన్ భువికిచ్చిన పుణ్యరాశి వా
ల్మీకికి కేలుమోడ్చి ప్రణమిల్లెద నాదికవీంద్రమూర్తికిన్.

2

వాసిత ధర్మమార్గవిభవాత్ముడు సర్వపురాణకర్త ప్ర
జ్ఞాసముపేతు డుజ్జ్వలయశఃకలితుం డఖిలాగమార్థవి
న్యాసము లేర్పఱించిన మహామహితాత్ము డనంతశేముషీ
భాసురమూర్తి వ్యాసభగవానుని కంజలిపెట్టి మ్రొక్కెదన్.

3

ఆ వాల్మీకియు వ్యాసమౌనియును దివ్యప్రాభవుల్ భారత
క్ష్మావిఖ్యాతికి మూలకారణులు లోకక్షేమ కార్యైక దీ
క్షావేశ ప్రథమానమూర్తులు జగత్సంపూజ్యులామౌనిరాట్
సేవాసంస్మృతి కీపురాణరచనల్ చిహ్నమ్ములై పొల్చుతన్.

# ప్రార్థన

## శ్రీ విఘ్నేశ్వర ప్రార్థన

విలసితసత్కృపాన్వితుడు విఘ్నములన్ దొలగించు దైవ ము
జ్జ్వల శశివర్ణ సుందర శుభాంగుడు భక్తుల పూజనాదులన్
దొలుతగ స్వీకరించు విబుధోత్తముఁ డార్యకు ముద్దుబిడ్డడై
యలరిన గుజ్జువేలుపు గజాస్యునిగొల్తు నభీష్టసిద్ధికిన్.

## శ్రీ సరస్వతీ ప్రార్థన

నలువకురాణివై నిగమనాదము లొప్ప పసిండివీణపై
లలితములైన జ్ఞానరుతులన్ బలికించిన వేల్పుటమ్మ వి
ద్యల నిడు తల్లి శారద మదర్పితసత్కృతు లంది కూర్మిమై
వెలయునుగాత నాహృదయవీథుల కావ్యములల్లువేళలన్.

## సర్వ దేవతా ప్రార్థన

సలలితభక్తిఁ గొల్చు జనసంతతికిన్ కరుణాంతరంగులై
కలుములనిచ్చి నిస్తులసుఖమ్ములఁగూర్చి మనోవికాసముం
గలుగగజేయు భక్తజన కల్పకరాజి త్రిమూర్తులాదిగా
నలరెడు వేల్పుసామ్ములకు నంజలులన్ ఘటియించి
మ్రొక్కెదన్.

## పురాణ ప్రశంస

దురితములెల్ల బాపి పరితోషమొసంగుచు కర్ణపేయమై
ధరణిని సౌఖ్యసంపద లుదారముగా నిడు దివ్యగాథ లెం
దఱు రచియించిరేనియు సదా ముదమిచ్చు నటంచు భక్తి నీ
పరమపురాణగాథలనె వ్రాసితి నింకొకమారు వేడుకన్.

## కవి పండిత వందనము

పెద్దలకెల్ల మ్రొక్కి, పృథివిన్ మధురమ్మగు శబ్దసిద్ధితో
పద్దెము లల్లినట్టి కవిపండితకోటికి నంజలించి నే
నొద్దిక నీపురాణ రచనోద్యమమున్ గయికొంటి కావ్యసం
సిద్ధికి చిత్తముం దభిలషించుచు వారలొసంగు దీవెనల్.



# శ్రీ రామ కథా ప్రశస్తి

శ్రీమంతం భవబంధనాశనకరం క్షేమంకరం శ్రీకరం
దుష్టానాం పరిమర్దనే సుజనతా సంరక్షణే విశ్రుతం
పాపఘ్నం జనకాత్మజావిలసితం వాల్మీకివాక్యామృతం
రామస్యప్రథమాన రమ్యచరితం రామాయణం సేవ్యతాం.

2

శ్రీకళ్యాణచయప్రదమ్ము త్రిజగత్ సేవ్యమ్ము చిత్కాంతి రే
ఖాకల్పైకపదమ్ము సాధుజనరక్షాదక్ష మైశ్వర్యలా
భైకాకారము దుష్టనిర్దళనకార్యారంభ ధౌరేయ మ
స్తోకానందము రామనామకమహస్సున్ గొల్తునశ్రాంతమున్

3

శ్రీరామాహ్వయమూని కోసలధరిత్రీనాథు కామ్యార్థ మీ
డేఱన్, మౌనులయజ్ఞవాటికలు దీపిల్లంగ, పెంపేది దే
వారుల్ డీల్వడ, ధర్మపాలనము నిత్యశ్రేయమై ధాత్రికిం
పారన్ పొల్చినదే మహం బదియ యత్యంతమ్ము నన్నోము
తన్

4

శ్రీసూర్యాన్వయరాజచూడము, యశఃస్ఫీతమ్ము సీతామనో
బ్జాసంసక్తమదాళి నాయకము దీవ్యద్బాణ తూణీర బా
ణా సోదారము వార్షుకాభ్రపటలశ్యామమ్ము శశ్వత్కృపా
శ్రీసంపన్నము రామవిగ్రహము నాచేతమ్మునన్ నిల్చుతన్.

5

అది యైక్ష్వాకుల పుణ్యజీవనకళావ్యాసంగ పుణ్యాశయం
బది మౌనీంద్రుడు శ్రీవసిష్ఠుని పవిత్రాశీర్వచఃపాత మ
య్యది గాధేయుని దివ్యమంత్రబలవిద్యారూపసౌందర్య మ
య్యది శ్రీకోసలరామచంద్రుహృదయంబై యేలు సర్వావనిన్.

6

దైవాదేశముగాగ ఆదికవియై ధాత్రీతలశ్రేయమున్
భావంబందు దలంచి రామచరితవ్యాఖ్యానవాఙ్మధురుల్
ప్రోవుల్ బెట్టిన దేవవాఙ్మయసుధాంభోరాశి బ్రాహ్మీమయుం
డావాల్మీకికి నంజలింతు రసరాజ్యశ్రీపదస్వామికిన్.

7

ఏ విశ్వోదయ ధర్మనిర్ణయకళా హేలపరిష్కారమౌ
భావోద్రేకము పొంగులెత్తినదొ ఆవాల్మీకియందున్ తదీ
యావేశప్రతిమానరూపములు తామైతోచె రామాయణ
శ్రీవాఙ్మధురు లక్ష్మయమ్ములయి ధాత్రీధర్మసంత్రాతలై.

8

పావనజీవనార్థవిభవాశ్రయ ధర్మసమగ్రశేముషీ
దైవతమూర్తి రాఘవుడు; తత్సహధర్మవిశుద్ధవర్తనే
చ్ఛావిమలానుభావగుణసాధువు భూతనుజాత సీతయున్;
కేవల సత్కృపాజసితకీర్తులు కారణజన్ము లిర్వురున్.

9

దానవదౌష్ట్యముల్ దునిమి, ధర్మవిధుల్ నెలకొల్పి సజ్జన
శ్రేణికిరక్షుడై, ప్రజలశ్రేయమునెంచి ధరిత్రినేలుచున్
మానవధర్మమార్గపరమార్థము చూపినయట్టి రామభూ
జానిచరిత్రపొల్పసగు సంతతమీయిల పూజనీయమై.

10

అమలినభక్తిభావమలరారగ చెప్పినదానినే జనుల్
సముచితరీతి చెప్పికొని సంతసమందుచునుందు రీయిలన్
సమధికభోగభాగ్యములు సర్వము మాకివెయంచు జానకీ
రమణినిజార్ధదేహ మగురాముని దివ్యకథావిశేషముల్.

11

రామునికొక్కపత్ని, ప్రచురవ్రతనిర్ణయసత్యసంధుడౌ
రామునిదొక్కమాట, సమరప్రళయోగ్రధనుఃప్రచండుడౌ
రామునిదొక్కబాణము, నిరంతరసాధుజనావనోద్యమో
ద్దాముడు రాముడే పరమదైవము ధారుణి నెల్లవారికిన్.

12

భూమిసమస్తమీ యెడ సమున్నతమానవధర్మపాలనా
రామము చేయగల్గినది రామనృపాలచరిత్రగావునన్
నాముసుచన్న కావ్యరచనాచణు లెందఱో వ్రాసినట్టి శ్రీ
రామచరిత్రమే తిరిగివ్రాసితి వ్రాయక యేమిచేయుదున్.

13

శ్రీరఘురామభూవిభుడు సీతనుగూడి యయోధ్యయందు, సే
వారతిసోదరుల్ గొలువ వాయుసుతుం డసమానభక్తితో
కోరి భజింప పాదములు, కోసలరాజ్యపదాభిషిక్తుడై
ధారుణినేలు దృశ్య మెడదన్ వసియించుత నాకు నిత్యమున్.

అముద్రిత కావ్యము
నా 'రాఘవహృదయము' నుండి.



# విషయసూచిక

శ్రీరస్తు

# శ్రీమద్రామాయణము

## పుణ్యభారతము

శ్రీరమణీయమై చెలువారుచున్న
భారతదేశమ్ము ధారుణియందు
పేరుకీర్తులు గల పెద్దదేశమ్ము
భూరిసంపదలకు పుణ్యకర్మలకు
పరమాత్మచింతకు ప్రకృతిశోభలకు
అరుదారు సద్ధర్మ పరిపాలనకును
జ్ఞానజిజ్ఞాసకు మానవీయతకు
స్థానమై వెలసిన స్వర్గఖండమ్ము.
ధీరులు విజ్ఞులు దివ్యపూరుషులు
భారతభూమిని ప్రభవించి మున్ను
వారల బహుముఖ ప్రజ్ఞను జూపి
భారతఖ్యాతికి కారణులైరి.
మనజన్మభూమి యీమహనీయ ధాత్రి
మొనలేని ప్రఖ్యాతి కిది పుట్టినిల్లు.

# శ్రీ మ ద్రా మా య ణ ము

శీతాద్రి శ్రీగిరి సింహాచలాది
ఖ్యాతిగాంచిన మహోత్కృష్టధరమ్ములును
పూతజలమ్ముల పొంగి స్రవించు
గౌతమి కృష్ణయు గంగాది నదులు,
పసిఁడిపంటలుపండు పంటభూములును,
మిసిమివన్నెల నీను మేలిపచ్చికలు
తోరమౌ సాగరతీర భూములును
సారవంతములైన సస్యసంపదలు
వివిధజాతుల ఫలవృక్ష సంతతులు
సువిశాల కాంతార సుందరస్థలులు
బహువిధ పశు మృగ పక్షిసంచయము
మహిత కాంచన రత్న మయమైనగనులు
పవన శీతాతప వర్షపాతముల
నవిరతమ్ముగ కాల మనుకూల మైన
ప్రకృతిసంపదతోడ భారతపృథ్వి
అకలంకశోభతో నలరారు నెపుడు.

జనులెల్ల రేదేశజాతియందైన
కనులు తెర్వని యాదికాలమ్మునందె
సకలశాస్త్రమ్ములు సకలవిద్యలును
సకలధర్మమ్ములు సకలనీతులును
మేదినికంతకు మేలొనఁగూర్చు

వేదవేదాంతముల్ వెలసె నిచ్చోట
ధర్మదీక్షితులును దైవచింతనులు
కర్మయోగులు పుణ్యకర్మతత్పరులు
ఘనతపోనిధులైన మునివరుల్ మున్ను
జననమ్మునంది యీవినుత దేశమున
మహిసమస్తమునకు మార్గదర్శకము
బహుభాగ్యఫలదమా భవ్యసంస్కృతిని
కడుసుందర పురాణకథల రూపమున
నుడివిరి జనుల మే లెడదలం దెంచి
మహనీయ జీవన మార్గలక్ష్యమ్ము
లిహపర సుఖముల కివె సాధనములు
వ్యాసుఁడున్ వాల్మీకి భరతోర్వినిట్లు
భాసుర విఖ్యాతిఁ బడసిన ఋషులు
దేవతాసన్నిభుల్ దీపితబుధులు
భూవలయమునకు పూజ్యులు వారు
సారమతుల్ వారిజన్మమ్ము లిలను
భారతజాతికి భాగ్యమ్ము పంట
దుర్మార్గులను ద్రుంచి దురితమ్ము బాపి
ధర్మమ్ము రక్షింప ధర నెన్ని మార్లొ
శ్రీవిష్ణు వుదయించె చెలువు మీఱంగ
పావనమ్మైన యీ భారతావనిని.
శ్రీవిష్ణు వవనిపై శ్రీరాముఁ డగుచు

# శ్రీమద్రామాయణము

ఆవిర్భవించిన అవతారగాథ
రమణీయకావ్యమ్ము రామాయణముగ
సమధిక మధుమయ సాహిత్య ఫణితి
భాసురశ్రేయమ్ము ప్రజలకు గలుగ
వ్రాసి కీర్తిని గాంచె వాల్మీకి మౌని.

## వాల్మీకిముని చరిత్ర

శ్రీకర మ్మర్వికి శ్రేయస్కరమ్ము
ప్రాకట బహుపుణ్యఫల సంప్రదమ్ము
రామునిచరితమ్ము రాజితరీతి
రామాయణమ్ముగ వ్రాసె వాల్మీకి.
ఆమునిఁగూర్చియు నాదికావ్యముగ
రామాయణ మతండు వ్రాయుటఁ గూర్చి
కడు విచిత్రములైన గాథలు కొన్ని
పుడమిపై నున్నవి పూర్వమ్ము నుండి.

అటవికుఁ డొకండు మొటుతనాన
బాటసారులఁ గొట్టి వారిద్రవ్యమ్ము
లడుగైన కదపనీ కపహరించుచును
గడపుచుండెను తనకాలమ్ము నెల్ల
మునివరుల్ కొందఱా వనుల వెంబడిని
చనుచుండ కనిపెట్టి చయ్యన నతఁడు
దారికడ్డము వచ్చి వారల నాపి

“చోరు లట్లున్నారు చూడగా మీరు
మీమాట లన్నియు మేలుగా నికను
నాముందు పడవైచి నడువుడు మీరు
లేకున్న దక్కవు మీకుఁ బ్రాణమ్ము
లీకట్టి నిట చూడు డియ్యదే యనఁగ”
కరకమండలములు కాషాయములును
ధరణిపైవైచి యాతాపసోత్తములు
“ఏమోయిబోయ ! నీవిట్టి వగుచు
ఏమొనర్చెదవో నీవెఱుగ కున్నావు
కైకొను మివియె మాకాషాయములను
మాకడనున్నట్టి మహిత భాగ్యములు.
నినువీడి పోదు మీనిముసమ్మె కాని
వినుమొకమాట నీమనమున బెట్టి
బాటసారుల నిట్లు బాధలు బెట్టి
యేటికి పాపమ్ము మూటకట్టెదవు?
ఎవరిపోషణకు నీవిట్లొనర్చెదవో
భువి నీదుకర్మ వారెవరును గూడ
పరమాణు వైనను పంచుకో బోరు
భరియింప వలెను నీదురితమ్ము నీవె
యోచింపు మొక్కింత యుల్లమ్ము లోన
ఈచెడ్డపని నీకు యోగ్య మెట్లౌనో”
అనిచెప్పుచున్న యామునులవాక్యములు

# శ్రీ మ ద్రా మా య ణ ము

వినినకొలందియు మనసు కరంగి
కరముల నున్నట్టి కత్తియు కత్తి
బిరబిర దూరమ్ము్మవఱకును విసరి
యతులకు మ్రొక్కుచు నాబోయమనిసి
అతిదీనవదనుఁడై అశ్రువుల్ గార్చి
తనతప్పు క్షమియించి తనకొక్కదారి
కనుపించునటు చేయుఁడని వేఁడఁ దొడఁగె.
యతివరు లంతట నాబోయవాని
కతికరుణాత్ములై యాశీస్సు లిడిరి
"ధరణి నీ వొకమహాతాపసేంద్రుఁడవు,
వరకవీంద్రుడవయి వర్ధిల్లు" దనుచు
అతితపశ్శాలియై యాబోయవాడె
క్షితిని వాల్మీకిగా కీర్తి గడించె
నని యనుశ్రుతముగా నవనీతలాన
జనులాడుకొను నొకసద్గాథ కలదు.

ప్రాచేతసుం డను ప్రథమనామమున
ప్రాచీనకాలాన వరలిన మునియె
పృథివి వాల్మీకిగా పేరొందె ననిన
కథయొండుగూడను కలదు నేఁటికిని.

ఏదియెట్లున్నను మేదినిమీఁద

# వాల్మీకి ముని చరిత్ర

ఆదికవీంద్రుఁడై యలరినవాఁడు
మహితతపశ్శాలి మౌనివాల్మీకి
బహుముఖప్రజ్ఞుఁడై పడసెను కీర్తి.
పుట్టలు చెట్టులు పొడవుగా నతని
చుట్టు లేచుట గూడ చూడకాతండు
మౌనమ్ము పాటించి మహినెల్ల మఱచి
కానలందున జేసె కఠినతపమ్ము.

అతితీవ్రమైనిండె నవనియం దెల్ల
నతనితపోజ్వాల లంతకంతకును
అమరులే వెఱగంది యాతపమ్మునకు
కమలసంభవుఁజూచి కడువడి నుడువ
ప్రత్యక్షమై వచ్చి బ్రహ్మయేభువికి
అత్యాదరమున నాయతిని మేల్కొలిపి
"చాలింపు తపమును సంయమివర్య !
మేలౌను నీకును మేదిని కింక
ఘనతపస్వివి మహాకవియునై ధాత్రి
ననుపమవిఖ్యాతి నందెదవీవు
వల్మీకములనుండి వచ్చిన కతన
వాల్మీకియనుపేర వరలెద వీవు.
ప్రాకామ్యధర్మమున్ ప్రజలకుదెల్పి
నీకావ్యసత్కీర్తి నిత్యమై నిలుచు"

శ్రీ మ ద్రా మా య ణ ము

ననిదీవనలనిచ్చి యఁరిగెను బ్రహ్మ
మునియు బ్రహ్మకు మ్రొక్కి వినతులర్పించె.

తనతపస్సిద్ధికి తనభాగ్యమునకు
మనమున నలరుచు మానివాల్మీకి
వినుతగంగానది కనతిదూరమున
అనువుగానిర్మించి యాశ్రమ మొకటి
తనశిష్యులకు నిత్యధర్మప్రబోధ
మొనరించు కొనుచును దినములుగడుప.

తిరుగుచు ధరణిపై దేవఋషీంద్రుఁ
డరుదెంచె నారదుం డట కొక్కనాడు
నారదుం గనుగొని నయమున మ్రొక్కి
కూరిమి మీఱంగ కుశలమ్ము నడిగి
అతిథిసత్కారమ్ము లానారదునకు
నతిభక్తి నొనరించి యాతని జేరి
వినిపించె వాల్మీకి వినయభావమున
మనముననున్నట్టి తనకోర్కె నిటుల
"నారదమహాసీంద్ర నాకోర్కె తీర్ప
మీరలే యర్హులు మేదినిఁ గాన
ఎఱిఁగింపు డయ్య యీయిలమీద నిపుడు
వరలునే యెవఁడైన ప్రఖ్యాతిఁగనిన

సకలసద్గుణమూర్తి సౌందర్యరాశి
అకలంకవర్తనుం డాత్మాభిమాని
సర్వసమర్థుఁడు సత్యసంధుండు
ఉర్వివాసులకు మేలొనరించువాఁడు
పౌరుషవంతుఁడు పరమవిక్రముఁడు
కార్యదక్షుం డతికారుణ్యమూర్తి
ధైర్యశాలియు నిత్యధర్మతత్పరుఁడు
తెలియఁ గోరెద నిది దివ్యమౌనీంద్ర
తెలుపుము నాకట్టి ధీశాలి ననిన

మునిరాజు వాల్మీకి మనవి నాలించి
యనియెను నారదుండల్లన నిట్లు
"మౌనిచంద్రా! నీదు మనమున నున్న
మానితచరితుండు మహిందుర్లభుండు
సకలసద్గుణములు జగతీతలాన
ఒకచోట సమకూడియుండ వెచ్చటను
ఐనను నేఁడట్టి ధీనిధి యొకఁడు
భానువంశమ్మున వర్ధిల్లుచుండె.
యశమునందుచు కోసలావని నేలు
దశరథనృపతికి తనయుఁ డాతండు
చిరకీర్తి నందిన శ్రీరామచంద్రుఁ
డెలుగుదు రతనిని ధరణి నెల్లరును.

అన్ని సద్గుణముల యందును గూడ
మిన్నరో యతఁడు నీవన్నవర్ణనకు.
అనుపమధీశాలి ఆదర్శపురుషు
డని చెప్పఁగోదగు గుణవంతుఁ డతఁడు.
అర్ణవగంభీరుఁ డామహామహుని
వర్ణింపనేర రీవసుధ నెవ్వరును
సద్వంశజనితుండు సౌజన్యరాశి
విద్వదున్నతుఁడును వేదవిజ్ఞాని
విపులవిక్రముఁ డయి పిన్నఁటినాఁడె
తపసిజన్నము గాచె తాటకం జంపె
సీతను పెండ్లాడె శివునివిల్విఱిచి.
ప్రీతిగ పాటించి పితృవచనమ్ము
తనరాజ్యమునువీడి వనముల కరిగె
దనుజుల నడఁగించె మునులనుగాచె
వనచరవరునితో పాటించి చెలిమి
తనకనుచరునిగా హనుమంతు గొనియె
తనసతిన్ మోసాన మునివేసమూని
కొనిపోయి దాచిన దనుజనాథుండు
రావణున్ పౌరుషప్రతిభుఁడై చంపి
పావనగుణ తనభార్యను గొంచు
సాకేతమరుదెంచి సామ్రాజ్యమేలె
ప్రాకట సద్ధర్మబద్ధుఁడై మిగుల

రామరాజ్యము నిల్చు రాజితరీతి
క్షేమరాజ్యమ్మయి క్షితిని నిత్యముగ
దుష్టులన్ శిక్షించి దురితమ్ము బాపి,
శిష్టులన్ ధర్మమున్ క్షితినిఁ గాపాడ
భూవలయమ్మున పుట్టినయట్టి
శ్రీవిష్ణుదేవుఁ డా శ్రీరామమూర్తి
వ్రాయు మీవాతని రమ్యచరిత్ర
మీయఖిలావని కెలమి ఘటిల్ల
శాశ్వతమ్మయి నీదుసత్కార్య మింక
విశ్వమంతటఁ బ్రాకి విలసిల్లగలదు
మేదినిపై సుధాస్వాదురమ్యముగ
ఆదికావ్యమ్మయి యలరు నీరచన"
కడుప్రీతి వాల్మీకిజడదారి కిట్లు
నుడివి సమ్మదమార వెడలె నారదుఁడు.

కవియాదు వని పల్కె కమలాసనుండు
ప్రవిమలకావ్య మారాముని చరిత
మొదలిడుమని పల్కె మునినారదుండు
ఎదలోన వాల్మీకి కేదియో క్రొత్త
వెలుగొండు జనియించి విప్పారి నట్లు
నిలువెల్ల దేహమ్ము పులకింపఁ దొడఁగె

వాల్మీకి రామాయణమును వ్రాయుట

వనవీథి నొకనాఁడు వాల్మీకిమౌని
తనశిష్యులం గూడి తమసకేగుచును
నిలువెల్ల కంపించి నీరయిపోవ
తిలకించె దారుణదృశ్యమ్ము నొకఁటి
తరుశాఖలందున తనువు లొక్కటిగ
చరియించు నొకపుల్గుజంటను జూచి
పొదలమాటున డాగి బోయవాఁడొకఁడు
వదలెను వానిపై వాడిబాణమును.
మఱునిముసమ్ములో మగపిట్టచచ్చి
ధరణిపైఁ గూలెను తల వ్రేలవైచి.
తనమగపిట్టకై ధరణిపై దొరలి
పెనగొనుదుఃఖాన పెంటి యేడ్చినది
దురపిల్లు నాపుల్గు నరసినంతటనె
కరఁగిపోయెను గుండె కరుణతో మునికి
అచటనే యున్నట్టి యాబోయ నరసి
వచియించె కినుకతో వాల్మీకి యిటుల
"కామసంగతమైన క్రౌంచమ్ము నిచట
ఏమని చంపితి వీవు నిషాద !
నీవును నిత్యమై నిలువబో వనుచు
ఆవాక్యముల ముని యనియెనో లేదొ

అవనిపైఁ బడి చచ్చె నాకిరాతుండు
భువి పాప మూరకే పోవ దన్నట్లు
మనమందు వాల్మీకిముని యంతలోనె
తనకోపచర్యకు తానె దుఃఖించె
ఆ కిరాతునిపని కాపుల్లు వెతకు
వ్యాకులంపడుచును వాల్మీకితపసి
ఆదీనరోదన మ్మాత్మలో దనకు
నేదియో నుడివిన ట్లెంచగా సాగె.
తనస్నానకృత్యమ్ము లొనరించి యెటులో
చనుదెంచె వాల్మీకి తనపర్ణకుటికి
కినుకతో నాబోయమునిసినిఁ గూర్చి
మునిరాజు వాల్మీకి యనిన వాక్యములు
ఛందోయుతమ్మయి సమశబ్దగతుల
సుందరమ్మగు నొకశ్లోకమ్ము పగిది
చనుదెంచుటరసి యామునిశిష్యులెల్ల
మనముల నబ్బురం బందిరి మిగుల
తపసివాల్మీకికి తనపల్కులందు
విపులమై తోచెను వేఱె యర్థమ్ము
"కామాంధు నొకనిని కడ తేర్చి రామ!
భూమి శాశ్వతకీర్తి పొందినా" వనగ
ఘనుఁడైన రాముని కమనీయచరిత

తనపల్కులందున తనరుచున్నట్టుల
ఎదలోనిశ్లోకమే యీరీతి నిపుడు
మృదువచః శ్లోకమై కదలివచ్చినది
స్ఫురియించె నంతలో పరమేష్ఠి వరము
వరుస నారదుఁడన్న వాక్యమ్ము లెల్ల
ఆ మృదువాక్యమ్ము లాదేశములుగ
రామాయణము నిక వ్రాయుమన్నట్టుల
తలఁచుచు వాల్మీకి తన్మయుండగుచు
పులకించె నొకక్రొత్త వెలుగొంది మదిని
ఆరూఢిగాఁ దోచె నామునికపుడు
శ్రీరామకథయెల్ల చిత్తమ్మునందు
అనుపమ సుందరుం డారామవిభుఁడు
కనుపించుచుండెను కనులందు మునికి
వచియించుచుండెను వాల్మీకిమౌని
రచియించుచుండిరి రయమున మునులు
మధురమౌ వాల్మీకి మాటలలోన
విదిత గంగాఝరీవేగమై వచ్చి
మానిత శ్రీశ్లోక మంజుల మగుచు
జానకీరాముల చరిత రూపొందె
జీవమ్ముతో వెల్గు చిత్రమౌ కథలు
పావనాఖ్యాయికల్ భవ్యగాథలును
కూర్చిన నవనీత కోమలకవిత

తీర్చిదిద్దిన యొక తీయని చరిత
రామునికథయై యి రామాయణమ్మ
భూమిపై వెలసెను పుణ్యభాగ్యముగ.

రామాయణ మహిమము

నారాయణుఁడు జగత్కారణుం డయిన
శ్రీరమాకాంతుఁ డా శ్రీరాము చరిత
పరమార్థముగ భువి ప్రజల కెల్లరకు
వరముని వాల్మీకి వ్రాసిన కవిత
ఇరువదినాల్వేల సురుచిర శ్లోక
భరితమై సాగిన స్వాదుస్రవంతి
రామాయణ మ్మొక రమణీయ సృష్టి
భూమిని లేదిట్టి పుణ్యకావ్యమ్ము
తనయాశ్రమమ్మందె దైవకృత్యముగ
జనకజపుత్రులై జనియించి నట్టి
లవకుశాఖ్యులకును లాలితరీతి
ప్రవిమలకావ్యమీ రామాయణమును
గానమ్మొనర్పగా కడుప్రీతి నేర్పె
మౌనివాల్మీకియే మంజులఫణితి
భావజాకారులా బాలురిద్దఱును
పావనమ్మగు రామభద్రుని కథను
వీణలచేబూని వినిపించినంత

వీనులవిందుగా తేనెలే కురిసె
మధురశబ్దమ్ములు మధురకల్పనలు
మధురభావమ్ములు మధురమౌ గాథ
లెంతమనోహర మెంతపావనము
సంతత సుఖశాంతి సంపాదకమ్ము
రమణీయ చరితమ్ము రామాయణమ్ము
కమనీయ మాధుర్య కర్ణామృతమ్ము
మానితమ్ముగ వ్రాసె మౌనివాల్మీకి
మానవజాతి కీమంగళగీతి.
మానవుండై పుట్టి మాధవుం డిలను
జ్ఞానమ్ము ధర్మమ్ము మానవీయతయు
మహికిఁ జూపించిన మహనీయమూర్తి
మహిని పాలించిన మార్గదర్శకుఁడు
ఆదర్శపూరుషుం డాదర్శనృపతి
మేదినికెల్లను మేల్బంతి యతఁడు.
ఇట్టి దట్టిది యని యెంతచెప్పినను
పట్టనేరము రామభద్రుని మహిమ
శాంతమ్ము సత్త్వమ్ము సాధుజీవనము
సంతత కారుణ్య సద్గుణాశయము
శ్లాఘనీయము భక్తసముదాయమునకు
రాఘవహృదయమ్ము రాజితాశ్రయము.
లలితగుణకలాప లక్ష్మీస్వరూప

ఇలనెల్ల కృపతోడ నేలెడు తల్లి
సకలసద్గుణవల్లి సాధ్వీమతల్లి
అకలంకచారిత్ర అవనిజ సీత
శిష్టు లా జానకీ శ్రీరాము లెలమి
ఇష్టదేవతలైరి యిలనెల్లరకును
ఈరామగాథయం దెవరికి వారె
శ్రీరమ్యవర్తనుల్ చిరకీర్తి ధనులు
రామునిచరితమ్ము ప్రాకె నల్దెసల
రామమయమ్మయ్యె భూమిసర్వమ్ము
భూజనులెల్లరన్ బ్రోవంగఁ జాలు
రాజితమంత్రమ్ము రామనామమ్ము
శ్రీరామచరితమ్ము క్షితిని నిత్యమ్ము
పారాయణముసేయు భక్తులెల్లరకు
చేకూరు సంపదల్ చేకూరు శాంతి
చేకూరు కైవల్య చిరనివాసమ్ము
ఆదర్శలక్ష్యమై యలరుమార్గమ్ము
మేదినియందున లేదింతకంటె.
ఇందున్నవిలలోని యెల్లధర్మములు
ఇందు లేనివి మఱి యెందును లేవు

అనఘుఁడు వాల్మీకిముని తపఃఫలము

ప్రణుతధార్మికనీతి రామునిచరిత
యుగయుగమ్ములనుండి యుజ్జ్వలమ్మగుచు
జగతిని వెలిగిన జ్ఞానదీపమ్ము
ధరణిధర్మము నిల్పి దురితమ్ము బాపి
చిరతరసుఖశాంతి చేకూర్చుత్రోవ
రామరాజ్య మ్మిల క్షేమరాజ్యముగ
రామనామమ్మిల ప్రజకుబాసటగ
భవ్యమై జీవనపరమార్థ మగుచు
దివ్యప్రకాశమై దేశదేశముల
వరశుభప్రదమయి వర్ధిల్లు నిల్లై
ధరణిపై నాచంద్రతారార్క మగుచు.



శ్రీరస్తు

# శ్రీ మ ద్రా మా య ణ ము

## బా ల కాం డ ము

### సూర్యవంశపు రాజులు

శ్రీరమ్యమయి భువి చెలువారుచున్న
భారతభూమిని పాలించినారు
పావనచరితులు బలశాలు లైన
భూవరు లెందఱో పూర్వకాలమున
వారిలో ప్రముఖులై భానువంశజులు
పేరుగాంచిరి కీర్తివిభవమ్ము లలర
వాసిగా నుత్తరభారత మందు
కోసలరాష్ట్రమ్ము కూర్మినేలుచును.
కోసలమందున్న గొప్పపట్టణము
శ్రీసమంచితమయి చెలగు నయోధ్య
వరుసగా నినకులప్రభువుల కెల్ల
వరరాజధానియై వర్ధిల్లె ధరణి
పసిడిపూతల క్రొత్తవన్నె లింపొలయు
పసమీఱు రతనాల వైభవమ్మెసఁగ

మేడలు మిద్దెలు మేల్కట్టడములు
వాడ లంగడులతో వరలు నాపురము
అలడు నాపురి కంఠహారమ్మునంగ
సలలితజలముతో సరయూస్రవంతి.
ఘనకీర్తిధనులుగా వినుతినిఁ గొనిన
ఇనవంశ ధరణీశు లెందఱో కలరు
సకలోర్వినాథుండు సావర్ణిమనువు
అకలంకు డిక్ష్వాకు వసుమహారాజు
బహుకీర్తిమంతులై భాసిల్లినట్టి
మహనీయచరితులు మాంధాతనృపతి,
సగరభూపతి హరిశ్చంద్రభూవిభుఁడు
అగణితయశుఁడైన యాభగీరథుఁడు,
అల దిలీపుఁడు, రఘు, వజమహారాజు,
జలజాప్తకులమున నలరిన వారె.

### ద శ ర థుఁ డు

అతివ ఇందుమతికి నజరాజునకును
సుతుఁడయ్యె దశరథుం డతులితబలుఁడు
దశరథవసుధేశు యశము నద్దెసల
విశదమ్మై వ్యాపించి విలసిల్లె మిగుల
ధైర్యమ్ము బలమును ధర్మతత్పరత
కార్యదక్షత గల ఘనుఁడా నృపుండు

అమరేంద్రుసాయమ్మై యరిగి రాక్షసుల
సమరాన గెల్చిన శౌర్యవంతుండు
కౌసల్యయు సుమిత్ర కైకేయి యనగ
వాసిగ ముగ్గురు భార్య లాతనికి
శ్రీరంగనాథుని యారాధనమ్మె
పారమ్యముగ నెంచి బ్రతుకుకౌసల్య;
శాంతియు దాంతియు సాధుశీలమ్ము
లింతి సుమిత్రగా నిలరూపు గాంచె;
జననాథునకుఁ గూర్చు సౌందర్యరాశి
సునిశితబుద్ధి యాసుదతి కైకేయి.
గురువువసిష్ఠుండు కూరిమిమీఱ
పరమార్థధర్మమ్ము లెల్లఁగించు చుండ
యెనమండుగురు మంత్రు లెలమిగొల్వంగ
జనులు సుఖింప నామనుజేశు డేలె..

## పుత్రికామేష్టి

అకలంక యశముండి ఐశ్వర్యముండి
సకలసంపదలుండి సామ్రాజ్యముండి
తనకుసంతతిలేమి దశరథరాజు
మనమున చింతించి మాటిమాటికిని
మగమొల్కయొక్కటి మాకు చాలనుచు
వగచుచుండెను దీనభావమ్ము తోడ

పుత్రులఁబడసిన పుణ్యదంపతుల
చిత్రత్వమునఁజూచి మేలొనరించు.
ఎదురుగా పసిబిడ్డ లెవరుకన్పడిన
ముదమున పైకెత్తి ముద్దాడుచుండు
తీరనిచింతతో దినములు గడపు
ధారుణీనాథుని దైన్యమ్ము నెఱిఁగి
అరయగా జాలక అవనీశు మొగము
నురపిల్ల దొడగిరి పరివారములును.
సుతులు లేకున్న సద్గతులు లేవనుచు
క్షితినాథు డీరీతి చింతించుచుండ
ఆకస్మికమ్ముగ నాలోచనమ్ము
భూకాంతునకు మది పొడసూప నతఁడు
మురు వెసంగగఁ దనముఖసీమయందు
గురువుల సచివుల కూర్మి రావించి
"దైవవరమ్మున తనయులఁ బడయ
భావించుచుంటి నోభవ్యాత్ములార!
అలఘుదీక్షనుబూని యశ్వమేధమును
పొలుపుగ సుతులకై పుత్రకామేష్టి
సలుపంగ నోకక్రొత్తతల పుదయించె
వలయు నేర్పాటుల వెలయింపు" డనియె
ఏనాడు నృపతికి లేని యానంద
మానాడు తిలకించి యలరిరి వారు

"మనుజేశ! తప్పక మహనీయులైన
తనయులు నీకిక జనియింతు" రనుచు
పలికె శుభమ్ములు వలయునేర్పాట్లు
సలిపిరి వేగమ్మె శాస్త్రోక్తవిధుల
తనరాణులకు గూడ తడయక యేగి
తనకోర్కె నెఱిగించె దశరథుం డలరి.

అరుదెంచి రాహూతు లగుచు బంధువులు
నరపతుల్ కానుకలు విరివిగా గొనుచు
ప్రముఖులౌ మునులను రావించినారు
సముచితరీతిని జన్నమ్ము నడుప.
రోమపాదుని రాజ్యభూముల యందు
క్షామమ్ములేకుండ కాపాడి యతని
ప్రియసుత శాంతను పెండ్లాడి నట్టి
నయశాలి తపసియు నమ్రవర్తనుడు
మునిఋష్యశృంగుని కొనివచ్చె నేగి
తనయజ్ఞశాలకు దశరథేశుండు
చనవున శాంతను తనకూతువలెనె
కనుగొనె ప్రేమతో కౌసల్య మిగుల.
వివిధశోభలతోడ వేడ్కలతోడ
సవనవాటిగమారె సకల మయోధ్య
వివిధరాష్ట్రము లేగి విజయవంతముగ

సవనాశ్వ మరుదెంచె చయ్యన తిరిగి
గురువసిష్ఠాదులు పరమమోదమున
జరిపింప విధులెల్ల శాస్త్రోక్త రీతి
హోతల బ్రహ్మల నుద్గాతవరుల
ప్రీతి నధ్వర్యుల పిలిచి పూజించి
పుణ్యాశ్వమేధమ్ము పుత్రకామేష్టి
గణ్యతతో పూర్తి కావించి రాజు
ధనధాన్యవస్తువుల్ దానమ్ము లిచ్చి
తనివొందగా జేసె జనుల నెల్లరను
సమధికప్రీతితో చనుదెంచి కొనిరి
అమరముఖ్యులు వచ్చి యాగహవిస్సు.
క్షితినాథు డారీతి నతులిత భక్తి
క్రతుకార్యముల పూర్తి గావించుచుండ
అద్భుతంబొదవంగ నచటివారలకు
ఉద్భవం బొంది యాహోమకుండమున
తేజస్వియగు నొక దివ్యపూరుషుఁడు
రాజితాసక్తితో రాజు నీక్షించి
"అవనీశ! వినుము నీ యాగదీక్షలకు
దివిజు లెల్లరు కడు తృప్తులైనారు
తనయులు నలువురు తప్పక నీకు
జనియింతు రనుచు నన్ననిపి రిచ్చటకు
చేకొను మిద్దాని క్షితినాథవర్య

నీకాంతలకు నిమ్ము నెమ్మితో ననుచు
పాయసమ్మున్నట్టి పసిడిపాత్రమ్ము
నాయవనీశున కందించి చనియె.
తనజన్మధన్యమై తనరిన దనుచు
మనమున నుప్పొంగి మనుజేశు డేగి
ఆనందముగ నీయ నాపాయసమును
రాణులు ముగ్గురున్ గ్రహియించి రెలమి
తనదివ్యదృష్టితో కనుగొని చెప్పె
మునివసిష్ఠుండె వచ్చి మనుజేశు తోడ
ధరణిని మనుజావతారుండై వచ్చి
తరుణి కౌసల్యకు హరిపుట్టు ననుచు.
తనయులు కలిగెడి ధైర్యమ్ముతోడ
తనరాణులంగూడి దశరథేశుండు
లాలిత శృంగార కేళీమనోజ్ఞ
లీలావిహారుండై కాలమ్ముగడిపె.

విష్ణుమూర్తికడ దేవతలమొఱ

త్రిభువనమ్ములపైకి తీర్చి దండెత్తి
రభసమ్ముతో వచ్చు రాక్షసబాధ

పడలేక దేవతల్ కడుదీనులగుచు
వెడలి ప్రార్థించిరి విష్ణు నీరీతి.
"పరమాత్మ అచ్యుత భక్తమందార
పరమేశ కేశవ పాపసంహార
దానవబాధకు తాళగలేక
ప్రాణముల్ కడముట్టి వచ్చితిమయ్య
రావణుం డాదిగా రాక్షసులెల్ల
గావరమ్మున లోకకంటకు లగుచు
గావించుచుండిన క్రౌర్యమ్ములెల్ల
దేవ దేవా ! నీకు తెలుపంగలేము
అందాల సురభియే అగచాట్లనొందె
నందనవనమెల్ల నాశనమయ్యె
ఉర్వీతలమ్మున హోమాగ్ను లుడిగె
సర్వమ్ము ధ్వంసమై స్వర్గమ్ము చెడియె
భరియింపఁజాలమీ బాధల నీవె
కరుణింపవలె మమ్ము గాపాడుకొఱకు
తనయుల కొఱకునై దశరథరాజు
పొనరించె పుడమిపై పుత్రకామేష్టి
ఆరాజవర్యుడు నతని భార్యలును
ధారుణి నతినీతి ధర్మవర్తనులు
ఉదయింతువో యిక నుర్విపై నీవు
అదలింతువో యిక నసురుల నెల్ల

కే మొనరింతువో యెటుల చేయుదువో
స్వామి నీవే మాకు శరణు, వేవేగ
ధరణి దైత్యుల జంపి ధర్మమ్ము నిలుప
తరుణ మేతెంచెనో కరుణాత్మ" యనగ
హరియును దయతోడ నౌగాక యనుచు
సురలను వెనుకకు తిరిగి పంపించె.

శ్రీరాము జననము

క్షితిపైన రాక్షసవ్రతతుల బాధ
లతిశయించుట గాంచి యంతకంతకును
సురల కిచ్చిన తనవరము దలంచి
హరియెంచె ధరణిపై నవతరింపంగ
భూమీశ్వరుని పుత్రకామేష్టిఫలము
ఆమూలమూలలం దంతటగూడ
ఆనందమొసగంగ వ్యాపించె వేగ
రాణులు గర్భిణు లైనట్టివార్త
రాజుల్లసిల్లెను ప్రజలుల్లసిలిరి
రాజిల్లిన దయోధ్య రమ్యోత్సవముల
వనజనేత్రుం డిన్ని దినముల కిపుడు
తనకోర్కె మన్నించి దయజూచె ననుచు
పట్టజాలని మోదభరమున రాజు
పట్టపురాణులవద్దనే యుండు
రాణులకేలోటు రానీయకుండ

తానె స్వయమ్ముగా ధరణీశుఁ డరయు.

పరువు లెత్తెడు కాలపరివర్తనమున
తిరిగివసంతమ్ము ధరణి కేతెంచె
మలయానిలముతోడ మధుపమ్ముతోడ
పులుఁగుపాటలతోడ పుష్పాళితోడ
చైత్రసుందర నూత్నచైతన్య మలరి
ధాత్రిసర్వము దివ్యధామమై తనరె
కలలుగాంచిన రాజు కనువిందు గాఁగ
నెలలుక్రమమ్ముగా నిండె రాణులకు
ఎదురుచూచుచునుండె నినకులస్వామి
ఉదయించు టెపుడని యూరకే రాజు
తోఁచనీయని యొక తొందరలోన
చూచుచుండిరి జనుల్ శుభవార్తకొఱకు
ధాత్రి పునర్వసుతారతో వచ్చె
చైత్రశుద్ధమ్మున సదమలనవమి
శ్రీసతీయుతుఁడయి శ్రీరంగపతియె
కౌసల్య కానాడు కనులలో మెఱసె
బహుళ భాసుర వియద్భాగమ్మునందు
మహనీయమై వెల్గె మార్తాండ రోచి,
గ్రహరాజి యుచ్చమై గగనాన వెలిగె
విహరించె పవనమ్ము విమలమై భువిని
అర్కవంశమ్మున కభివృద్ధికరము

కర్కాటకమ్ము లగ్నమ్మగుదెంచె
ఘణఘణాత్కారమ్ము ఘంటామనోజ్ఞ
రణితమ్ము వినవచ్చె రాజసౌధమున
నరపతి దశరథు నయనోత్సవమ్ము
ధరణికి నిర్మల ధర్మోదయమ్ము
కౌసల్యగర్భాన కమలనేత్రుండు
భాసమానుఁడు పుట్టె వైకుంఠవాసి
కోమల నవనీల కౌముదవర్ణుండు
రామచంద్రుఁడు ఘనశ్యామసుందరుఁడు
మదమత్త దురితోగ్ర మాలిన్య దైత్య
విదళనోద్యమ బాహు విక్రమమూర్తి
తనచిట్టి బంగారుతండ్రిని పొదివి
తనపొత్తిళుల దాచె తల్లి కౌసల్య
హరిదివ్యశంఖమ్మె ఆవిర్భవించె
భరతుఁడై కైకకు భవ్యవర్తనుఁడు
లలి నాదిశేషుఁడే లక్ష్మణుం డగుచు
సలలిత చక్రమ్ము శత్రుఘ్నుఁ డగుచు
లలనసుమిత్రకు కలిగిరి కవలు
విలసిత సంగ్రామ విక్రమాకృతులు
వారిజాసనునాజ్ఞ పాటించి సురలు
వారివారి నిజాంశపాటవమ్మలర
వనచర వరులయి వసుధాతలాన

జననమ్ము నందిరి యనిమిషు లెల్ల
రాక్షసవధవేళ రామచంద్రునికి
అక్షీణధృతి సాయ మాచరించుటకు.
ఏనాడు శ్రీరాముఁ డిలఁబుట్టినాడొ
ఆనాడె ప్రేలిన దసురుల గుండె
ఆరంభ మైనది యానాడె సర్వ
ధారుణి యందున ధర్మోద్యమమ్ము
శ్రీరామ తైజస శ్రీరేఖ కనరె
తోరమై పుణ్యప్రసారమై దిశల
అవతారమందెను హరి యిలమీద
దివిజుల బాధలు తీరిపోయినవి
దివిమీద మ్రోగెను దేవదుందుభులు
భువిపైన గురిసెను పుష్పవర్షములు
తనయందు నిఖిలమ్ము దాచినహరినె
తనయురమ్మున నాడు దాచెకౌసల్య
రాణులకనులలో ఆనాడు వెలిగె
మానిత మాతృత్వ మధురవీక్షణలు
కానక కానక కనినయందులకు
భూనాథవరులకు పుట్టిరి సుతులు
దేవతామూర్తులు దివినుండి వచ్చి
దేవలోకమె నాడు దిగినట్లు భువికి
సురుచిరమూర్తు లా సుతులు నల్వురకు

జరిపె వసిష్ఠుండు జాతకర్మములు
విందులు వేడ్కలు వివిధోత్సవముల
అందమై యలరారె ఆనాడయోధ్య
తనయులే యిల నిక తనతోడు నీడ
తనయులే సర్వమ్ము దశరథేశునకు.
అనుపమసుందరు లారాజసుతులు
జనులకెల్లరకును కనుదోయి వెలుగు
తనరాచకార్యమ్ము క్షణములో దీర్చి
తనయులయొద్దనే దశరథుం డుండు.

శ్రీరాముని బాల్యము

తల్లిదండ్రులు తమయుల్లమ్ము లందు
నుల్లాసమొదవుచు నుప్పొంగిపోవ
తడబడుపాదాల తలిరుబుగ్గలను
నడకల నేరిచి నవ్వుల నేర్చి
ఆటల నేరిచి యటునిటు తిరిగి
పాటల నేరిచి పరువులెత్తుచును
దినదినవృద్ధిగా దేదీప్యమాన
వినుతసుందరులుగా పెరిగిరాసుతులు.

అతులితశ్రద్ధతో నాసక్తితోడ
చతురధీమంతులై స్వల్పకాలమున

పరిణతబుద్ధు లాబాలురుకలసి
గురువువసిష్ఠుండు కూర్మిబోధింప
శాస్త్రముల్ వేదముల్ సకలధర్మములు
శస్త్రాస్త్రవిద్యలు సంపూర్ణరీతి
నేరిచి రెంతయో నిపుణతమీఱ
వారికి సాటిగావారు లేరనగ
ఆసోదరులు నల్వు రమలవర్తనులు
భాసురసద్గుణుల్ బలసముద్ధతులు
ప్రవిమల సోదర్యభావ మెన్నంగ
అవనిపై యీనల్వురన్నదమ్ములదె;
ఇమ్మగా శ్రీరాము నెలమిసేవించు
తమ్ములే ధరణిని తమ్ములనంగ
ఆనల్వురు కుమారులందుఁ జూడంగ
జ్ఞానరసాపూర్ణ సౌందర్యరాశి
రాముని శక్తియు ప్రతిభయువేఱు
రాముని వర్తనక్రమమది వేఱు
చూచును సర్వమ్ము సునిశితమదిని
యోచించు నెల్లప్పు డుల్లమ్మునందు
ధారుణియందున తనలక్ష్య మేదో
వేఱుగనున్నట్టి విధమున నుండు
ఏకాకిగా నుండ నెప్పుడు రాముండు.
కైకేయికడకేగి కాలమ్ము గడపు

ఆచిన్న శ్రీరాము నరసి కైకేయి
యోచించు నేదియో యుల్లమ్ము నందు
ఊరక యున్నప్పు డారాము బిలిచి
వీరులగాథలు వినిపించుచుండు
విలువిద్యలోఁగల మెలకువల్ చెప్పి
తలయూచు రాముని విలునేర్పు చూచి.

దనుజుల నణగింప దశరథనృపతి
చనునప్పు డతనికి సాయమ్మె కైక
దురమున చూపిన దోశ్శక్తి కలరి
ధరణీశు డిడె మున్ను వరములు రెండు.
ఆరెండు వరముల నప్పటి నుండి
కోరనేలేదామె ధారుణీ పతిని.
సకలశాస్త్రములందు సమరవిద్యలను
అకలంకనిధి రాముఁ డత్యున్నతుండు.
తనశక్తి యిసుమంత తక్కువ కేమి
అనుజుఁడు లక్ష్మణుం డతనితో సముఁడె
రమణీయమూర్తు లారామలక్ష్మణులు
తమజంట వీడరు తామెందుఁ జనిన
భరతశత్రుఘ్నులు భవ్యవిగ్రహులు
నిరతమారీతినే నిలుతు రొక్కెడను.

ప్రజ్ఞావిశేషులు బలసమున్నతులు
విజ్ఞాననిధులును విక్రమధనులు
ధరణి నేలఁగజాలు దర్పోగ్రులగుచు
పెరిగిన తనముద్దుబిడ్డల జూచి
ధారుణీనాథుడు తలఁచె నెమ్మదిని
వారికిపెండ్లీడు వచ్చిన దనుచు
అనుపమబలశాలి అతిశాంతమూర్తి
జనులమేలును గోరు సాధువర్తనుఁడు
రాముఁడన్నను ప్రీతి ప్రజల కందఱకు
రాముఁడన్నను ప్రీతి రాజున కెదను.

## యాగరక్షణము

ఇటులుండ నొక్కనా డేతెంచె నటకు
పటుతపశ్శాలి విశ్వామిత్రమౌని
మునికిని మర్యాద లొనరించి ప్రీతి
"పనియేమి చెప్పు డేనొనరింతు వేగ
నేనుధన్యుఁడ నైతి నీరాక వలన
మౌనీశ్వరా" యని మనుజేశుఁ డనఁగ
దశరథు నీక్షించి తపసి కౌశికుఁడు
విశదవాక్యముల నీవిధముగా ననియె.

"మెచ్చితి నీమాట మేదినీనాథ!
వచ్చితి ముఖ్యమౌ పనియుండి వినుము
నాయాశ్రమమున నే చేయుయజ్ఞమును
మాయావిరక్కసుల్ మాటుగా వచ్చి
మాంసరక్తములతో మలినమ్ము జేసి
ధ్వంసమొనర్తురో దశరథరాజ!
ఆరక్కసులఁ జంపి యజ్ఞమున్ గావ
నీరాము నంపగా కోరుచున్నాడ
భావింప బోవక బాలుఁడటంచు
వేవేగ రాముని నావెంటఁ బంపు
దనుజులఁ జంపగా జనియించినట్టి
అనుపమబలుఁడు నీతనయుఁడు రాజ!
దనుజుల జంపి నీతనయుఁడు వేగ
వెనుకకు శుభముగా విచ్చేయు ననగ
మునిమాట లాలించి మనుజేశుఁ డడలి
తనువెల్ల కంపించి ధైర్యమ్ము సడలి
కరములు జోడించి గాధేయుఁజూచి
పరిపరివిధముల ప్రార్థించె నిట్లు.
"పసిపాప రాముడాపాపాత్ములైన
యసురుల జంపునే యతిరాజ వినుము
ప్రాణమ్ము ప్రాణమీ రాముఁడు నాకు
వీని నెన్నటికిని విడనాడఁ జాల

బలవంత పెట్టక వదలుము నీని
వలయుచో నాసైన్యబలముతో నేనె
యరుదెంచి దైత్యుల నరుమూడగలను
కరుణింపు మాపైన గాధేయ" యనగ
"పనినెఱవేర్చెద నని ముందు పలికి
మనుజేశ యిప్డిట్లు మాట్లాడె దీవు
ఇనకులనరపతు లెవ్వరుగూడ
అనినమాటను తప్ప రవనిపైననుచు
గాధేయు డఱుచు గ్రక్కున లేచి
క్రోధమ్మునందుట గురువుగ్రహించి
"తనయుని బంపుము తడయక రాజ!
ముని వెంటనుండగా మన కేల భయము
ఘనశక్తిమంతుడీ కౌశికమౌని
వినుము మేలగును నీతనయుని కనిమె.
ఆముని వచనమ్ము లాలించి తుదకు
రాముని లక్ష్మణున్ రాజు పంపించె
బుమత లాయిరువురు పుత్రుల జూచి
కడుసంతసించెను కౌశికమౌని
సుతులార! మీకును శుభమస్తటంచు
పితయు వసిష్ఠుండు ప్రీతి దీవింప
మనముల భయమన్న మాటయే లేక
ఘనధనుర్బాణముల్ కరముల బూని

గురునకు తండ్రికి కేలుమోడ్చి మ్రొక్కి
అరిగిరి బాలకు లారాముని వెంట-

ధరణీశు తనయుల తన వెంట గొనుచు
సరయూజలమ్ముల స్నానమ్మొనర్చి
బల, అతిబలయని వెలయు మంత్రముల
నెలమి నాసుతులకు ఋషిచంద్రుఁ డొసగె
అలసట దప్పియు నాకలి లేక
విలసిల్లి రా మంత్రబలముచే వారు
వనమార్గముల వెంట బాలురిద్దఱిని
తన వెంటఁ గొనుచు నాముని యిట్టు లనియె
"విను ఈ వనమ్ముల మనుజులఁ జంపు
దనుజాంగనయొకర్తు తాటక యనగ
తిరుగు నెల్లరకును వెఱపుజనింప
పరులెవ్వ రామెను పరిమార్ప లేరు

వేయేన్గులబలమ్ము వెలయు నాయమను
నీయస్త్రములె రామ! నిర్జింపవలయు"
అనియేమొ గాధిజుం డనునంతలోనె
వినువీథి నొకవేయిపిడుగులు పడిన
ధ్వనితోడ నార్చుచు ధరణికంపించు
పదఘట్టనమ్ముల బాలురపైకి

అదలించుచును వచ్చె నసురి యొకర్తు
పర్వతగుహాయంత వక్త్రమ్ము దెఱచి
ఉర్వీసర్వము మ్రింగు నట్లేక మనర
ఆమెను జూపించి యామునీశ్వరుఁడు
"ఈమెయే తాటక ఈమెయే రామ!
ఆలోచనము వలదాడుది యనుచు
అలసింపక వేగ హతమార్పు" మనగ
వాసితోగ్రబలుండు బాలరాముండు
దూసెనెప్పుడు బాణమేసె నేవేళ
కనుమూసి కనువిప్పు కాలమ్ములోన
అనఘుఁడా రాముని యస్త్రసంహతిని
తల తెగి నెత్తురుల్ ధారలు గ్రక్క
ఇలగూలె తాటక కులగిరి వోలె
తాటకభయ మింక ధరణిలేకుండ
చాటగల్గిన రాము శక్తికి మెచ్చి
ఆ వనినున్న వారానంద పడిరి
దేవేంద్రుఁడే వచ్చి దీవించి యేగె
బాలుఁడా రాముని బాణప్రయోగ
కాలాగ్ని శిఖఁ జూచి గాధేయమౌని
"అసమానవీరుఁడ వగుదు వో రామ
వసుధలో నినుగెల్చు వారుండ రింక
పటుతర ప్రళయాగ్ని పాటవాభీల

చటులశక్తులు, దివ్యశస్త్రాస్త్రతతులు
నావద్దనున్నవో నాయన! వినుము
జీవితాంతము తపస్సిద్ధుడఁ గాన
వసుధపై వానితో పనిలేదు నాకు
అసురులగూల్ప నీకక్కఱయగును.
వానినిచ్చెద రామ! వరుస" గొమ్మనుచు
మౌని యొసంగెను మంత్రయుక్తముగ
అత్యంతసత్వమ్ము లాయాయుధములు
ప్రత్యక్షమై రాముపాదమ్ము లంటి
శ్రీరామ! మము నీవు చిత్తమ్ము నందు
కోరినంతనె వచ్చి వైరుల నెల్ల!
పరిమార్చి నీపని నెఱవేర్తు మనుచు
అరిగెను తమ తమ యావాసములకు.
రాముఁ డెఱింగిన రణవిద్య లెల్ల
నీమమ్ముతో చెప్పి నేర్పె తమ్మునకు
"మాన్యమౌ నీయస్త్రమహిమచే నేడు
ధన్యులమైతిమో తపసివరేణ్య!
పరిమార్తు మసురుల భయము లేకుండ
నెఱవేరు పూర్తిగా నీయజ్ఞ మనుచు
ప్రణతు లర్పించిన రామలక్ష్మణుల
మునియెత్తి దీవించె మోద మ్మెసంగ.

వారయోధ్యను వీడి వచ్చిన దాది
ఆరాజతనయుల నలరించు వేడ్క-
పూర్వరాజులకథల్ పుణ్యగాథలును
ఉర్వికిమేలైన సర్వధర్మములు
సకలమ్ము వచియించె సంయమివరుడు
వికసింప ఆరాచబిడ్డల మదులు.
ముని యట్టు లారాజతనయుల గూడి
తనయాశ్రమమునకు చనుదెంచి నంత
అచ్చటి మునికుల మ్మారాజసుతుల
ముచ్చటగాఁ జూచి ముదమందె మిగుల.

జన్మమ్మునకు సర్వసన్నాహములను
సన్నుతరీతిగా సలిపి గాధిజుఁడు
హితుల ఋషీంద్రుల నెల్లరఁ బిలిచి
క్రతుదీక్షఁ బూనెను క్రమవిధానమున
మాయావి దనుజు లేమార్గానకీడు
చేయుదురో యని యాయజ్ఞమునకు
ధరణీశుపుత్రులు శరచాపములను
కరములదాలిచి కాపాడుచుండ
విస్తృతమ్ముగ యాగవిధులు సర్వమ్ము
శాస్త్రోక్తరీతుల సాగుచునుండె.

అదనుగనెప్పెట్టుచు కదలి మెల్లగను
చదలపై మబ్బుల చాటున దాగి
క్రూరులై యజ్ఞమున్ గూల్పంగనెంచు
దారుణ చరితులు తాటకసుతులు
బలిమి మారీచసుబాహు లేతెంచి
కలుషమాంసాస్థికల్ క్రతువుపై నింప
సమకట్టు నంతలో గమనించి రాము
డమితవేగమ్మున నస్త్రమ్ము లేసి
ఒకట నామారీచు నుదధిలోఁగూల్చె
ఒకటసుబాహుని యుక్కడగించి
పటుశౌర్యవిభవుఁడా బాలునిజూచి
యటనున్నవారెల్ల రాశ్చర్యపడిరి
తక్కురక్కసులును దండెత్తి రాగ
గ్రక్కున దునిమి రా రామలక్ష్మణులు
అవరోధములు మఱి యగుపింపకుండ
సవనమ్ముక్రమరీతి సంపూర్తి యయ్యె
కనుగొని బాలుర కార్ముకవిద్య
మునులును దేవతల్ ముదితులైనారు.

భూమిధర్మము నిల్ప పుట్టిన హరివి
సామాన్యుఁడవు గావు రామ! యటంచు

రాముని పొగడి విశ్వామిత్రమౌని
ఆమోదముగ చాల ఆశీస్సులొసఁగె.

## మిథిల

అచటి మునీశ్వరు లాగాధిజునకు
వచియించి రొకమంచివార్త నీరీతి
మిథిలనుఁబాలించు మేటిభూవరుఁడు
ప్రథితుఁడౌ జనకుండు పరమధార్మికుఁడు
వినుతవిజ్ఞానియు వేదాంతి యగుచు
జనకుని కీర్తి జగమెల్లఁ బ్రాకె
అనుపమధార్మికుం డని ఖ్యాతిగొనిన
మునిశతానందుడు జనకుని గురువు
సవనవాటిక కయి జనకభూనాథు
డవని దున్నుచునున్న యవసరమందు
ధరణియేయొసఁగిన వరపుత్రియనఁగ
సరసత నాగఁటిచాలున నుండి
దివ్యతేజఃకళా దేదీప్యమాన
భవ్యసుందరి యైన బాలిక దొరకె.
లలితాకృతిని మహాలక్ష్మియే యిట్లు
వెలసెను మాయింటిబిడ్డయై యనుచు
సీత యంచామెను చెలువుగా బిలిచి

ప్రీతితో జనకుండు పెంచుచునుండె
సకలధర్మజ్ఞుడు జనకరా జసలె
అనుపమపండితుం డాచార్యవరుండు
వినినయంతన సర్వవిద్యలగూడ
జనకజనేర్చెను స్వల్పకాలమున
ఏవిష్ణురూపుడో హృద్ధియాధినాథు
డీవరలక్ష్మికం చెంతు రందఱును
సీతవచ్చిన దాది క్షితినాథు నింట
ఖ్యాతియు సంపద లభివృద్ధి గాంచె
ప్రవిమలాకార యాబాలిక యిపుడు
భువనైక సుందరి నవసూవరాంగి.

సర్వజ్ఞుండైన యాజనకుని యింట
పూర్వమ్మునుండియు పూజలం గొనుచు
ధరణిపై నెంతటి ధానుష్కుండైన
సరగున మోపెట్టి సారించలేని
గిరిశిఖరోన్నతం బురుభారమైన
హరుని విల్లొక్కటి యలరారుచుండు
ఆచాపమునుజూడ నాసక్తిపడుచు
యోచించునేదియో యుర్విజ సీత
సీతకు పెండిలి చేయం దలంచి
సీతకుందగినట్టి శ్రీయుతుండైన

వినుతగుణాఢ్యుని వెదకుచు తుదకు
జనకుండాలోచించి తనవద్ద నున్న
ధనువు మోపెట్టిన ఘనబలాఢ్యునకు
తనయ నిచ్చెదనంచు ధరణి చాటించె
భూపాలురెందఱో యేపుగా వచ్చి
చాపమెత్తగలేక చతికిలబడిరి
ఎవరియదృష్టమ్ము లెటులుండఁ గలవో
భువనైక పటుసత్త్వ భూషితుల్ వీరు
కనుక గాధేయ! యీ మనుజేశసుతుల
కొనియేగు మచ్చటి కనిరి యామునులు
అంతకుముందె యాయవనిజవార్త
స్వాంతమ్మునందు విశ్వామిత్రుఁ డెఱుఁగు
అలఘుతపస్వులీయతివరుల్ కూడ
పలికిరి శుభము నీబాలురిద్దఱకు
రామలక్ష్మణులకు రహిమించు శుభము
లామహీపతిపీట నలరుగాకనుచు
తనవెంటనిడుకొని దశరథాత్మజుల
మునిప్రయాణమ్మయ్యె జనకునింటికిని
తనవెంబడిని తక్కుమునులును గూడ
చనుదేర మనముల సంతసమ్మంది.

ఉర్వీశుతనయుల కుల్లాసమొదవ
పూర్వచరిత్రలు పుణ్యగాథలును
గిరులను గూర్చియు ఝరులను గూర్చి
పరిసర మునితపోవనముల గూర్చి
కడుముదమ్మున జెప్పి కథల నన్నిటినో
అడవులవెంబడి యాకౌశికుండు
సరగున యాత్రలు సాగించుకొనుచు
అరిగె గౌతమముని యాశ్రమస్థలికి
అడవిలో నచ్చట నచ్చెరు వొదవ
పడియున్న యొకపెద్ద పాషాణ మచట
రాముని పదధూళి రాలినంతటనె
భామగామారి శ్రీరాముని జూచి
ఎన్నాళ్ళకోయి నీ వేగుదెంచితివి
నన్ను రక్షింపంగ నారామచంద్ర!
బ్రతుకెల్ల రాయినై పడియుంటి స్వామి
మతియందు నీపాదమహి మమ్మెతలంచి
అనఘ! శ్రీరామ నీయడుగు సోకంగ
జనువు ధన్యంబయ్యె శాపమ్ము తీరె
పరమాత్మ! రాయినై పడియున్న నాకు
మరలలభించె నామానినీ రూపు.
ననుగాచినాడవు నాకన్నబిడ్డ
నన్ను బ్రోచితనుచు నానలినాయతాక్షి

ఆమునిగాథిజు నర్చించి ముందు
ప్రేమతోఁజూచుచూ రామలక్ష్మణుల
"భాసురగుణులార! భవ్యాత్ములార
చేసినతప్పున్న చెప్పినఁ బోవు
ననుచును దీనయై యనుకంపతోడ
వినిపించె వారికి తనకథ నిట్లు
"ఘనతపశ్శాలి యాగౌతమమునికి
ననుగుపత్ని నహల్య నతిపతివ్రతను
నాయందమునుఁ జూచి నన్నుఁ గామించి
ఆయింద్రుఁ డిటవచ్చి యత్నించెఁ గాని
అనుచితమిద్ది నీకమరేంద్ర యనుచు
వెనుకకుఁబొమ్మని విసరికొట్టితిని.

అరుదెంచి యొకరేయి యాశ్రమస్థలికి
పురుహూతుఁ డొకజాము పొద్దుండగానె
మోసాన కోడియై కూసిన యంత
భాసురమూర్తి నాపతియేగ నదికి
తపసి యిచ్చట లేని తరుణమ్ము జూచి
తపసిరూపమ్మును దాల్చి యింద్రుండు
నాదరిఁజేరగా నాభర్త యనుచు
నేదలంచితిఁగాని యింద్రుని మోస

మెఱుఁగలేనైతి నాహృదయమ్మునందు.
అరనిముసమ్ము నాయాత్మచలించె
ఆరుదెంచి గౌతము డంతలో నిటకు
సురపతిన్ నన్నును జూచి శపించె.
ఒడలెల్ల పళ్ళికల్ పడి యింద్రుఁడేగె
పడియుంటి నిచట నేపాషాణ మగుచు
"తపసివరేణ్యా! నాతప్పేమిలేదు
విపరీతమీ శాపవిధియేల నాకు
కరుణింపుమని ముని చరణమ్ములంటి
జరిగినకథను నేనెఱిఁగించి నాను.
రామచంద్రుఁడు వచ్చి రక్షించు కనుక
నామాటతప్పదో నాతి! యటంచు
శీతాద్రికి తపమ్ము చేయుట కొఱకు
గౌతముండేగె నోకరుణాత్మ రామ!
ఆనాటినుండియు నీనాటిదనుక
నేను పూనితినయ్య ఈశిలావ్రతము
ఇన్నాళ్ళకో రామ యేతెంచినావు
నన్నుమన్నింపగా నాతండ్రి" యనుచు
ఆతన్వి నుడువుచున్నంతలో నటకు
గౌతమునిచంద్రుఁ డేతెంచి ప్రీతి
తనసతిం గనుగొని తరుణిరూపమున

వినుతించె రాముని ఘనమహత్త్వమ్ము
ఆమునిదంపతు లాగాధిజునకు

ఆమోదమున జేసి రతిథిసత్క్రుతులు.
మేలగుమీకును మిథిలలోననుచు
చాల దీవించిరా బాలురిద్దఱిని

దరికి రామునిఁబిల్చి మరలయహల్య
ఎఱుఁగను రామ నిన్నెలమినుతింప
రాయినైపోయె నాబ్రతుకెల్ల వినుమ
నాయెడందయుకూడ రాయినై పోయె
చిత్తమ్మునందున శ్రీరామచంద్ర
మెత్తనిపలుకైన మిగులనేలేదు
తనయ నాపాలిటి దైవమైనావు
మనసులో నన్నిక మఱవబోకయ్యా
నినువీడలేని నామనసులో ప్రేమ
వినుమిట్టులేయుండు వేయేండ్లకైన
వెడలిరండిక మీరు వీరబాలకులు
వెడలిరండిక పెండ్లికొడుకులు కండు
ఆకడ జనకుని యాస్థానమందు
నాకుమారుడు శతానందుఁ డున్నాడు
ఇమ్ముగ నాదరమ్మొప్పార నచట

తమ్ములవలె జూచు మిమ్మాత్మఁ డనుచు
పొలుపార వారల లలితఫాలములు
తిలకమ్ములను దిద్ది దీవించె మరల.
మురువులై బాలుర మోములయందు
చిరుసిగ్గులొలికె నాతరుణిమాటలకు
అనురక్తి రాముఁ డహల్యను జూచి
నను నేల పొగడెదు నాతల్లి నీవు
నీపతిభక్తియే నిన్నుఁ గాపాడె
మాపయి నెనరుంచు మాయమ్మ యనియె.
వినయవిధేయతల్ విలసిల్ల పిదప
మునిదంపతులకును మ్రొక్కి సద్భక్తి
ప్రియముగా గాధేయఋషిపిల్చుచుండ
పయనమై వెడలి రాబాలురిద్దఱును.

వనవీథిరాము డాముని వెంటఁజనుచు
మనసులో నేదేదొ యనుకొనసాగె
నను నేలకొనివచ్చె మునిచంద్రుఁ డిటుల
దనుజుల నేగతి దునుమాడినాను
వనములో రాయి నాపదధూళి సోకి
వనితగా మారి నన్గొనియాడు నేల
జనకుని వీటికి మునిచంద్రుఁ డిపుడు
నను నేలమరల తాఁగొనిపోవుచుండె

ఈరహస్యమెఱుంగు నీతఁడేయనుచు
శ్రీరాముఁడెదలోన ఋషికిని మ్రొక్కె.

శ్రీరాముడు మిథిలకేగుట

చనుదెంచె మిథిలకు మునికౌశికుండు
మనుజేశుసుతులతో మునులతో గలసి
మునులరాకను విని ముదమంది మదిని
జనకభూపతి వచ్చి సత్కృతుల్ సలిపి
రాజతేజమ్ముతో రాజిల్లుచున్న
సౌజన్యరాశులు శరచాపధరులు
వీరమూర్తులు మునీ! వీరెవ్వ రనఁగ
కౌతుకమ్ములరంగ గాధేయమునియు
ప్రీతితో జనకుని వీక్షించి పలికె

"ఓ రాజ[illegible]! చూడు మీవీరబాలకుల
వీరు దాశరథులు విద్యాతిశయులు
రవికుల తిలకులు రామలక్ష్మణులు
సువిశాలకీర్తులు సోదరుల్ వీరు
సన్నుత రణరంగ సాహసుల్ నాదు
జన్నమ్ము గాపాడ చనుదెంచినారు
వినుమయ్య శ్రీరాముఁ డనుపమబలుడు

దునిమె నొక్కమ్మున దుష్టతాటకను
బలిమి మారీచ సుబాహు లేతేర
తలపడి వారల దర్పమ్ములణచె
తక్కరక్కసులను ధైర్యమ్ము తోడ
చక్కగా లక్ష్మణుం డక్కజమ్మెసగ
పతిశాపమున వనపాషాణమయిన
సతియహల్యాదేవి శాపమ్ముబాపె
పావనుం డీరామభద్రుండే రాజ!
శైవచాపముఁజూడ చనుదెంచె" ననియె.
జనకుడా దశరథుతనయులఁ జూచి
మనమున ముదమంది చనవుమీఱంగ
"మీరటోయీ, నాదుమిత్రుండు కన్న
గారాముబిడ్డలు రారండనంగ
జనకునికడకేగి చరణయుగ్మమున
వినయులై మ్రొక్కి రా బిడ్డలిద్దఱును
వారికిదీవనల్ వావిరి నిచ్చి
కూరిమి దశరథు కుశలమ్ము నడిగి.
మునులతో నారాజతనయులతోడ
చనుదెంచు మఱునాడె సభలోని కనుచు
గాధిజునకు జెప్పి కడువేడ్క తనదు
సౌధమ్మునకు నేగె జనకభూవరుడు.

విశ్వామిత్రుని చరిత్రము

అంత శతానందుఁ డచటికివచ్చి
సంతసమ్మున రామచంద్రునిఁ జూచి
శ్రీరామచంద్ర నాచిట్టితమ్ముండ
ఏరీతి నాచిత్త మెఱఁగింతునోయి
ఎప్పుడువత్తువో యిటకు శ్రీరామ!
ఎపుడు చూతునోయని యిచట నేయుంటి
దైవమైవచ్చి నాతల్లికిమరల
నీవొసంగితివోయి నిజపూర్వరూపు
ధరణిపై ఆచంద్రతారార్క మగుచు
స్థిరముగా నీకీర్తి చెలువారుగాత
ధరణికంటకులైన తాటకాదులను
పరిమార్చితివి నీవు బాలుఁడ వయ్యు
ప్రథితధనుఃకళా ప్రభుమూర్తి వీవు
మిథిలలో నీకిక మేలగు గాక
ఎంతధన్యులు మీర లిర్వురు రామ
చెంతఁ జేరిచె మిమ్ము శ్రీగాధిసూని
ఎఱుగరేమో మీర లీమునిమహిమ
మెఱిగింతు నని యాతఁ డీరీతి నుడివె.

కుశ నాభుపౌత్రుండౌ కుశికువంశమున
యశమునందిన గాధి కాత్మజుండితడు
రాజుగా పుట్టియు బ్రహ్మర్షి యయిన
రాజితోత్తమతపః ప్రథమాన మూర్తి
పరమవీరుండు మహాపౌరుష శాలి
ధరణి రాజులయందు తలమానికమ్ము
వాసినిగాంచె విశ్వామిత్రుండనంగ
కౌశికుండనగను గాధేయుండనంగ
వినుండీ మహాముని విమలాన్వయమ్ము
వినుతకీర్తినిగాంచె విశ్వమెల్లెడల
అనఘుండీ గాధేయమునికి సోదరియె
అనుపమసాధ్వి సత్యవతీలతాంగి
అవనివాసుల శ్రేయమరసి నేటికిని
ప్రవహించు కౌశికీవాహిని యనగ

ఒకనాడు గాధేయుండుల్లాసమొదవ
సకలసైన్యముతోడ చని వేట కడవి
మునివసిష్ఠునిగని ముని చేసినట్టి
ఘనగౌరవములకు మనమునం దలరి
అకలంకుడా ముని యాశ్రమమందు
సకలేప్సితార్థముల్ సమకూర్చునట్టి
కామధేనువుం గని కాంక్షించియడిగె

"ఓ మునిచంద్ర! నీకొసగెద నిపుడె
కోరినధనముల గోసహస్రముల
ఈరమ్యధేనువు నిమ్ము నా" కనుచు
తన హవ్యసంధాత్రి తనతపశ్శక్తి
తన దివ్యసురభిని ముని యీయననియె.
బలిమి నాధేనువున్ పట్ట కౌశికుండు
చలమున తనసేన సర్వమంపించె
తనసత్కృతుల నంది మనుజేశుం డింత
చెనటికార్యము నిట్లు చేయునే యనుచు
దీనయై తిలకించు ధేనువున్ గావ
మానియంపెను తనమహిమదండమ్ము.
ఆశ్చర్యకరముగ నాదండ మొకటె
నిశ్చేష్టులను జేయ నిఖిలసైన్యముల
మునిబ్రహ్మదండమ్ము ముందునం దూలి
తనసేనయిటులౌట గని గాధిసూతి
ఇదిగదా దివ్యమౌ ఋషిశక్తి యనుచు
మదిదలపోసి యీ మహి నెన్నటికిని
రాజతేజముకంటె బ్రహ్మతేజమ్మె
పూజనీయమ్మయి రాజిల్లు ననుచు
తనరాజపదమును క్షణములో వీడి
మునివేషమున తప మొనరింప సాగె

వసుధపైఁ దానును బ్రహ్మర్షి యగుచు
అసమానవిఖ్యాతి నందఁ దలంచి.
తనరాజ్యమునువీడి మునియైన యట్టి
ఘనుఁడు శ్రీరామ యీగాధేయుఁ డనగ
అవని సర్వము నిండి యతని తపోఽగ్ని
దివిపయి బ్రాకెను, దేవేంద్రుఁ డడలె
అప్పుట మేనక యనినట్టి యొక్క
యచ్చర చనుదెంచు టరసి కౌశికుడు
వలపొంది మేనున పులకించిపోయె
కలసె వారల కనుల్ కలసె మేనులును
కోరికతీరి శకుంతల యన్న
గారాము కొమరిత కలిగె వారలకు.
సతియయి దుష్యంతక్షితిపతి కామె
ప్రతిభాన్వితుండగు భరతుని గనియె
విధినిర్ణయమ్మట్లు విచ్చెసె వారి
దది యొక శృంగార మ్మదుగాథ రామ!

తనశక్తి యీరీతి తగ్గినందులకు
మనమున నీగాధిముని కొంతవగచి
తాను బ్రహ్మర్షియై తనరు నందనుక
మాన నంచును పూనె మరల తపమ్మొ
కల్లోలమగుచు నాఘనతపోవిధికి

ముల్లోకములుగూడ తల్లడిల్లినవి
పరగున బ్రహ్మయు శంభుడు గూడ
అరుదెంచి, గాధేయ! ఆపు మీ తపము
నీవు మహర్షివై నిఖిలమ్మునందు
పావనఖ్యాతితో వరలుదు వనిరి.
అంతతో పొందక నాత్మసంతృప్తి
పంతాన సాగించె పటుదీక్ష నితడు
నీవు బ్రహ్మర్షివై నెగడితి వనుచు
శ్రీవసిష్ఠులె వచ్చి చెప్పినవఱకు
ఒకవంక క్షాత్రమ్ము ఒకవంక బ్రాహ్మ్య
మకలంకముగ చూపి యలరిన ఘనుడు
ఇతనిమాటకు ధాత్రి నెదురుండ బోదు
చతురాస్యునంతటి శక్తిమంతుండు
అల త్రిశంకుని కొఱ కంబరమందు
వెలయఁ జేసిన వాడు వేఱొక దివిని—
ఎంతవిన్నను తృప్తి యెఱుఁగదీ యెడద
ఎంతచెప్పిన తీర దీతనిమహిమ
శ్రీకౌశికులు మఱి శ్రీవసిష్ఠులును
లోకకళ్యాణైక లోలాత్ము లరయ
శ్రీరామ, వీరియాశీస్సులే నీకు
ధారుణి రక్షయై తనరునటంచు

ప్రేమతో వీక్షించి రామలక్ష్మణుల
కై మ్రొక్కి భక్తితో కౌశికఋషికి
అరిగె శతానందుఁ డానందమొసఁగ
మరల శ్రీరామునే మది దలంచుచును.
ఆరేయి రేయెల్ల శ్రీరామమూర్తి
ఆఋషిమహిమయే యాత్మలోఁ దలఁచె
ధరణికౌశికుఁడేమి గురుదేవుఁడేమి
పరమదైవము లని భావింపసాగె.

ఒప్పుగా తనదారి నొకక్రొత్త వెలుఁగు
విప్పారుచున్నట్లు వీక్షించె మదిని
ఆనాఁ డయోధ్యలో ఆవసిష్ఠుండు,
ఈనాడు వనములం దీ కౌశికుండు
ఆనాడు కౌసల్య ఈనాఁ డహల్య
మానుగనిచ్చిరి మంచిదీవెనలు
తనకివి రక్షలై తనరు గాకనుచు
మనసునం దెంచెను మాటిమాటికిని.

## శివ ధనుర్భంగము

మునులతో రామలక్ష్మణులతో గలసి
చనుదెంచె మఱునాఁడు జనకునిసభకు

గాధేయుఁ డత్యంత కౌతుకం బలర
ఆదరమ్మున వారి నందఱఁ గాంచి
మునుల రాకకు చాల ముదమంది మదిని
జనకరాజాదరించె సకలసత్కృతులు.
ఇనతేజు లీబాలు రెవ్వరటంచు
మనముల నబ్బురం పడిరెల్ల రచట
సుందరుల్ దశరథసుతుల నిద్దఱిని
అందఱి కెఱిఁగించి యమనీశవరుఁడు
పదివేలభటులను బంపి తెప్పించి
పదిలమ్ముగా సభాప్రాంగణమ్మందు
శివునిచాపమునుంచి చెప్పెనీరీతి
ప్రవిమల గంభీర భాషణ మ్మలర

శివుఁడు మున్నివింటి చేతనే మహిని
వివిధదైత్యులఁ గెల్చి విజయమ్ముఁగొనిన
శివకార్ముకమ్మిది చిరకాల మయ్యె
శివునుండి క్రమముగా చేరె మాయింట.
దీనిని మోపెట్టు భూనాథునకును
జానకి నీయఁగా చాటించినాను
భూనాథులెందఱో పొలుపుగా వచ్చి
దీనినెత్తఁగ లేక దీనులై చనిరి.
శ్రీరాముఁ డిద్దాని చేతితో నెత్తి

సారించెనేని మాజానకి యిపుడె
పరమానురక్తి నీబాలరాఘవుని
పరిణయమ్మగు నని వచియించి నంత
జనకుని మాటలు విని కౌశికుండు
కనుగొనె శ్రీరాము ననురాగ మొదవ.
చిరునవ్వొ రాముఁడు శివునివిల్జూచి
చిఱునవ్వొ మునిరాజు శ్రీరాముఁ జూచి
సాహసమూర్తియు శ్యామసుందరుఁడు
బాహుబలాఢ్యుఁ డాబాలుని వైపె
తిలకించె సీతయు తెరవెన్క నుండి
తలపులం దతనిపై వలపుజనించి.
సభలోని జనులెల్ల చకితులై చూడ
త్రిభువనవీరుఁ డాశ్రీరాముఁ డంత
కరిరాజు చెఱకును గ్రహియించు నటుల
కరమున లీలగా హరుని విల్లెత్తి
ధీరుడై నిలఁబడి నారిని లాగి
సారించబోవ నాశైవచాపమ్ము
ప్రళయకాలాభీల భయదాభ్ర రావ
ఫెళఫెళార్భటులతో విఱిగె ముక్కలుగ
బలువైన హరువిల్లు భగ్నమై పడగ
కలగె సముద్రముల్ కంపించె ధరణి

జానకీరాములు జనకభూవిభుడు
మౌనికౌశికుడును మఱి లక్ష్మణుండు
దక్క తక్కినవారు ధరణి లమూర్ఛిల్లి
ఎక్కడనున్న వారక్కడే పడిరి
ఆనందమునదేలె నవనీశు డపుడు
ఆనందమునదేలె మౌనిగాధిజుడు
చిఱునవ్వుతో సీత నరసె రాఘవుడు
చిఱుసిగ్గుతో జూచె సీత రాఘవుని
ప్రణయరాశీభూత భవ్యసుందరులు
జనకజారాముల సరసశృంగార
సారవీక్షణపంక్తి సభ నెల్లయెడల
తోరమై మల్లెల తోరణాల్ కట్టె.

## సీతారాముల కళ్యాణము

ధరణీశచంద్రుడా దశరథేశ్వరున
కరుదారు కానుకల విరివిగా నిచ్చి
సరవి నీశుభసమాచారమ్ము దెలిపి
పరివారములతోడ బంధులతోడ
కొనిరండు మిథిలకు కూర్మితో ననుచు
తనమంత్రులను బంపె జనకభూవిభుడు
రాముని శౌర్యమ్ము రాముని జయము
రాముని పరిణయ రమణీయ వార్త

లాలించి యుప్పొంగ నా రాజవరుఁడు
ఆలించి యుప్పొంగి రతని రాణులును.
గురువుల సచివుల పరివారములను
సరగున రావించి సకలబంధువుల
రాముని పరిణయ రమ్యోత్సవమున
కామోద మింపార హర్ష మింపార
మణిరత్నరాశులు మహనీయవస్త్ర
కనకభూషణములు కానుకగాఁ గొనుచు
రాజవైభవముతో రాణుల తోడ
రాజిత కాంచన రథముల నెక్కి
పయనమై దశరథ వసుధేశుఁ డేగ
రయమున మిథిలకు రాణ దీపింప.
వినయవిధేయుఁడై పెండ్లి వారికిని
జనకరా జెదురేగి స్వాగత మ్మిచ్చి
వినుత మంగళవాద్య విలసన మ్మలర
కొనివచ్చె విడిదకు కూర్మి లింపార.
మునుముందు దశరథ మనుజేశుఁ డేగి
ముని గాధిసుతునకు మ్రొక్కి పూజించి
నీవల్ల మానీంద్ర మావంశ మెల్ల
పావనమ్మాయెనంచు భక్తితోఁ బొగడె.
లలితమూర్తులు రామలక్ష్మణుల్ వచ్చి
తలిదండ్రులకు మ్రొక్కి రెలమి దీవింప

తనయులం గనినంత తనరి హర్షమున
తనువెల్ల పులకించె దశరథ నృపతి.
తనయుల ముద్దాడి మనసు తీరంగ
అనురాగమున నెల్లు లాశీస్సు లిడిరి
బంగారు నగలును పసుపుకుంకుమలు
రంగారుచీరలు రాణులు గొనుచు
సంతసమ్ములరంగ జనకు సౌధమున
నంతిపురమ్మున కరిగి యచ్చోట
వరలక్ష్మివలెనున్న ధరణిజం జూచి
మురిసిపోయిరి నాడు ముగురు రాణులును
ఆకూర్మిపలుకుల కాముద్దులకును
ఆకౌగిలింతల కంతమే లేదు.
వినయమ్ము తోలాడు ప్రియభాషణముల
జనకుఁ డాహ్వానింప సభకరం డనుచు
మఱునాడె దశరథ మనుజేశ్వరుండు
పరివారములతోడ నరుదెంచె సభకు
వారిపురోహితుల్ వరుసగా మరల
వీరిపురోహితుల్ విమలవాక్యముల
ఇరువంగడమ్ముల సురుచిర కీర్తి
నెఱిఁగించి రాసభ నెల్లవారికిని.
ప్రీతితో జనకుండు వినిపించె నంత
సీతాకుమారిని శ్రీరామునకును

తనపుత్రినూర్మిళన్ తగ లక్ష్మణునకు
తనసోదరుడు కుశధ్వజుని పుత్రికలు
నుతగుణల్ మాండవీ శ్రుతకీర్తుల నిక
స్తుతమతుల్ భరతశత్రుఘ్నుల కిచ్చి
ఘనముగ పెండ్లిండ్లు గావింతు ననుచు.
తనసమ్మతిని దెల్ప దశరథేశుండు
గురువుల్ పలికి రాశ్రోత్రజంటలకు
చిరతరాయు శ్శుభ శ్రీరస్తటంచు-
మంచిముహూర్తము మఱునాఁడె యనుచు
అంచితమ్ముగఁ జేసి రన్నియేర్పాట్లు
మహనీయ కళ్యాణమంటప మ్మందు
బహువిధాలంకార వైభవ మ్మెసఁగె
నలువురుసోదరుల్ నలుగులతోడ
సలలిత మంగళస్నాతకు లైరి
మంగళగౌరిని మహితసద్భక్తి
పొంగుచు బాలికల్ పూజించినారు
ప్రవిమల శృంగార రమ్యవిగ్రహులు
నవనవోత్సాహు లా నాల్గుజంటలును
వారివారల పెద్ద లారతు లిచ్చి
కూరిమిమీఱఁగా గొనివచ్చి నారు
పెండ్లికుమారులన్ పెండ్లికూతుళ్ళ
పెండ్లిపీటలపైకి విలసితరీతి

విధివిధానమ్ములు వేదఘోషలును
మధురగీతమ్ములు మంగళధ్వనులు
జనులకోలాహల సమ్మోదారవము
మునుల ఆశీర్వాద నినదమ్ము లెసఁగి
ఆ వధూవరులకు నందఱ కచట
వైవాహికములయ్యె వైభవమ్ములర.
తలలపై నానూత్న దంపతు లెలమి
తలఁబ్రాలులు పోసికొంచలరిరి మిగుల.
సీతమ్మ తమ్మిపూ చేతులయందు
బ్రీతిగ నవపద్మరాగమ్ము లగుచు
శ్రీరాము శిరమందు జారుచు వచ్చి
శ్రీరాము మృదుతను శ్రీకాంతిఁ దనరి
లలితేంద్రనీలాల చెలువమ్ము తోడ
విలసిల్లు ముత్యాల తలఁబ్రాలు భువిని
తనరారు శుభములై జనుల కటంచు
వినుతించి రచ్చటి విజ్ఞులెల్లరును.
జానకీరాముల కైన వివాహ
మానందకళ్యాణ మవనికే యనుచు
దివినుండి దేవతల్ దీవించినారు
భువి జను లానంద పులకితులైరి.
దానధర్మమ్ములు తగినవేడుకలు

## సీతారాముల కళ్యాణము

కానుకల్ విందులు కడువైభవముగ
జనకుండు దశరథమనుజాధిపతియు
నొనరించినా రెల్లరోహోయనంగ.
వియ్యమ్ము లందిన వేడుకే గాని
వియ్యాలబిగువులు వినిపించలేదు
రమణీయవైభవారామ మామిథిల
విమలవైకుంఠమై విలసిల్లె నాడు.

## పరశురాముని గర్వభంగము

పరిజను లశ్వమ్ము లరదముల్ గజము
లరుదారు మణిభూషణాంబరాదులును
కూరిమితో పెండ్లికూతుండ్ర కపుడు
సారెగా నిప్పించి జనకభూవిభుఁడు
ఒప్పుగ నెల్లర కుల్లాసమొదవ
అప్పగింతలుబెట్టె నత్తవారికిని.
కొడుకుల రాణుల క్రొత్తకోడండ్ర
కడుప్రీతి దశరథుం డిడుకొని వెంట
పయనమయ్యె నయోధ్య పట్టణమ్మునకు
ప్రియమార జనకుడు వీడ్కో లొసంగ.

అరిగిరో లేదా వారనతిదూరమ్ము
ధరణి కంపింపగా తనవేగమునకు
అరచుచు నార్చుచు నట్టహాసమున
పరశురాముఁడు వచ్చి వారి యెట్టెదుట
దారిలో నడ్డమై యారాముదెసను
తేరిపాఱగఁజూచి తీవ్రకోపమున
"భూమిపై భార్గవరాము ఁడేనుండ
రాముఁడ నని నీవు ప్రబలుచున్నావు
చెలఁగి నాగురువైన శివునివిల్విఱిచి
విలసితదర్పాన విఱ్ఱవీగెదవు
అవమాన మిద్ది నాకపచార మిద్ది
ఎవరురా నీవు నన్నెఱుగవో యేమొ
ఇరువదియొకమాఱు ధరణిపాలురను
తరిమిచంపినయట్టి పరశురాముఁడను
నాచేతిలోనున్న నాయాయుధమ్ము
ఈచాపమును బట్టి యెక్కిడుమిపుడె
కానగనెంతు నీగర్వాతిశయము
కానిచో నడుగైన కదలనీ" ననియె.
పరశురాముని శక్తి నెఱుగునుగాన
సరగున దశరథుం డరిగి ప్రార్థించె
"పదములంటెదనయ్య భార్గవరామ !

వదలుము కరుణ నీబాలు"నటంచు
పాటించ కాపల్కు పరశురాముండు
మోటుగా నేదియో మాటాడబోవ
రాముఁ డాభార్గవరామునిఁ జూచి
"ఏమయ్య విప్రుఁడ విట్లు కోపమున
రావచ్చునే నీవు రాజులపైకి,
నీవు విప్రుఁడవని నేనూరకుంటి
ఏది నీకార్ముక మ్మిటుదె" మ్మటంచు
మీదకు లంఘించి మేటిదర్పమున
పరశురాముని చేతి బాణాసనమ్ము
కరమున లీలగా గ్రహియించి నిలచి
సరగున యానారి సారించిపట్టి
పరశురాముని దెస శరము సంధించి
"పరుగిడబోకు నీపదములు రెండు
విరుగనేసెద" నంచు విక్రమింపంగ
వడవడ వడకుచు భార్గవరాము
డడలి శ్రీరామున కంజలిఁ బట్టి
దశరథ రామ! నీదర్పమ్ము నాకు
విశదమయ్యెను నన్ను విడువుము దయను
అరుగుచుంటి మహేంద్రగిరికి నే నిదియె
ధరణి నాబ్రతుకింక తపములోఁ గడుప

ఎఱుగుదు నీశక్తి కెదురు లేదనుచు
ఎఱిఁగియే నాచాపమిచ్చితి నీకు
నావెన్క లోకాలఁబ్రోవ నోరామ!
నీవింటిబాణము న్వ్యర్థపు మటంచు
అరిగెనదృశ్యుఁడై యాశ్చర్యమొదవ
శరవేగమును మించి పరశురాముండు.

కరమునం దావిల్లు గైకొనినపుడె
పరశురామునినుండి బాలునియందు
పటుతేజ మొక్కటి ప్రవహించి చేరె
నటనున్నవారల కత్యద్భుత మంద.
తనయున కాపద తప్పినందులకు
మనమున దశరథమనుజేశుఁ డలరె.
మునివసిష్ఠుం డంత ముందుకు వచ్చి
అనియె నీ రీతిగా నందఱు వినఁగ
ప్రథితుఁడు భార్గవరాముఁ డాతండు
ప్రథితుఁడు దశరథరాముఁ డీతండు
తేజోమయోత్కట దివ్యప్రభావ
రాజితమూర్తు లీరాము లిద్దఱును
హరియంశసంభవు లవనిధర్మమును
తిరముగా నిల్పంగ నరుదెంచి రనగ

# పరశురాముని గర్వభంగము

పరశురాముని దివ్యబలతేజములకు
నెఱపిరి ప్రణతులు నిహాతి నందఱును.

## అయోధ్య

మనుజేసెఁ డంతట మరల సాగించె
తనపట్టణమునకు తనప్రయాణమ్ము
దారిలో రాముఁడు తనరథమ్మాపి
ధారుణీజాతను తనవెంటఁ గొనుచు
అరుదెంచి గౌతము నాశ్రమమ్మునకు
తరుణి యహల్యకు తనమ్రొక్కు లిడియె
"నాతండ్రి రామయ్య! ననుమఱ్వబోక
ఏతెంచినావయ్య సీతమ్మతోడ
దైవమ్ముగా నిన్నె భావింతు" ననుచు
దీవించి కళ్యాణతిలకముల్ దీర్చి
వారలనంపెను వాత్సల్య మెసఁగ
వారితో దూరమ్ము వచ్చి యహల్య
"కనుగొంటె సీత! యీమునిపత్నికెంత
అనురాగభావమో మనమీద ననుచు
జనకజ చిబుకంబు చనవున బుడికి
చనుదెంచె రాముడు తనరథమ్మునకు.

విమలదిగ్విజయుఁడై వీరుఁడై యలరు
రమణీయమూర్తి శ్రీరామునితోడ
నలువురుకోడండ్రు నలువురుసుతుల
విలసితమూర్తుల వెంటఁబెట్టుకొని
వసుధేశు డరుదెంచు వార్త నాలించి
వెస నయోధ్యాపురవీథు లన్నిఁటిని
మంగళతోరణ మంజులమ్ములుగ
రంగారు మణిదీపరాజితమ్ములుగ
సలిపి యాపురజనుల్ స్వాగతమ్మిడిరి
చెలువుగ దశరథక్షితినాథునకును.
వాసిగ మంగళవాద్యమ్ములెసఁగ
సేసలు పూవులు చేరి జల్లుచును.

ఉత్సాహముగ రాజయోధ్యకుఁ జేర
ఉత్సవమ్ములతోడ నుప్పొంగెపురము.
అందమ్ములై సాగె నన్నిచోటులను
విందు లలంకృతుల్ పెండ్లివేడుకలు.
ఏనాఁ డెఱుంగని యింపుతో నెసఁగె
ఆనందధామమై యానాఁ డయోధ్య.
సమకూర్చి రనుకూలసౌఖ్యముల్ గలుగు
రమణీయసౌధముల్ రాజపుత్రులకు.

రామునిశౌర్యమ్మొ రామునిజయమె
రామునికళ్యాణ రమ్యగాథలనె
చెప్పుకొందురు తమచిత్తమ్ములలర
చెప్పినకథలనె చెప్పుచుమరల
కౌసల్య మనమున కడుహర్షమమర
ఏసమయమునఁనో యేతెంచుచుండి
సీతను రాము నాచిట్టిదంపతుల,
ప్రీతితోఁజూడని వేళయే లేదు.
ఏతెంతు రెల్లప్పు డెవ్వరోయొకరు
సీతను రాముని ప్రీతితోఁ జూడ.
ఏవసిష్ఠుఁడో యట కేతెంచినపుడు
కావించు రాముఁడు కడుతీవ్రచర్చ
ధరణిరాజ్యము నందు ధర్మపాలనమె
నరనాథులకు గూడ సరియైనదనుచు
రామునిమాటలో రామునిమదిని
యేమున్నదియు గూడ దెలియఁగ రెవ్వరును.

సీతను రాముఁడు ప్రీతితోఁజేరి
సీత! సర్వమునీవె క్షితియందు నాకు
భువి నీవె నాపూర్వపుణ్యమటంచు
కవుగిలి బూనును కరమనురక్తి
ఒకపరి మాటాడ కూరకయుండు

ఒకదిన మేదియో యోచించుచుండు
సీతకు నుడువడు చిత్తమ్మువిప్పి
సీతను చూడని రీతిగాతిరుగు
అనుకూలుఁడో కాదో తనకు శ్రీరాము
డనుచు నాజానకి యాత్మలో వగచు
రాముని హృదయమ్ము గ్రహియింపలేక
భూమిజ దీనయై పొగులుటఁ గాంచి
రాముఁడు తనయంత రయమున వచ్చి
ప్రేమతో సీతను పిలిచి నవ్వించి
దినమెల్ల నామెను తేలించుచుండు
ననురాగ మొలికించి యానంద మెసఁగ
లీలగా నిట్టు లా బాలదంపతుల
కాలమొం డొకరీతి గడచుచు నుండె.

శ్రీరామాయణమునందు బాలకాండము

సమాప్తము



శ్రీరస్తు

# శ్రీమద్రామాయణము

## అయోధ్యాకాండము

### పట్టాభిషేక ప్రయత్నము

శ్రీరాముఁ డొకరీతి చిత్తమ్మునందు
వైరాగ్య మూనిన వార్తలాలించి
తనరామునింగూర్చి దశరథనృపతి
మనమునం దొక్కింత వనటను బొంది
సకలసమర్థుఁడు సాధువర్తనుఁడు
ప్రకటిత బహుశౌర్య బాహుబలుండు,
అన్నివిధమ్ముల నర్హుఁడై యున్న
సన్నుతుం డీరామచంద్రుని వేగ
నిలుపుచో యువరాజ లలితపీఠమున
తొలఁగు నీవెతలని తలపోసి మదిని
తెలియజేయఁగ తన తలఁపు నెల్లరకు
పిలిచె నామఱునాడె పేరోలగమ్ము.

సభకువచ్చిన సర్వసభ్యులఁ జూచి
ప్రభు విట్లు గంభీరభణితి వాకొనియె

గురువులార అమాత్యవరులార నాదు
పురజనులార ఓ పుణ్యాత్ములార !
సరవి మీసహకార సత్కృతివలన
జరిగె నిన్నాళ్ళు నా పరిపాలనమ్ము
ఇలనేలి వేలాదియేడు లీవఱకు
అలసితి వృద్ధుఁడ నయితినిఁగూడ
భూపాలనమ్ము నాబుజములనుండి
నా పెద్దకొమరుఁడు నయవర్తనుండు
రామచంద్రునికీయ నామత మ్మిద్ది
యామోద మగునె మీ రేమందు రనిన
వదనమ్మునందు నా వసుధాధిపతికి
మొదటున్న గంభీరముద్రను గాంచి
భీతినందిన సభ్యు లాతనిపల్కు-
లాతతప్రీతితో నాలించి లేచి
శిరములువాల్చి యాక్షితినాథుముందు
పరమగౌరవమున పల్కి రీరీతి
ధరణి పాలించి యోదశరథరాజ !
నిరుపమకీర్తితో నెగడితి వీవు
సన్నుతసౌఖ్యముల్ జనులకు గూర్చి
కన్నతండ్రివి పోలె కాపాడినావు
నీయంతటి ప్రసిద్ధనృపతి లేడనఁగ
మాయాత్మలను నిన్ను మఱవ లేమయ్య,

మా జన్మ ధన్యమై మహి కిక మీద
భూజనవంశ్యుండు పురుషోత్తముండు
రామచంద్రుడు మాకు రాజగు నంచు
నీమాట నాలించి నిజముగా రాజ
అమితహర్షాత్ములమైతిమి మేము
సముచిత మ్మవని కీసత్కార్య మిపుడు
ఈమంచిమాట మాకెల్లవారికిని
ఆమోద మామోద మానంద మనుచు
మమ్మారు సభ్యులు ముక్తకంఠముల
సమ్మతిఁ దెలుపఁగా జననాథుఁ డలరె.
మఱునాఁడె సుముహూర్త తరుణ మటంచు
గురువర్యుఁడు వసిష్ఠుఁ డెఱిఁగింపగానె
అమితసమ్మద మంది రందఱు జనులు
అమితసంభ్రమహర్ష మందెను రాజు.
తానె యేగి వచించె దశరథనృపతి
రాణికౌసల్యకీ యానందవార్త
అత్యంతముదముతో నామెచిత్తమ్ము
నృత్యమే యొనరించె నింగి కుప్పొంగి
రాముని సీతను రప్పించి వేగ
ఆమోదమున తెల్పి యామంచివార్త
వారిచే మ్రొక్కించి శ్రీరంగపతికి

వారికి నిప్పించె వ్రతదీక్ష నాడె
సీతయు రాముఁ డాచిట్టిదంపతులు
మాతకౌసల్యకు మనసులో నపుడు
హరియు లక్ష్మియువోలె నలరారినారు
ధరకు వైకుంఠమే యరుదెంచి నట్లు.
శ్రీరామ పట్టాభిషేకమ్ము కొఱకు
ఆరంభమై సాగె నన్నియత్నములు-
శ్రీవిష్ణురూపు డా శ్రీరామమూర్తి
కేవియో యూహాలు ఏవియో కలలు
ఆరాటమే గాని యారేయి యెల్ల
శ్రీరామునకు కంటికూరుకే లేదు-
"క్షితిమీద నానాటి కతిశయ మ్మొందు
దితిజులఁ గూర్చు నీదీక్ష యేమయ్యె
కమలాక్ష! యానాడు కరుణతో నీవు
అమరుల కిచ్చిన యభయ మేమయ్యె,
కరణీయమైన నీశౌర్యమ్ము దీర్చి
ధర నేలవచ్చు నా తరువాత" ననుచు
కనులలో నమరులై కనుపించి నట్లు
మనమున రాముని కనుపూన మయ్యె
తనకును వల దిప్డు ధరణీశపదము
పినతల్లి కైకయు అనిన దిట్టులనె

తలపు లీరీతిగా కలఁచుచు మదిని
తెలవాఱె రాముని కిలమీద నెట్లొ.

ప్రథిత కోసలరాజ్య పట్టమ్ము గొనెడు
పృథులోత్సవ మ్మది జేసె రాముసికి
కడుసంతసమ్మును కౌతుకమ్మలర
గడపగా దగినట్టి గడియయే కాని
మనసీడు తనతోడ మాటాడబోడు
తన మనోనాథుడా యినకులస్వామి
జనకజ కొకభీతి జనియించియిట్లు
వెనువెంట రాముని విడనాడకుండె.

మంథర

ఆదినుండియె కైకసౌధమ్మునందు
దాదిగా పనిచేయు దాసి యొకర్తు
కొకిబికి గూనును గుజ్జురూపమ్ము
మకురుమానిసియైన మంథరకలదు.
అది యెంతచెప్పిన అంత యాకైక
కది యన్నమాటల కెదురాడబోదు
అడుగు వేయగలేక అటునిటు నడచు
మడగుజ్జు వంకర మంథరం జూచి
పరిహాసమున కమ్ము లిరుగడవైచి

పరువెత్తజేయును బాలరాఘవుడు
తననేల రాముఁ డిట్లొనరించు ననుచు
మనమున కోప మూ మంథర కెపుడు

కనుగొనె మంథర కైకసౌధమున
పనిచేయువచ్చు చా ప్రత్యూషమందు
ఎచ్చటజూచిన యేముఁ గనిన
వచ్చిన యతిథులే బారులుతీరి
అత్యంతసుందర మ్మగు తోరణములు
ముత్యాలముగ్గులు ముందువాకిళుల
రాజితాలంకృతుల్ రత్నదీపాలు
రాజమార్గములెల్ల రమ్యమ్ములయ్యె.
శ్రీరామ పట్టాభిషేకోత్సవములు
ప్రారంభ మగుచుండె రాజసౌధమున

గుండెలో ఛట్టున కోపమ్ము రేగ
మండుచు మంథ రా మాటలాలించి
పడగొట్టకున్న యీ పాడుకార్యమును
పుడమిని మంథరై పుట్టలేదనుచు
పరువెత్తి ద్వారముల్ భళ్ళున తెఱచి
అఱవసాగెను కైక నదటున లేపి.

"చీమైన కుట్టని చెన్నున నిచట
ఏమొ యిట్లుంటివి యింకను నీవు
నీకొంప మునిఁగెనే కైకమ్మ తల్లి
నీకెట్లు చెప్పగానేర్తునో కాని
రాముఁ డీరోజున రాజగునంట
ఏమున్న దింక నీభూమిపై నీకు
కౌసల్యమేడలో కసవు లూడ్వంగ
దాసీతనమె నీకు వ్రాసినారేమొ
సడ్డింపులకు మధ్య చచ్చిపుట్టుచును
గడ్డిపోచకు గూడ కావు నీవింక
నెత్తికెక్కించిన నీదు మగండె
మొత్తుచున్నాడు నీమెత్తనఁ జూచి
కైక నీమంచినే కానకున్నావు
నాకేల నేపోదు నాదారి ననగ -
వేగమె కైకయు వెనువెంట నేగి
ఆగవే మంథరా యనియామె నాపి
"ఏమిటే నీగోల ఏమంటి వీవు
రాముఁడు రాజైన ఏమైనదిపుడు
రాజు పెద్దసుతుండు రాముడే కదటె
రాజు కావలసిన ప్రథము డాతండె

ఐనను మదిని నీవనుకొన్నమాట
మానక చెప్పవే మంథరా!" యనఁగ
"చెంతకు మెల్లగా చేరి మంథరయు
ఎంత చెప్పిన నీకు సుంతైన కూడ
తెలియదే కైక నీ తెలివితెల్లార.
తెలుపు మంటివి గాన తెలిపెద వినుము
ధరణికి రాముడు ధరణీశుఁడైన
తరువాత నీబిడ్డ భరతుఁ డేమగునె
ఆతఁ డెంతటిపెద్దొ యీతడు నంతె
ఈతలంపదియేల నితడు నీసుతుడు
భరతుఁడు లేనట్టి తరుణమ్ము చూచి
జరుపుచుండెను దీని చల్లగా రాజు
సరకుసేయక నిన్ను సవతిపుత్రుండు
ధరణికిరాజైన మఱునాడె వినుము
పొలములో నొకచీడపురుగును బట్టి
దులిపినట్లుగ నిన్ను దులిపివై చెదరు.
నీమంకుతన మిక నామీదగాదు
భూమీశుపై జూపి పొందుము సుఖము
చెప్పెద నొకమాట చేయు మారీతి
తప్పిన యెడల మంథరమీద ఒట్టె
వరములు రెండిచ్చె నరపతి నీకు

నెఱవేర్పుమను మింక నిలబెట్టి నేడు
వనికి రామునిఁబంప పదునాలుగేడు
లోనరింప భరతుని మనుజనాథునిగ
ధరణి నీమంచి నీవరయు మిం''కనుచు
మఱుమాట లేకుండ మంథర యేగె -
తోచెను మంథర దుర్మంత్రిమందు
యోచింప తనకేదో యుత్తమపథము
ధరణికి రాజౌను తనపుత్రుఁ డింక
పరులమాటల నేల పట్టించుకొనగ
విసమెల్ల తలకెక్కి విసవిస కైక
ముసుగుదన్ని పరుండె మూలమంచమున.

## కైక వరములు

శ్రీరాము పట్టాభిషేకమ్ము కొఱకు
చేరి రందఱు ప్రజల్ చిత్తము లలర
సమధికశోభతో సాకేతమందు
సమకూర్పఁబడె సర్వసన్నాహములును.
ఆనాడు దశరథు నాత్మలో నున్న
ఆనందమున కొక్కయవధియే లేదు.
ఇలనేలు రాముఁడు పృథ్వీశుఁ డగుచు

ఫలియించినవి తనకలలెల్ల నేడు
తానె స్వయమ్ముగా తనముద్దుభార్య
రాణికైకకు జెప్పి రమణీయవార్త
తనతోడ నామెను కొనివచ్చుకొఱకు
తనరి యుప్పొంగుచు దశరథుం డరిగె.

వేసినతలుపులు వేసినట్లుండి
మాసినరంగుతో మకమకలాడి
మురువుగా నెప్పుడు తిరిగెడునట్టి
పరిచారికలు లేక పనివారు లేక
కళమాసి యున్నట్టి కైకసౌధమ్ము
కళవళమందుచుఁ గాంచి యానృపతి
గదులెల్ల వెదకి యాకనకసౌధమున
తుదకొక్క చీకటిగదిలోన నొదిగి
నగ లలంకారముల్ దిగదీసి వైచి
వగచుచు మంచాన పడియున్న కైక
నరసి నిర్విణ్ణుఁడై ధరణీశుఁ డామె
దరిఁజేరి మెల్లగా తడిమి ప్రేమమున
"శ్రీరామమూర్తి నీగారాముబిడ్డ
ధారుణీపతి యగు తరుణమ్మునందు
ఏమె యిట్లుంటివి వోకోమలీ యిప్పుడు
ఏమైన లోపమ్ము లేర్పాటులందు

జరిగెనా చెప్పుము సవరించుకొందు
తిరిగి నీకిటువైపు తెలుపవే" యనఁగ

"త్రాచుపా మటులగా లేచి యాకైక
నీచెడ్డతనమెల్ల నేనెఱింగితిని
కైకకు ధరణిపైఁ గావింపఁదగిన
చీకాకు లన్నియుఁ జేసి యోరాజ!
ఏమెఱుంగని రీతి నిపుడు నామీద
ప్రేమ నటించగా విచ్చేసినావు
పుడమిని నాపాట్లు పడఁదు నన్నింక
విడువు" మంచును కైక వెక్కివెక్కేడ్చె.

ఆమెమాటలకు రాజాశ్చర్యమంది
ఏమె నాకైక నీకెవరెట్టి యెగ్గు
చేసిరో చెప్పుము శిక్షింతు నిపుడె
వాసిగా యేదైన వాంఛ నీకున్న
నారాణి నాకైక నాకంటివెలుగ
ధారుణి నీకంటె లేరు నాకెవరు
అరయగాలేను నీయాగ్రహ మ్మింక
ఎఱిగింపు నీకోర్కె నెఱవేర్తు ననగ -
"మనుజేశ! యటులైన మంచిగా నిపుడు
వినుమయ్య నామాట" లనుచు నాకైక -

"ఎఱుగురే మున్ను నాకిడినట్టి రెండు
వరము లిప్పటి కీవు నెఱవేర్పలేదు"
రాణిమాటలకంత రాజడ్డువచ్చి
దీనికే నీకింత దిగులేల కైక,
అడిగిన దెప్పుడు నే నిడని దేనాడు
కడువడి నెఱవేర్తు నుడువుమీ వనగ.

చెప్పెద నాకోర్కె క్షితిని నీమాట
తప్పకు మినవంశ ధరణీశవర్య,
ఒనరించి భరతుని మనుజాధిపతిగ
వనికి రాముని౯ పంపు పదునాలు గేండ్లు
వినుచుంటి వో రాజ! యని కైకమరల
విన్నవించె మున్మారు తనవరమ్ములను-
శూలాలతో చెవుల్ చూడించినట్లు
ప్రేలిన ట్లౌక వేయిపిడుగులు తలను
వినలేక ఆకైకయనిన పల్కులను
మనుజేశుం డచటనే మహిని మూర్ఛిల్లె
తెలివొంది, మిక్కిలి దిగులుతో రాజు
తలచుచు ఆరాణిపలుకులే మరల
వీనిని నిజముగా రాణి పల్కినద
వీనిని నిజముగా వింటినా చెవుల

ననుచును విభ్రాంతుడయి కొంతవడికి
తనదుఃఖమెల్లను తనరి కోపముగ
కనులు నిప్పులు గ్రక్క కైకను జూచి
"హరహరా! ఇవివెట్టి వరములే కైక
శిరమును ఖండించు శరములు కాక
వసుధపై మఱి వేఱె వరములు లేవె
పసికూన రాముపై పగయేల నీకు
ధరణీశుఁ డగుగాక భరతుఁడే యింక
అరుగుచేలనె రాముఁ డడవులఁ బట్టి
కన్నపుత్రునికన్న కడుకూర్మితోడ
మన్నించితివి రాము నిన్నటివఱకు
ఇంతలో నేమయ్యె నెడదలో నీకు
ఇంతటి విసముండు టెఱుగనే నేను
ననువీడి రాముఁడు వనులకేగిన-చో
మనలేనె క్షణమైన మహిమీఁద వినుము
నీవె నా అందాలనిధివంచు నెంచి
పూవుఁదోలల బెట్టి పూజించినాను
కౌసల్యకును లేని గౌరవమ్మిచ్చి
వాసిగాఁ జూచితి పదిరెట్లు నిన్ను
దానికిబదులు నాతలమీఁద నిట్లు
లీనిప్పుమంటల నిపుడు పెట్టితివి

పదములనంటి నిన్ ప్రార్థింతు కైక
వదలవే రాముని వదలు" మనంగ.
సరకు సేయక సుంత జననాథు మాట
చురచురజూచె నాసుదతి కైకేయి -
భూమీశుండా కైకబుద్ధి నెఱుంగు
ఏమైనసరె పీడదామంకుతనము -
తలచుచు తలచుచు తనమదర్గతిని
విలపించి కైకమ్మ విడదని యెంచి
నా రామ! నాతండ్రి! నా చేతులార
అరణ్యములకు నిన్ననుపగావలెన
మనలేను రామ! నిన్నడవులకు బంపి
అనియేమొ అనబోయి అనలేక మదిని
దురపిల్లి దురపిల్లి శిరమును వాల్చి
ధరణిపై మూర్ఛిల్లె దశరథరాజు.
మనుజేశుకిట్టులే పనవుచు నుండు
తనమాట తేల్చుకోదలంచి యా కైక
పిలిపించె రాముని వేగ రమ్మనుచు.
పిలిచిన క్షణమందె వేగమే యచటి
కరుదెంచి రాముండా యిరువురింజూచి
వెఱగందె నేదియో జరిగిన దనుచు.
కైకమాట్లాడదు కాసంతయేని

భూకాంతుఁ డచటనే పొగులుచు నుండె
సన్నుతాత్ముఁడు తనజనకు మొగాన
ఎన్నఁడు లేనట్టి కన్నీరు జూచి
కైకవద్దకు నేగి కాళ్ళకు మ్రొక్కి
"భూకాంతుఁ డిటులుండె పుడమిమూర్ఛిల్లి
ఏమి మాట్లాడవు ఏమైనదమ్మ
రాముఁడు చేసెనా యేమైన తప్పు
మనసిచ్చి తెలుపవే మాత" యనంగ
వినవచ్చి రాముని ప్రియమైన పలుకు
కనుదోయి విప్పి యా మనుజనాథుండు
తనకాళ్ళకును మ్రొక్కు తనయుని గాంచి
అరుదెంచినావె నాయయ్య నీవనుచు
మరలశోకించుట నరసి యా కైక
"ఏమియు కాలేదు రాముడా వినుము
భూమీశుఁ డిచ్చెను పూర్వము నాకు
వరములు రెంటి నా వరముల నేను
ధరణీశు నడిగితి నెఱవేర్పు మనుచు
ఒనరించి భరతుని మనుజాధిపతిగ
వనులకు నిన్నంప పదునాలు గేండ్లు
దీనికే ఆగ్రహమ్మూని మీతండ్రి
మౌనమ్ముతో నిట్లు మాట్లాడ డనుచు

కైక రాముఁ జూచె కడుఁ బ్రియమ్మార
కైకకు మ్రొక్కి యాకరుణీయమూర్తి
తన చేతులందున జనకుని గొనుచు
అనునయింపఁ దొడంగె వినయభావమున
"ఇంతమాత్రమున కో యినకులతిలక
చింతింపఁ దగునె నీచిత్తమం దిట్లు
భరతుఁడుగూడ నా సరివాడు కాడె
త్వరగ నేనడవికి పదునాలుగేడు
లరిగివచ్చెదను నీచరణసేవలకు
ఎందుల కడిగెనో యీతల్లి పలుకె
సందియ మ్మొందక జరుపుమీ" వనియె
ప్రాచీదిశన్ నాఁడు పటుబంధురముగ
తోచిన మబ్బుల తొలగించుకొనుచు
అరుణోదయంబయ్యె నర్కుని తీవ్ర
కిరణమ్ము లంతంత ధరణిపైఁ బ్రాకె
రాముని యభిషేక రమ్యోత్సవమున
కామోద సుముహూర్త మరుదెంచుచుండె.
సచివులు గురువులు సామంత నృపతు
లుచితాసనమ్ములం దుండిరెల్లరును.
భూమీశుఁ డావెన్క రాముఁడు గూడ
ఏమికారణమొ వారేగి యీవఱకు

కైకసౌధమునుండి కదలి రారైరి
ఈకడ సుముహూర్త మేతెంచె ననుచు
శ్రీవసిష్ఠులె యేగి చేరి రచ్చోటి
కావెక్క చనిరంద అచటికే వేగ.
ఏదేని యవరోధ మెనయంగ బోలు
కాదేని వారేల కదలి రారనుచు.
అపశకునమ్ములే యన్నిమూలలను
విపరీతమయి తోచె వీథులయందు.

ఏగిరో లేదో వారెల్ల రచ్చటికి
వేగమే సాకేతవీథులయందు
ఆపురియందుండి యన్ని చోటులకు
వ్యాపించె రాముని వనవాసయాత్ర.
నిలుచున్నవా రట్లె నిశ్చేష్టులైరి
పలుకాడలేక యావార్త నాలించి.
సలలితమ్ముగ రాజసౌధమ్మునందు
సలిపెడు వేడుకల్ స్తంభించిపోయె.
వలదంచు కైకకు వసుధేశుఁ డేల
పలుకడో, ఇవియేటివరములోయింక
రాముడు లేనట్టి రాజ్యమేమగును ?
రాముడు లేనట్టి భూమి యేమగును ?

తనయునిపై ప్రేమ తనకుండగాక
వనులకు రాముని పంపునే యిటుల
నిలువెల్ల విషమున్న పలుగాకియనుచు
పలికిరి కైకను తలకొక్కమాట.

కైకగృహమ్మున కడుదీనుఁడగుచు
శోకమూర్తిగ నున్న భూకాంతు జూచి
కౌసల్యయు సుమిత్ర కడువడి నేగి
చేసినా రుపచారసేవలు పతికి.
కైక వైపై జూచి కౌసల్య యడిగె
ఏకతమ్మున కైక! యిట్లు చేసితివె
భూకాంతు నిన్నాళ్ళు పోలుపునటించి
నీకనుసన్నలో నిలుపుకొన్నావు
వరములపేరిట ధరణీశు నిపుడు
నరకమ్ము పాల్జేసి నవ్వుచున్నావు.
పసికూన రాముని వనికంపుటేల
కసితీరలేదో యీకౌసల్యపైన,
ధరణిపు సేవైన జరుపంగ నిమ్ము
కరుణించి మమ్ము నో కైకమ్మతల్లి
అనివేడ్చు కౌసల్య నట్టెయూదుకొని
కనుల సుమిత్రయు కన్నీరు గార్చె.

జరుగుచున్నట్టి యీసంకుల మ్మెమొ
యెఱుఁగ నేరక పాప మిసుమంతగూడ
అత్తమామలు పడు నార్తినిఁ జూచి
చిత్తమ్ము క్షోభించి చింతించి చాల
వెన్నంటెరె రాముని వెనుక నే నిలిచె
విన్నదనమ్ముతో చిన్నారి సీత.

అకడ లక్ష్మణుం డాగ్రహుఁ డగుచు
కైక చేతకు రోసి కత్తిని దూసి
భరతుఁడో గిరతుఁడో వరములో యేమొ
యెఱుఁగను ధరణి నేనేమియుఁ గూడ
రాముని గాదని రాజ్యపీఠమున
సామమ్ముతో వచ్చి చరణమ్మునుంచు
దురితుని బట్టి నాకరవాలధార
కెఱ సేతునని ముందు కురుక బోవంగ
వేగమే లక్ష్మణున్ వెనుకకు నిలిపి
క్రీగంటితో జూచి శ్రీరామమూర్తి.

ఇల్లెల్ల నీరీతి నెల్లర ముందు
కల్లోల మగుటను గాంచి రాముండు
తల్లికి తండ్రికి తలవాల్చి మ్రొక్కి
మెల్లగ నిట్లనె నెల్లరు వినఁగ.

"ఏలయ్య తండ్రి! నీలీల వెతకు
పాలయి పరితాపబాధ నొందుటలు
నినుజూచి తల్లియు నేలపైఁ దూలి
కనువిప్పకున్నది కాంచుమో తండ్రి
పదునాలుగేండ్లును వనసీమలందు
పదిరోజులుగ గడ్పి వచ్చి రావలెదను
మిమ్ముఁగొల్చు భరతుఁడు సముచితరీతి
రమణమీఱంగ మీరామునివలెనె.
కైకలో స్వార్థమ్ము నాకుఁ గన్పడదు
కైక వాక్యమ్మునె కానిమ్ము తండ్రి
సత్యసంధులు భాను సద్వంశనృపులు
నిత్య మీకీర్తిని నెగడ నిమ్మింక
పితృవాక్యపాలనా ప్రియవర్తనుండు
క్షితిని రాముండన్న కీర్తి నాకిమ్ము
కానల నాకేమి కార్యమ్ము కలదో
పోనిండు నను వనభూముల" కనుచు
తల్లిదిక్కై రాముఁ డల్లన మ్రొక్కి
"తల్లినీకేల నీ తగనిభయమ్ము
అడవులకేగి నీయనుగు రాఘవుఁడు
గడియలో వచ్చు నీయడుగులకడకు
కొడుకులకంటెను కోడండ్రకంటె

కడుముఖ్య మతివకు గాంతుఁడే కాదె
సతులకు సచ్ఛీలవతుల కెల్లపుడు
పతిసేవయే కద పరమధర్మమ్ము
వేలాదియేడు లీ పృథివీతలమ్ము
పాలించి మాతండ్రి వార్ధక్యమందె
సేవింపుఁడమ్మ మీచెల్లెండ్రు నీవు
పావనచరితు డీ వసుధేశు నింక
భరతశత్రుఘ్నులు భవ్యవర్తనులు
జరుగనీయరు మీకు జగతినేలోటు
నానిశ్చయ మ్మిది కానల కేను
పోనెంతు నాతండ్రియానగా నెంచి
సెలవిండు నాకింక తలిదండ్రులార !
నిలిపెద మిమ్ము నే నెమ్మది" ననియె
తనమూలమున నిట్టి తగనిదుఃఖమ్ము
జనులకుఁ గలుగుట కనుగొని కూడ
పలుకైన నాడక పటుధీర యగుచు
నిలచియుండిన కైక కెలమి కైమోడ్చి
కానకేగుదు నింక కరుణించి తల్లి
ఆనతీవే యని యడిగె రాముండు
వినినంతనే రాముఁ డనిన వాక్యములు
జనులకు గుండెలు ఝల్లుఝల్లుమనియె

నారలకిచ్చెను వడిగ తెప్పించి
నారబట్టలు కైక నలువురిమధ్య
కురులను ముడివెట్టికూర్చి రాముండు
ధరియించె నారలు తపసివేషమున
భూమిజ యుండకను రామునివీడి
రాముని ప్రక్కనే యామె చేరినది.
ఆకూన జానకి ఆమె యేమెఱుగు
కైకయె నారలు కట్టబెట్టినది
ఎంతటికఠినాత్మ యీకైకయనుచు
చెంతనున్న జనులు ఛీ యనుకొనిరి.

గురునిపాదములకు గురుపత్ని కంత
ధరణిజా శ్రీరాము లెఱగిరి భక్తి
శ్రీవసిష్ఠులు లేచి శ్రీరాము నరసి
దీవనలిచ్చి యో దివ్యావతార !
పుడమిని దనుజుల బెడదలడంగు
అడవులకిక వేగ మరిగి రమ్మనిమె.
కడుతీవ్రదృష్టితో కైకనుఁజూచి
కడు కూర్మి సీతను కౌగిలిబట్టి
అరిగిరావే బిడ్డ యని యరుంధతియు
ధరణిజన్ దీవించి శిరము మూర్కొనియె

తానును తరలెను తపసివేషమున
కౌసల్య కన్నతోఁ గలసి లక్ష్మణుఁడు
పురజనుల్ బారులై కరములు మోడ్చి
"అరుదెంతు మేమును నడవుల" కనగ

శ్రీరామచంద్రుండు పౌరులఁ జూచి
ధారుణీశుని వీడి యూరెల్ల వీడి
మీరేలరావలె శ్రీరాము వెనుక
మీరిట నుండుఁడం చూరట బలికి

ధరియించె రాముఁడు తమ్మునిఁ గలసి
శరచాపముల భుజస్కంధమ్ములందు
రథమరుదెంచెను రాము నానతిని
రథమెక్కబోవగా రాముడు సీత

కన్నీరుగార్చుచు కౌసల్య వచ్చి
క్రన్నన జానకిన్ కౌగిలిం బూని
"ఎన్నఁడీ వెఱుగవే యెండకన్నైన
చిన్నారిబిడ్డ నాసీతమ్మతల్లి
నారలుధరియించి కూరలేతినుచు
నేరీతి నడవుల నీవుండగలవో,
మాయావి రక్కసుల్ మసలుచుండెదరు
ఆయరణ్యమ్ములం దతిక్రూరులగుచు

అన్నలక్ష్మణ సీత అరయగావలయు
నన్నను వదినె నా యడవిమధ్యమున
అడవిలో సీత! నీ వరుగుచున్నపుడు
నడువుమీ యిరువురి నడుమనే యెపుడు
ఏపాపమును పున్నె మెఱుఁగని వార
లీపాప లడవుల కేగుచున్నారు
దేవతావరులార! దిక్పతులార!
కానరే యని యేడ్చు కౌసల్య నెత్తి
అనునయించి సుమిత్ర వెనుకకుఁ దీసి
మనసార దీవించి యనిపె వారలను
ఆ రాణికౌసల్య నరసి కన్నీరు
ధారగా నేడ్వని వారు లేరచట
పృథివిజన్ కరమూని యెక్కించి ముందు
రథముపై నెక్కిరి రామలక్ష్మణులు.
"అరుగుచుండెను రాముఁ డయ్యయో యదిగో
మఱియెవ్వరిక దిక్కు మహిని మాకనుచు
అరదమ్ము కనుపడి నంతటివఱకు
పురజను లేగిరి పురవీథి వెంట
క్షణములో పురవీథి గడచి యారథము
కనుచూపుదాటుచు కదలిపోయినది-
సరయూనదిం జేరి యరథమ్ము డిగ్గి

సరయూజలమ్ముల శిరములం దాల్చి
అడవులవెంట వారరదమ్ము మీద
కడువడి జేరిరి గంగయొడ్డునకు.

## గుహుడు

గుహుఁడు శ్రీరాముఁడు వనికేగు వార్త
జనపదమ్ములయందు వనసీమలందు
రాముఁ డేగుటకంటె ప్రాకె ముందుగనె
ఆ మూల నీమూల నన్నిచోటులను
నావను నడపి యానదియందు నెపుడు
పావనవృత్తిని బ్రతికెడు వాడు
గుహుఁడను బోయల కులపెద్ద కలఁడు
విహితుఁడు దశరథపృథ్వీనాథునకు

తనరథమ్మటనుండి వెనుకకుఁ బంపి
చనుదెంచె సతితోడ సౌమిత్రితోడ
రాముఁ డా పావన రమ్యస్రవంతి
కామోద మెసగంగ నంజలు లిడుచు
కాపాడవలె మమ్ము గంగా యటంచు
భూపుత్రి తలఁ దాల్చె నాపుణ్యజలము-

జనకజారాములఁ గనుగొని గుహుఁడు
మనమున నలరుచు ప్రణతు లర్పించి
"రామయ్య తండ్రి ! మారాజాధి రాజ !
మేము ధన్యులమయ్య మీ రాకవలన
చూచుటకొఱకు మీసురుచిరాకృతులు
వేచియున్నార మీ విపినమం" దనుచు
కరముల రాముని చరణముల్ కడిగి
శిరమునఁ దాల్చి యా శీతలవారి
చిఱునవ్వుచు గుహుండు శ్రీరాముఁజూచి
"పరమాత్మ, రామ ! నీపదధూళిసోకి
భామినిగా మాఱె పాషాణ మొకఁటి
ఏమౌనో నానావ యికమీద ననుచు
కడిగితి నీపాదకమలముల్ దేవ !
పుడమి నన్ మన్నించి బ్రోవవే" యనియె.
సీతకు రాముఁడు చేయూతనీయ
బ్రాతిగ ముప్పురిన్ పడవ నెక్కించి
చేరిచి యావలితీరమ్ము గుహుఁడు
శ్రీరామునకు మ్రొక్కి సెలవు గైకొనియె.

అరుదెంచి యాగంగ యావలిదరికి
ధరణిజన్ శ్రీరాముఁ డగసి నెయ్యమున

జానకీ తెలియునే యీనదీ ధార
లేనాఁడు దివినుండి పృథ్వికి దిగెనో,
పూతవర్తనుఁడు మాతాతల తాత
ఖ్యాతిని గన్నట్టి యాభగీరథుఁడు
చేసిన ఘనతపస్సిద్ధి యీగంగ
వాసిగా ప్రవహించు వసుధ నేటికిని.
భూపుత్రి ! చూచితే బోయవాడయ్యు
ఆ పేదమానిసి యాగుహుఁ డెంత
సదమలాత్ముఁడో; జానపదులందు నున్న
మృదువర్తనము భక్తి యదియంచుఁ జెప్పి
జనకజతో తన యనుజుని తోడ
వనసీమలంబడి పయనించె వేగ.

## చిత్రకూటము

ఇనరశ్మి చొరనీని ఘనవృక్షతతులు
వనమృగధ్వనులును పెనురాళ్ళతోడ
భీకరమ్మయి తోచి విపినమ్ము మొదట
ఆకర్షణీయమై యంతకంతకును
పులుగులతో నదీజలములతోడ
మలయానిలముతోడ నలరులతోడ

ప్రమదమ్మొసఁగి వారి పయనమ్ముసాగె
శ్రమయనిపించకే చాలదూరమ్ము
వారటు లోకకొంతదూరమ్ము నడచి
చేరిరి సుందర చిత్రకూటాద్రి
అచ్చటిశైలమ్ము లచటివాహినియు
ముచ్చటఁగొలుప నామువ్వు రచ్చోట
వనశోభ లరయుచు వసియింపసాగి
రనువైన యొకకుటి నందు నిర్మించి.

దశరథుని మరణము

ఇలువీడి శ్రీరాముఁ డేగిన క్షణమె
తలఁచుచు రామునే పలుమార్లు మదిని
అతిశోకమగ్నుఁడై యాత్మ చలించి
స్మృతిఁ దప్పి దశరథక్షితినాథుఁ డుండె.

కౌసల్యమేడకు కాంతునిఁ జేర్చి
కౌసల్యయు సుమిత్ర కడుభక్తితోడ
చేయుచునుండిరి రేయింబవళ్ళు
ఆ యువనీశున కన్ని సేవలును.
తెలివొందినపుఁడెల్ల తలచిఁ రాఘవునె
పలుకును రాజేదో తెలియనిరీతి

శోకించుచుండును సుతునికై మిగుల
కైకను తిట్టును రాకాసియనుచు.
సతులుచేసిన యుపచారమ్ము వలన
క్షితినాథునకు శాంతి చేకూరికొంత
కనులువిప్పి సుమిత్ర కౌసల్య తక్క
తనముందు కైకేయి కనరాక మదిని
మఱికొంత ధైర్యాన మనుజాధినేత
కరముల నిమిరి యాయిరువురుసతుల
పలికెనిట్టుల నొక పరితాపరేఖ
యలముచుండగ తన యాననమ్మందు.
పతిమొగమ్మున దుఃఖభావమ్ము జూచి
సతులును వినుచుండి రతిభక్తితోడ.
తడబడు పలుకుల దశరథుం డంత
పడతులఁ జూచి "యో భవ్యాత్మలార!
క్షితిపైన దేవతాప్రతిరూపులైన
సుతులను గన్నట్టి సుదతులు మీరు
మీవల్ల పొందెను మేదినిమీద
మావంశ మెల్లను మహితవిఖ్యాతి
హృదయమ్మునందు నాకేదియో బాధ
కదలసాగిన దిట్టి గడియయందైన
నుఘవకతప్ప దీయెడదయుందేను

నడువక దాచిన చెడుమాట యొకటి.
విలువిద్య నేర్చిన తొలిరోజు లవ్వి
విలసితరీతి నే వేట కేగితిని
కడుదూరమున నున్న కాసారమందు
బుడబుడమను ధ్వని పడిన దీచెవుల
అడవిజంతు వటంచు నాత్మలో దలచి
విడచితి నొకశబ్దభేదినై యెసగు
పటుశక్తి కలిగిన బాణ మయ్యెడను
అట కేగి చూచిన యంతనే నాకు
ప్రాణముల్ కడముట్టె భామినులార!
ప్రాణావశిష్టుడై బాలుడొకడందు
పడియుండె నచట నాబాణమ్ము తగిలి.
తడబడు చాతడు నుడివె నన్జూచి
జనులరక్షింతురు జనపతుల్ గాని
జననాథ! నన్నేల చంపితివయ్యొ
క్షితినాథ చూడు నాపితయును తల్లి
అతివృద్ధు లంధుల నచట దింపితిని
వారిదాహము తీర్ప నీరమ్ము కొఱకు
చేరితి నిచట నీబారిని బడితి.
కొనిపొమ్ము నన్ను నాజనకుని కడకు
నని చెప్పి యాబాలుడసువుల బాసె

నానేత్రముల నేనె నమ్మలే నైతి.
బాణమ్ము పెరికి యాబాలు నెత్తుకొని
తనయుడు రాలేదు తడవాయె ననుచు
పనవు చుండిన వారి పాదమ్ములంటి
బాలుని శవమును వారి ముందుంచి
ఆలస్యమొనరింప కాత్మధైర్యమున
చెప్పితి నెట్లో నేచేసిన పనిని
తప్పు క్షమించుడు దయజూడు డనుచు
పరిపరివిధముల ప్రార్థించినాను
జరిగినదిద్ది నాయెఱుకయే లేక
మీకుమారుని వలె మిమ్ము సేవింతు
సాకేతమున నని చాలచెప్పితిని.

మాకేమి మిగిలె నీమహిమీద ననుచు
శోకించుటే గాని సుతునికై వారు
వినరైరి నేనెంత వేడినప్పటికి
వినలేకపోతి నావృద్ధులయేడ్పు.
ఆవృద్ధమునివరుం డాననమ్మెత్తి
నావంక కోపతీవ్ర భావమ్ముతోడ
భూవరా నీవును పుత్రశోకమున
మావలె చివరకు మరణింతువనియె.

అతివృద్ధు లాయిద్ద అంధదంపతులు
సుతునికై శోకించి శోకించి మిగుల
చనిపోయి రచట నాకనుల ముందటనె
ఒనరించి వారల కుచిత సంస్కృతులు
తిరిగివచ్చితి నేను దీనుడనగుచు
మఱవలే దీమాట మనసున నేను
ననుబట్టియున్న యామునిశాప మిపుడె
కొనిపోవునేమొ నా కొనప్రాణములను
నాసుతుల్ నలువురున్ నావద్ద లేరు
భాసురమూర్తి నాప్రాణతుల్యుండు
శ్రీరాముఁ డడవులం దేరీతినిప్పు
డారాటమొందుచు నడలుచున్నాడో
హా రామ! హా రామ! యనుచు నాక్షణమె
రా రాజు దశరథ ధారుణీశ్వరుఁడు
వాసవతుల్యుండు పరమపావనుఁడు
కౌసల్యయొడిలోన కన్నులుమూసె
చిననాటి కథయేదొ చెప్పెద మీకు
ననుచు నీమరణమ్మె వినిపించినావు
హా నాథ హా నాథ యని యేడ్చినారు
ప్రాణేశుపైఁబడి రాణులిద్దఱును
చావుసంగతివేగ జగతిపైఁ బ్రాకు

భూవరుమరణమ్ము పురమెల్ల తెలిసె
అల్లకల్లోలమై యానగరమ్ము
గొల్లుమన్నది యొక్కగొంతుకతోడ
కైకకు వేగమ్మె కబురంపినారు
శోకవార్తను విని కైకవచ్చినది
కైకనుగాంచి యాకౌసల్య యంత
"భూకాంతుఁ డిట్లయ్యె కైక చూచితివె
ఇంగితమ్మెఱుఁగక ఇంత చేసితివి
మాంగళ్య మిక లేదు మాకును నీకు
రాజమాతవు నీవు రాజ్యమేలింపు
భూజనుల్ పొగడ నీపుత్రుచే" ననగ
ధరణీశుపదముల కెఱగి యాకైక
ధరణి నేనెంతటిదాననే యక్క!
ధరణీశుఁ డిట్లాటఁ దలపలేనైతి
కరుణింపు మికనైన కైకనటంచు
దోసమంతయు నాదె దోషి నేననుచు
కౌసల్యపై వ్రాలి కైక యేడ్చినది.
ఇరువురు సవతులు నేకమై నాఁడు
కరగిపోయిరి కాంతు మరణదుఃఖమున
పురజనుల్ సచివులు ధరణేపుం జూచి

దరిలేని దుఃఖాన దురపిల్లినారు
త్వరగ అరుంధతి వచ్చి యోదార్చె
ధరణీశు సతులను కరుణ దలిర్ప.

త్వరగ శాస్త్రోచిత దహనసంస్కృతులు
ధరణీశు మేనికి జరిగింపవలెను
భరతశత్రుఘ్నులు పురమున లేరు
గురువు వార్తను బంప నరుదెంచి వేగ
భరతుఁ డెఱింగెను ధరణీశుమృతియు
అరుగుటయును రాముఁ డడవుల బట్టి
తానేగె మున్నె తాతను జూడ
ఈనాల్గుదినములం దీపని జరిగె.
నిలుచున్న వాఁడల్లె నిశ్చేష్టుఁ డగుచు
పలుకాడ జాలక భరతుండు తుదకు
మెల్లనఁ జని తనతల్లినిఁ జూచి
తల్లియిదేమి యీ దౌర్భాగ్య మనఁగ
చిఱునవ్వుతో కైక భరతునిఁ జూచి
భరత నీ వెఱుఁగవు జరిగినకథను
ధరణీశుఁ డిడె రెండువరములు నాకు
నెఱవేర్పుమని వాని నేఁడుకోరితిని
మనుజేశునిగ నీవు మహిని పాలింప

వనికేగ రాముండు పదునాలుగేండ్లు
ఈక్షోణి శ్రీరాముండేలడు నేడు
రాక్షససంహార దీక్షితుండతండు
మునిశాపమున గల్గె మనుజేశు చావు
ననునింద సేయగా జనునె లోకులకు
దాచుటయేల నాతలపులో మాట
రాచవానికి పాడి రాజ్యమేలుటయె
తనయ యీకోసలధారుణి నిం‌క
యెనలేని కీర్తితో నేలుకొమ్మనియె-

తనతల్లిమాటలు వినినకోలంది
మనమున భరతుండు కినుకదీపింప
చాలును నీనేర్పు చాలును తల్లి
చాలును నీ లౌక్యచతురత్వ మింక
ఏమిచ్చెనో నీకు భూమీశవరుండు
భూమీశవరుని నీవేమికోరితివో
ఎఱుంగను నేను నేనెఱింగిన దాక
ధరణిని రాముండు దైవరూపుండు
అదను వచ్చిన దని యవనిచేపట్టి
ముదమున నేలెడి మూర్ఖుడ గాను,
నీవెఱుంగవో యేమొ నీపాపకృతిని
నీవరమ్ములపేర నిముసమ్ములోన

కానల పాలయ్యె ఘనుఁడు రాముండు
భూనాథుఁ డీల్గెను పుత్రశోకమున
ధరణి నీకీనింద తప్పదు వినుము
భరతుడు కాబోడు వసుధకు రాజు"

భరతుఁ డీరీతిగా పలికి కోపమున
వరదలై కన్నుల బాష్పమ్ము లురల
ఈ సేగికిని తానె హేతువటంచు
కౌసల్య కడ కేగి కాళ్ళకు మ్రొక్కె.
"చనుదెంచితివె బిడ్డ! మనజేశ యువిమె
కొనుము నాదీవన" లనఁగ కౌసల్య
కలగుండు బడుచును కౌసల్య కిట్లు
పలికెను భరతుఁడు పరితాపమంది.
"ఏమంటి వోయమ్మ ! ఈబిడ్డ నిపుడు
ఏమిది ? భరతుఁడు భూమీశుఁ డనియు
జనకునిఁ గోల్పోయి వనికన్న నంపి
పనవుచు వచ్చిన భరతుఁ డీతండు
కనలేదె ననునీవు చిననాఁటి నుండి
జనని నేనొక మనస్సన్యాసి నమ్మ
రాజ్యమక్కఱలేదు రాముడూ తక్క
రాజ్య మొల్లను నేను రాముఁ గాదనుచు-

కైక కుమారుడను కాదు ధారుణిని
కైక చేసినది యీకల్లోలమెల్ల
అనుమతీవే తల్లి ఆదరమ్మెసగ
వనికేగి రాముని గొనివత్తు నేడె"
అనుచున్న భరతుని హస్తాల నిమిరి
కనికరమ్మునఁ బల్కె కౌసల్య యిట్లు.
"కలఁత యేలయ్య నాపలుకుల కింత,
కలిగింప కంటి నీయిల నరాజకము
ధారుణి నినువేఱె తలచను భరత!
నా రాముఁడును నీవు నాకొక్కరూపె
అరయుము ముందు నీకరణీయ మొకటి
ధరణీశు తను వదె తైలపేటికను
పరిరక్షితమ్మయ్యె యరిగివేగమ్మె
జరుపుము శాస్త్రోక్త సంస్కృతు లనుచు"

గురువరుఁడు వసిష్ఠుఁ డరుదెంచె నంత
భరతశత్రుఘ్నులు భక్తిమీఱంగ
జరిపిరి తండ్రికి శ్రాద్ధకర్మములు
సరయువుతీరాన శాస్త్రోక్త విధుల
భూధనధాన్యాది భూరిసువర్ణ
గోదానములనిచ్చి భూదేవతలకు

సకలవాంఛలు దీర్చి సత్కృతుల్ సలిపి
సకలార్థిజనులను సంతృప్తి జేసి.

పాదుక

అకలంకముగ పితృయజ్ఞ మారీతి
సకలమ్ము భరతుండు సంపూర్తి జేసి
మరియాదగా బిల్చె మఱునాడె సభకు
గురువుల సచివుల పురనివాసులను
సరసత సభలోని సభ్యులఁ జూచి
భరతుండు తనరెండు కరములు మోడ్చి
"వినుత సద్గుణులార విజ్ఞానులార!
వినుఁడయ్య భరతుని విన్నపమొకటి
దశరథ నరపతి తండ్రి యెల్లరకు
విశదయశస్కుఁడు వేంచేసె దివికి
తనసతి తోడను తమ్మునితోడ
వనములఁ బడియేగె ఘనుఁడు రాముండు
వరము లెట్లున్నను వాంఛ లెట్లున్న
ధరణికి సంతాపకరము లీ పనులు.
రాముఁడు పూజ్యుఁడు భూమినెల్లరకు
రాముని గాదని రాజ్య మేనెట్లు

పాలింపఁ గలుగుదు పాడి వైదొలగి
కాలవిలంబన కావింపకుండ
రాముని ప్రార్థించి రప్పింత మిటకు
నామత మ్మిది" యని నయమున నుడివె
జనులకు భరతుని కనుగొన్న క్షణమె
కనుల శ్రీరామునే కాంచినట్లయ్యె
భరతుని వాక్యముల్ ప్రజల కానాడు
ధరణిపై నమృతంపు ధారలై తోచె
అరిగిరి పురజనుల్ పరివార మెల్ల
మఱునాఁడె పయనమై భరతుని తోడ.

దారిలో మునిభరద్వాజునిఁ జూచి
ఆ రేయి యాగె నా యాశ్రమస్థలిని
భరతుఁడు పయనంపు బడలిక తీర
పరివారములఁ గూడి ప్రజలతో గూడి
తన తపశ్శక్తిచే ముని యొన గూర్చె
ననువుగా భరతుని కన్ని సౌఖ్యములు
వినయుఁడై మ్రొక్కి యా మునిపాదములకు
వినిపించె భరతుఁడు తనదు కార్యమ్ము
ఆరోజె మునివరు నాశీస్సులంది
చేరెను భరతుఁడు చిత్రకూటమును

భరతుని పరివార పదరజ మ్మొగసి
విరబూసె కెంపులు వినువీథి నెల్ల

వన్యమార్గము వెంట భరతుఁ డచ్చటికి
సైన్యసమేతుఁడై చనుదెంచు టరసి
"చాలదా కైకమ్మ సలిపిన కార్య
మీలీల మనమీఁది కేతెంచె నితఁడు.
పరివారములతోడ భరతునిఁ బట్టి
పరిమార్తు" ననిలేచి శరము సంధించి
నిలిచిన లక్ష్మణుం బిలిచి రాముఁడు
నిలువుము లక్ష్మణా ! నిముసమ్ము సేపు
అలుకేల కారణమ్మరయ కుండంగ
పరగు చున్నది చూడు పరితాపమేదొ
భరతుని యందని వారించె నతని

పరివారముల నిల్పి పరిసరమ్మందె
భరతుఁడు దీనుఁడై వచ్చి యాకడకు
వరదలై యశ్రువుల్ వదనమ్ము నిండ
శిరము వాలిచి రాము చరణమ్ము లంటి
మెలమెల్లగా తండ్రి మృతివార్త నెల్ల
తెలిపెను తడబడు పలుకులతోడ.

ఆ మృతివార్త తామాలించి నంత
రామలక్ష్మణులును భూమిజసీత
పారమ్ము గనరాని పటుదుఃఖ మంది
బోరన నేడ్చిరి వారింపరాక
తాను దగ్గఱలేని తరుణమ్మునందె
మానవేశ్వరుఁ డందె మరణమ్మటంచు
తల్లుల దుస్థితి తలపోసి మిగుల
తల్లడిల్లెను రాముఁ డుల్లమ్మునందు
తొలిదుఃఖ మొక్కింత తొలఁగిన యంత
మెల మెల్లఁ జని నదీజలముల కడకు
తర్పణమ్ము లొనర్చి తండ్రికి పూజ
లర్పించి వచ్చి రాయన్నదమ్ములును.

ఎఱుఁగును భరతుఁడు హృదయమ్మునందు
ధరణిని రాముని తలఁపు వేఱనుచు
మఱునాఁడు రామతో మాట్లాడుటెటులొ
భరతుఁ డూహించెను పలుమార్లు మదిని
మఱునాఁడు తనమంత్రివరులతో నేగి
భరతుఁడు శ్రీరాము చరణాల ప్రాలి
తనమది నున్నట్టి తలఁపుల నిట్లు
వినయుఁడై పలుకుచు విజ్ఞప్తి జేసె.

"శ్రీరామ నీవిట్లు చేరినా వడవి
ధారుణీశుండేగ ధరణిని వీడి
మాకెవ్వరును దిక్కు లేకుండ పచట
సాకేతమున నుంటి మాకులం పడుచు
చెప్పవాడను గాను శ్రీరామ నీకు
తప్పున్న నాయెడ దయజూడు మయ్య
మహి యరాజకమయ్యె మశు జేయుండేగ
మహనీయుండవు నీవె మగిడి రావలయు
కైక యేమడిగెనో కాంతుం డేమిడెనో
నాకేమి తెలియ దీ లోకులకెల్ల
ధారుణీశుండ వీవె దైవమ్ము నీవె
ఈరాజ్యపదవి నాకిష్టమ్ము లేదు
నీవె సమర్థుండ వీవె మాదిక్కు
రావయ్య కొనుము నీరాజ్యభారమ్ము
వీరె నీమంత్రులు వారె నీప్రజలు
వారు నీరాకనే కోరుచున్నారు
ఇనవంశనృపతుల కెల్ల వేళలను
జనులశ్రేయమె కద సదమలాశయము
వారికోర్కెను తీర్పు శ్రీరామచంద్ర
నాజన్మకిక రామ నమ్ము నీపాద
రాజీవమ్ములె కాని రాజ్యమ్ము వలదు

నీవు రాకున్నచో నిశ్చయమ్మిదియె
నీవద్దనే యుందు నేనిచ్చ" టనగ
చిఱునవ్వి రాముడు భరతుపల్కులకు
భరతుని కౌగిలిబట్టి మూర్కొనుచు
"భరతుడా ! నీభక్తి నెఱుగుదు నేను
భరత ! నీహృదయమ్ము నెఱుగుదు నేను
అడవికి జనకుని యానతింబడియె
నడచివచ్చితినయ్య నమ్ము నామాట
పదునాలుగేడులు పరిపూర్తి కాక
వదలి యీవనులను వదలి యీ ప్రతిన
తిరిగి యయోధ్య కేనరుదెంచు నెడల
ధరణి నీ యపకీర్తి తండ్రికి గాదె.
లోకనిందకు నైన లోబడి కైక
ఏకారణమున నన్నిటకుఁ బంపినదొ
పరిపూర్ణముగ నాదు వనవాసయాత్ర
మఱుమాట లేకుండ జరుగనే వలెను
ఎల్లి యోభరత! నీ విలుసేరకున్న
తల్లులేమగుదురు ధరణి యేమగును
శ్రీరాము వనవాస మేరీతినైన
సైరింపుమని చెప్పు జనుల కెల్లరకు
భరత కైకొనుము భూపాలనమ్మనుచు

స్థిరభాషణమ్ముల శ్రీరాముఁ డనగ
భరతుఁడు రాముని పాదాలవ్రాలి
"కరుణింపుమయ్యా యో కౌసల్యతనయ !
భరతుఁడు నీకడ్డు పలుకంగలేడు
భరతుఁడు పృథ్విని పాలింపరాడు
నీపాదుకల నిమ్ము నెమ్మి మాకింక
నీపాదుకల పేర భూపాల నమ్ము
జరిపింతు మదిని నిన్ స్మరియించుకొనుచు
భరతుని యీకోర్కె నెరవేర్పు" మనియె.
భరతుని హృదయమ్ము నరసి రాఘవుఁడు
భరతున కిడె తన పాదుకాద్వయము.

భరతుడు లక్ష్మణు నరసి ప్రేమమున
ధరణిజా రాముల చరణాల కెఱఁగి
శ్రీరామ పాదుకల్ శిరమునఁ బూని
"శ్రీరామ నాదొక చిన్నవిన్నపము
పదునాలుగేడుల వనవాసమైన
మొదటిదినమ్మున సదయత నీవు
రావలె నాస్వామి! రాజ్యమ్ము సేయ
రావేని భరతుఁడు బ్రతుక డటంచు

మరల శ్రీరాముని కెఱగి సద్భక్తి
భరతుఁడు వెనుకకు పయనమ్మొనర్చె.

సౌమిత్రి భరతుని సాగనంపుచును
ప్రేమతో సతనిని వీక్షించి పిలిచి
"పరివారములతోడ భరత ! నీవచ్చు
టరసి నే మున్నెందు పొరబాటుఁ బడితి
క్షమియింపు మని వేఁడు సౌమిత్రి వంక
గమనించె భరతుఁడు కడుప్రియమ్మొసఁగ.

పరివారయుతుఁ డయి భరతుఁడు చేరె
తిరిగితానున్న నందిగ్రామమునకు.
రాముని పదముద్ర రాజిల్లు చున్న
రామునిపాదుకల్ ప్రేమతో నరసి
తిరిగి శ్రీరాముఁడే యరుదెంచి నటుల
పురజను లానందభరితాత్ము లైరి
పురజనుల్ సామంతనరనాథవరులు
గురువులు సచివులు నరుదేర వేగ.
సురుచిర సామ్రాజ్యశోభ లింపార
భరతుఁడు శ్రీరామపాదుకాద్వయికి
శ్రీరాజ్యపట్టాభిషేక మ్మొనర్చి
ధారుణి నేలెను శ్రీరాముపేర.

ప్రతినిమిషమ్మును రామునే దలచి
ప్రతికార్య మీయిల రామకార్యముగ
పరిపాలనము జేసె ప్రజల మేలెంచి
ధరణిని భరతుడు ధర్మాత్ముండనగ.

శ్రీమద్రామాయణమునందు అయోధ్యకాండము

సమాప్తము.



శ్రీరస్తు

# శ్రీమద్రామాయణము

## అరణ్యకాండము

### అనసూయ

నిరతిశయుండును నీతిమంతుండు
భరతుఁ డెంతఁటి సాధువర్తనుం డగునో
అరసితే జానకీ యనుచు రాఘవుడు
భరతుని గూర్చియే పలుమార్లు దలఁచె

తానయోధ్యకు నింతదగ్గఱ నున్న
యేనెపమ్మునంచియో యెవ్వరో యొకఁ
రేతెంతు రిట్లని యెంచి శ్రీరాముఁ
డాతావు విడనాడి యరిగె దూరమ్ము

మనసులో రాముని కనవరతమ్ము
మునితపోదీక్షలు మునిచరిత్రములె
కదలుచునుండు నాకథలనే యతఁడు
మృదురీతి సీతకు ముదమార నుడువు.

అ న సూ య

యాత్ర సేయుచు వార లారీతి చేరి
రత్రిమహాముని యాశ్రమమ్మునకు
పరమేష్ఠి సంకల్పబలమున నతఁడు
ధరణిపై వెలసిన తాపసోత్తముఁడు
అనఘుఁడు కర్దమముని పుత్రి యైన
అనసూయ యనుతన్వి యాతని భార్య
లీలఁ ద్రిమూర్తుల బాలురజేసి
లాలింపఁ గలిగిన లలన యాసాధ్వి
సౌజన్యమూర్తులు జ్ఞాన తేజితులు
భూజనవంద్యు లాపుణ్యదంపతులు
ప్రణతు లర్పించిరి రామలక్ష్మణులు
జనకజయును వారి చరణాబ్జములకు
ఆశీస్సులిచ్చి ఆయత్రిమహానీంద్రుఁ
డోశిశూ! రఘుకులోద్వహు నోయి శ్రీరామ !
తరలివత్తు వటంచు ధర్మరక్షణకు
సురుచిరవిజయోస్తు శుభమస్తనంగ-
చిన్నారి సీతను చిబుకంబు బుడికి
సన్నుతమూర్తి యాసాధ్వీమతల్లి
అనసూయ లోనికి గొనిపోయి కూర్మి
సీతమ్మ చేతనే చెప్పించి వినియె
ప్రీతిగ సీతమ్మ పెండ్లి వేడుకలు.

చివురుబుగ్గలమీద సిగ్గు తొలఁకాడ
చెవులవిందుగ సీత చెప్పినదెల్ల
వినుచునే అనసూయ తనివి తీరంగ
జనకజన్ కౌగిలి గొనుచు ముద్దాడి
వరలక్ష్మివే సీత, బంగారు తల్లి!
ధరణి రాముఁడు నీవు దైవరూపములు.
సురుచిరకీర్తితో నిరతమ్ము భువిని
వరలును మీదివ్యచరితమ్ము లనుచు
అవనిజకిచ్చె నాయనసూయ యపుడు
భువినెప్పుడును గూడ పోడిమిసెడక
హృదయేశునకుఁ గూర్చు మృదులాంగరాగ
సదమల శ్రీగంధ సౌభాగ్యములను.
అనసూయపదముల కతిభక్తి మ్రొక్కి
తనువున వానినిఁ దాల్చి యేతెంచి
శ్రీరాముకనులలో సీత యానాడు
శ్రీరమ్యమూర్తియై చెలువమ్ములొలికె.
వినయులై ప్రణమిల్లి మునిదంపతులకు
వనుల కామువ్వురు పయనమై చనిరి.

మునులకు రాముని అభయము

ప్రవిమలాకారులు బాణకార్ముకులు
రవికులతిలకులు రామలక్ష్మణులు

మునివేషధారులై వనసీమ కిటకు
చనుదెంచి రనువార్త చయ్యన ప్రాకి
వనసీమలందున్న మునివరు లెల్ల
చనుదెంచి రాముని కనుగొని వేడ్క
శ్రీరమ్యగుణసాంద్ర శ్రీరామచంద్ర
మీరాకకొఱకు మే మారటపడుచు
వేచియుంటిమి దేవ విపినమ్ము నందు
నీచులు రాక్షసుల్ నిత్యమ్ము వచ్చి
భామినులను బట్టి హోమాగ్ను లార్పి
సామంతమున మాదు జన్నముల్ దూల్చి
మహి సాగకుండంగ మాతపోదీక్ష
బహుబాధలకు మమ్ము పాల్జేసి నారు
తాళంగ జాల మీ దనుజులబాధ
యేలీల మమ్మింక నీవు బ్రోచెదవో
ఈ పాపులకు తీవ్రశాపమ్ము లీయ
కోపమ్ము రాదు మా తాపసావళికి
రాచబిడ్డవుగాన రాజధర్మముగ
నీచరాక్షసులను నిర్జింపు మింక
కరుణాంతరంగ, మాశరణీవె యనుచు
పరిపరివిధముల ప్రార్థించినంత,
వినయుడై రాముడు మునులకు మ్రొక్కి
మునులార, మానుడు మనముల భీతి

ధర్మమ్మునకు హాని దలపెట్టు క్రూర
కర్మిఘలగు దైత్యకాండము నెల్ల
క్షితిమీద వారెట చేరి దాగినను
హతమార్తు నని వారి కభయమ్ము నిచ్చె.

భూమిజ యాలించె రాముని ప్రతిన
మోమునం శోకభీతి భ్రామికొనంగ
శ్రీరామ ! రాక్షసుల్ క్రూరవర్తనులు
వైరభావమ్మేల వారితో మనకు
వనభీతి నెఱుగక వచ్చితి మసలె
మన మేగ రాదొకో మనదారి ననగ
చిఱునవ్వి రాముఁడు సీతను వేగ
దరిజేర్చుకొని తన కరములతోడ
దనుజులు దుర్గమవనసీమ లనుచు
మనమున వెఱపేల మానినీ నీకు
ప్రబలులై రాక్షసుల్ భయపడుకొలంది
విబుధులన్ ప్రజలను పీడింపఁ గలరు
ప్రజల రక్షించుటే ప్రభువు కార్యమ్ము
ప్రజలసంశ్రేయమే రాజధర్మమ్ము
దనుజుల దునుమాడి ధర్మమ్ము నిలుప
చనుదెంచితిని నేను వనసీమకనుచు

జనకజసూరార్చి జనకజకేవో
వనదృశ్యముల జూపి చనుచున్నయంత-

విరాధుడు

వెనుకనుండి విరాధుండనెడు దైత్యుండు
జనుదెంచి చయ్యన జనకజన్ బట్టి
పరువిడుచుండ నా కరనాథు సుతులు
కరవాలముల వానికరములు నరికి
వీనికి మృతి వేఱువిధిని లేదనుచు
ప్రాణాల తోడనే పాతిరి భువిని.

శరభంగ మహర్షి దర్శనము

ధారుణీతలమున తనకార్య మింక
ఆరంభమైనట్లు శ్రీరాముండెంచె
మనమున జనియించి మఱికొంత భీతి
తనపతిప్రక్కనే జనకజ నడచె
ఇంతలో శరభంగ ఋషి యాశ్రమమ్ము
చెంతనే కనుపించె శ్రీరామునకును
అతుల తపశ్శాలి ఆత్మవిజ్ఞాని
సతత దైవధ్యాన శాంతచిత్తుండు

శరభంగఋషివద్ద కరుదెంచి మ్రొక్కి
కరములు మకుళించి కౌసల్యసుతుండు
మనమున నలరి యామునిచంద్రుం డంత
నినుజూచుటకె రామ! నే వేచియుంటి
దనుజ నిర్మథనమ్ము ధర్మరక్షణము
లొనగూడి నీవల్ల నుర్వి వర్థిల్లు
కలరగస్త్యాదు లీ కాననమ్మందె
కలియుము తప్పక ఆ ఘనఋషీంద్రులను
అత్యంతసార్థ మై యరుదెంచె నాకు
సత్యలోకము జేరు సమయ మీక్షణమె
యనుచు నా మౌనీంద్రు డాహుతి యయ్యె
క్షణములో నిజయోగ జనితాగ్నిశిఖల
ఎంతతపస్సిద్ధుం డెంతటి త్యాగి
ఎంతమహాత్ము డీ ఋషిచంద్రు డనుచు
ఆ చితాగ్నిజ్వాల కంజలు లిచ్చి
యాచరించిరి వార లట ప్రదక్షిణము.

## మకరాసురుండు

మునులనే తలచుచు మనములయందు
వనములం దేగిరి వారు మువ్వురును

సలలిత జలముతో సాగుచు నున్న
సెలయేటి నొక్కటి తిలకించి వారు
నీరమ్ముకో అ కట చేరినంతటనె
నీరముందున పెద్దనోరును తెఱచి
పడబోయె వారిపై భయదమౌ మొసలి
తడయక రాముఁడు దాని వెంబడినె
జలములందున దూకి చాలసేపయిన
వెలువడి రామిచే భీతిల్లె సీత
మొసలితో బాటుగ మునిగి తేలుచును
మసలుచు రాముఁ డా మడుగులోపలనె
వచ్చెను బయటికి బడలిక తోడ
చచ్చిన మొసలితో చాలసేపటికి
"అసురుఁ డొక్కండిట మొసలిరూపమున
ఉసురులు తీయుచునుండు నందఱికి
తెంపరి మొసలిని తెగువతో పట్టి
చంపు నప్పటి కింత జాగయ్యె ననుచు
చెప్పుచు నుండిన శ్రీరాము జూచి
తప్పెను గండమ్ము ధరణిని నేడు
బయటకు నీవిట్లు వచ్చునందాక
భయమున మాలోన ప్రాణాలు లేవు
చాలును రామ! నీ సాహస మ్మింక
ఏలీల నేగునో యికమీద" ననుచు

జనకజ రాముని వెనుకదే నడచి
చనుచుండె భీతితో వనమార్గమందు.

## అగస్త్యాశ్రమము

పరిసరమ్ముల నున్న వనమార్గ మెల్ల
సురభిళ మధుపుష్ప సుందర మ్మగుచు
మనసు నందలి భీతి వెనుకకు తగ్గి
జనకజ కొక్కింత శాంతి చేకూరె.

మాండకర్ణి మునీంద్రు మహిమను తెల్పు
అందాల కొలను పంచాప్సర మ్మరసి
మునిసుతీక్ష్ణుని జూచి ముందుకు సాగి
కనుగొని రచ్చటి కాననమ్మందు
శుకపిక గీతికా శోభితమ్మగుచు
అకలంక హోమాగ్ను లలరెడు దాని,
స్వాదిష్ట ఫలతరు వర్ధితమ్మగుచు
వేదఘోషలతోడ విలసిల్లు దాని
సలలిత సుమతరుచ్ఛాయల తోడ
నలరుచుండిన యగస్త్యాశ్రమస్థలిని
వినువీథి నంటిన వింధ్యాద్రి గర్వ
మణగఁ జేసిన ఋషి యడుగునఁ ద్రొక్కి

జలధియందలి నిశాచరులను బట్టి
జలనిధిం ద్రావిన శక్తిమంతుండు,
అసురుడౌ వాతాపి నంతమొందించి
యుపమాన శక్తితో నలరిన తపసి,
మునియగస్త్యునిజూచి మోదముతో నిడిరి
ప్రణతులు సీతయు రామలక్ష్మణులు
ఆమునీంద్రుండు వారి కాశీస్సులిచ్చి
ఆమోదమున వారి నాదిన మ్మాపి
అడవుల నడచిన యలసట తీర
విడిదేర్పఱచెను విందుల తోడ.
మఱునాడు శ్రీరాము నరసి యాతపసి
పరమాదరమ్మున భావించి యిచ్చె
దివ్యకోదండమ్ము దివ్యఖడ్గములు
దివ్యాస్త్రశస్త్రముల్ దివ్యాయుధములు.
"నీవల్ల రాక్షసనిర్మూలనమ్ము
కావలె ధరణిని కౌసల్యతనయ!
మహనీయ వైష్ణవ మంత్రయుక్తములు
బహువిధ దుర్వార పటుశక్తు లివ్వి
శ్రీరామ వీనిని చేకొని వేగ
చేరుమీవిక దండకారణ్య మచట
ప్రవహించు గౌతమీవాహిని తటిని

నివసింప వచ్చ"ని నెమ్మితో పలికి
నయమున నామునినాథుని కెఱఁగి
పయనమై చనిరట్లె వారు మువ్వురును.

జటాయుసందర్శనము

మునియాశ్రమము వీడి చనుచున్న యపుడు
కనుపడె వారికి కాననమ్మందు
ఎదురయి దశరథనృపతి మిత్రుండు
విదితజటాయువు విహగవల్లభుఁడు.
మనుజేశు మృతి విని మనమున వగచి
తనయులారా, యిందు దనుజు లుండెదరు
వనుల జాగ్రత్తతోడ వసియింపవలయు
నని చెప్పి వినయుఁడై యరిగె నాతండు.

పంచవటి

విపినమ్ము నందుండి విపిన మేతెంచి
తపసి చెప్పినయట్లు దండకాటవిని
చేరి యామువ్వురు చిత్తమ్ము లలర
ఆరణ్యశోభతో నలరు నొక్కెడను
ప్రవిమల జలముతో రమణీయగతుల
ప్రవహించు గౌతమీ వాహినిం గనిరి.

పంచవటచ్ఛాయ పఱిగి యచ్చోట
అంచితసమతల మ్మనుకూల మైన
స్థానమ్ము నొకదాని సౌమిత్రి చూచి
యానదీ పరిసరమ్మందె నిర్మించె
తరుశాఖ లాకులు త్వరగ తోడ్తెచ్చి
ఉరుతరశోభతో నొకపర్ణకుటిని.
కమనీయఫలములు కందమూలములు
విమలజలమ్ములున్ విడువక తెచ్చి
అన్నకు వదినకు నవసరమైన
సన్నుతసేవలు సౌమిత్రిసలిపి.
పాయనిశ్రద్ధతో రేయింబవళ్ళు
ఆయింటిజాగ్రత్త నరయుచు నుండె.
అరిగి నప్పటినుండి యాపర్ణకుటికి
అరుదారుప్రేమతో నవనిజం గనుచు
వనదృశ్యములు జూపి వాహినిం జూపి
చనవుగా నెన్నియో సత్కథల్ నుడివి
అడవిజీవితమున కలవాటుపడుచు
గడపెను రాముఁడు కాలమచ్చోట

కాకాసురుడు

ఒక్కనాఁ డవనిజ నొంటిగాఁ జూచి
గ్రక్కున నొకక్రూర కాకమ్ము వచ్చి

ఉర్విజయురముపై నొకకండ చీల్చి
ప్రవహించుచుండగా భయపడి సీత
కెవ్వున నేడ్వ నాకేకలాలించి
రివ్వున వైచెను శ్రీరాముఁ డొక్క
గడ్డిపోచను జీల్చి కాకమ్ముపైన.
గడ్డిపోచయె లేచి కడుభీకరముగ
కాకమున్ వెంటాడి చీకాకుపఱుప
కాకాసురుఁడు సర్వలోకముల్ తిరిగి
రక్షణ గానక రాముని కడకె
అక్షీణ జవమున నరుదెంచి మ్రొక్కె.

"కాకమా! నా చేతి గడ్డిపోచైన
లోకాన వ్యర్థమై పోకూడ" దనుచు
గడ్డిచేతనె వేగ కాకి కన్నొకటి
గ్రుడ్డిగ నొనరించి, క్రూరతవీడి
ధరణిపై మంచిగా చరియింపు మనుచు
కరుణించి రాముడు కాకమున్ వదలె.

## శూర్పణఖ

భీకరాకారుడు లోకకంటకుఁడు
రాకాసిఱేఁడైన రావణాసురుని

చెల్లెలు కలదిల చెనఁటి శూర్పణఖ
కల్లలాడగ నేర్చు కామాంధురాలు.

రాముఁడుండిన వనప్రాంతమ్మునందె
ఆమెయు తిరుగుచునట నొక్కనాడు
రాముని యందమ్ము రామునిరూపు
వేమారు వీక్షించి కామించి మదిని
కామరూపమ్మున కడుసుందరియయి
రామునివద్దకు రహిమీఱ వచ్చి
"రామ! నిన్ ప్రేమించి కామించినాను
నాముద్దు చెల్లించి నారాజు వగుము
తేలింతు నిన్నింక దివ్యసౌఖ్యముల
ఏలింతు నీచేత నీలోకమెల్ల
ఈతొంట కొకిబికి సీతనీకేల
సీతను లక్ష్మణున్ చిటికెలో మ్రింగి
నీతోడ నేనుండి నిన్ను సేవింతు
ప్రీతితో శృంగార క్రీడల" ననుచు
రామునివద్దకు రాబోవుచుండ
ఆమె నచ్చోటనే యాపి రాఘవుడు
"భామిని! నన్నేల వాంఛింతు వీవు
ఈమె యీసీత నాయిల్లాలు కలదు

నాకంటె సుందరుం డదుగో లక్ష్మణుఁడు
ఆకడ కీవేగి యత్నింపు మనఁగ
నడచుచు నొయ్యారి నడకల తోడ
కడువడి లక్ష్మణు కడకేగి యామె
కౌగిలింబూనగ కరములుసాచె
వేగమె యామెను వెనుకకు ద్రోసి

"పొగరెక్కియున్నావు పొలఁతి నీ"వనుచు
తెగువతో ముకుచెవుల్ తెగగోసి యామె
నలుకతో లక్ష్మణుం డవలకు గెంటె.
"శ్రీరామ! నన్నిట్లు చేయించినావు
ధారుణి నిన్నింక ధ్వంసమ్ము సేసి
చూపెద నాశక్తి చూడుం డటంచు
కోపమ్ముతో నేగె గొంటె శూర్పణఖ.

ఖ ర దూ ష ణా దు ల సం హా ర ము

పరువెత్తి తనగోడు మొఱవెట్టెనామె
ఖరదూషణులకడ కరుదెంచి వేగ
ఆమెసోదర్యు లాయసురవరేణ్యు
లేమేమి! ఈనరు లెక్కడివారు?
ఎంతధైర్యము వీరి కింతసేయుటకు

అంత మొందింతు మం చాగ్రహమ్మడర
పంపిరి భీకర బలసముద్ధతులు
తెంపరు లగు దైత్యాధిరుల నటకు.

తండ తండములుగా తనపైకి నిట్లు
దండెత్తి వచ్చిన దైత్యవీరులను
సునిశితోజ్జ్వల శరస్తోమంబు గురిసి
క్షణములో రాముడు తునిమి తూటాడె
దనుజుల రాముఁ డి ట్లానరించు టరసి
కనులు నిప్పులుగ్రక్క ఖరదూషణులకు
సురలోకవైరు లా యరిభయంకరులు
ఖరుఁడు దూషణుఁడు త్రిశిరులను వారు
ఆయుధమ్ముల తోడ నార్పులతోడ
సాయుధ రణభట సంపత్తితోడ
ప్రక్కలింతుము నేఁడు గ్రక్కింతు మింక
చుక్కలు రాలించి చూపింతుమనుచు
తరలి రామునిపైకి దండెత్తినారు
ధరణియే కంపించి దడదడ లాడ
సౌమిత్రిఁ గాపుంచి జానకివద్ద
భీమకోదండుడు రాము డొక్కండె
దారుణ రణశౌర్య దర్పమ్ముతోడ
క్రూర నారాచాగ్నికోటుల గురిసి

## మాయలేడి

అసురనాయకుల నాయసురుల నెల్ల
నసమసాహసుఁడయి యమపురి కంపె
సురవీరులను గూడ స్రుక్కింపఁ జేయు
ఖరదూషణాదుల మరణమాలించి
పరమహర్షమ్మును బడసిరి ప్రజలు
సురలు వర్షించిరి సుమవృష్టు లవని.

## మాయలేడి

జరిగెను తనకింత పరిభవశిక్ష
ఖరదూషణాదులు మరణించినారు
వెరవేదియును దోచ కరిగి శూర్పణఖ
మొఱ వెట్టె రావణాసురు నొద్ద వేగ
శ్రీరాము శౌర్యమ్ము సీతయందమ్ము
కారణమ్ముగ నేవో కల్పించి నుడివి
తిలకింపుమన్న నీ చెలియ లీ రీతి
విలపించుచున్నది వికృతాస్యమున
"చూపుము నీశక్తి నా పగతీర
చూపుము నేనిక చూచి హర్షింప"
అని చెప్పుచున్నంత నచటి కేతెంచి
అనుకంపనుం డను నసురుఁడొకండు
వినయుఁడై మ్రొక్కి యాదనుజనాథునకు

వినిపించె సర్వమారణవిధానమ్ము
కలుపటమ్ముల నగ్నిఖండముల్ గురిసి
అరిభయంకర యుద్ధపరిరంభుఁ డగుచు
సరవి రాముం డెట్లు పరిమార్చినాడో
పరివారయుతముగా ఖరదూషణులను.
హరుని విల్విఱిచిన యారాముశక్తి
నెఱుఁగును రావణుం డిలమీద మున్నె.
వినుచు రామునిగూర్చి మనమందు దలచె
తనకొంపయును గూడ మునుగుచున్నటుల.
రణము సేయగరాదు రాము నెదిర్చి
మనమున యోచించె మఱియొక్క విధము
జనకజన్ మోసానఁ గొనివచ్చి యిటకు
వెనుక నా రాముని పనిబట్టవలయు
ఆరీతిగాఁ దన యాత్మలో తలఁపు
మారీచుడను మేనమామకుఁ జెప్పి
శ్రీరాము నెట్లైన దూరమ్ము జేసి
శ్రీరాము భార్యను చెఱబట్టు పనికి
తనకు సాయముగాగ త్వరగ రమ్మనియె.
మనమున రాముని మారీచుఁ డెఱుఁగు
"రావణా! యెఱుఁగవు రామునిశక్తి
నీవేగవల దయ్యొ నేను రాలేను
మన సుబాహునిఁజంపె నను వార్ధి ద్రోచె

చిననాఁడే, రాముఁ డాతనితోడి పోరు
మరణమే మనకని మారీచుఁ డనఁగ
చురచుర కోపానఁ జూచి రావణుఁడు
"నీవేగ కున్నచో నిన్నుఁ జంపెదను
వేవేగ మారీచ వెడలు మచ్చటికి
జనకజన్ నిముసాన గొనివత్తు నిటకు
కనుము రావణుమాయ" ననిలేచె నతడు.
అరిగెను మారీచుఁ డతని వెంబడినె
మరణింతునిక రాము కరమందె యనుచు
పంచవటీప్రాంత పర్ణశాలకును
మంచి బంగరు వన్నె మాయలేడగుచు.

ఆముద్దులేడిని యవనిజ యరసి
రాముని వేగమ్మె రమ్మని పిలిచి
"వన్నె వన్నెల లేడి బంగారులేడి
కన్నెచూపుల నీలికన్నుల లేడి
అరసితే శ్రీరామ అదె మన ముందు
తిరుగాడు చున్నది మురువులొప్పంగ
చూడలే డిటువంటి లేడి నెప్పుడును
వేడుకగా దీని పెంచెద నిచట
పారిపోవుచునుండె పట్టితే తెమ్ము

శ్రీరామ లెమ్మని" సీతప్రార్థించె.
"రామ! యిదేదియో రాక్షసమాయ
ఈమృగార్థమ్ము నీవేగ వద్ద" నుచు
సౌమిత్రి చెప్పినన్ రాముఁడు వినక
భూమిజ రక్షగా సౌమిత్రి నుంచి
శరచాప ధరుఁడయి యరిగె రాముండు
పరువెత్తు లేడిని పట్టుటకొఱకు.

దరిఁజేరి నట్లయి యరుగు దూరమ్ము
పరువెత్తి వచ్చును మరలదగ్గఱకు
అటు నిటు చనుచుండు నగుపడకుండ
ఎటనుండియో లేడి యెదురగు మరల
మారీచుఁ డీరీతి మాయలు పన్ని
శ్రీరాము గొనిపోయె దూరభూములకు.
వినువెత్తి యాలేడి విధ మెల్ల చూచి
అసురమాయగ తన యాత్మలోఁ దలఁచి
లేడిని పట్టగా లేక రాముండు
వాడితూపును దూసి లేడి నేయంగ
ఆ సువర్ణపు లేడి యచటనే చచ్చి
హాసీత! హాలక్ష్మణా! యని యార్చి
మారీచురూపాన మహిమీఁద బడియె.
శ్రీరాముకంఠము ట్లారోదనమ్ము

విసపించి లక్ష్మణున్ పిలిచి యాసీత
"వినలేదె మాయన్న పిలుపు సౌమిత్రి!
ఏమైనదో వేగ మేగు" మనంగ
"జగదేకవీరుఁడో జనని, మాయన్న
వగజెందకుము రామభద్రునికొఱకు
నినునొంటిగా నుంచి నేనేగ గూడ"
దను లక్ష్మణునిమాట లాలించి సీత
"ఏమయ్యెనో రాముఁ డేగిచూడకను
సౌమిత్రి యిచటేల జాగు చేసెదవు
శ్రీరాముఁ డేగెను, సీత యొంటరిగ
ఈరీతి నున్నదం చెడదలో దలచి
భూమిజన్ చేబట్ట పొంచియున్నావు
రాముఁడేగిన నాడె భూమిజగూడ
ప్రాణముల్ వీడును పాపాత్మ" యనిన
జానకి మాటకు సౌమిత్రి యడలి
తల్లి మాయిరువురి దాసుడఁ నిట్టు
లెల్లిదమ్ములఁ బల్కనేటికి నన్ను
వినలేక తల్లి నీవనుచున్న పలుకు
చనుచుంటి నిదెతల్లి జాగ్రతయనుచు
పడతిరో నిన్నింక పంచభూతములె
కడుమేలి రక్షలై కాచుగా"కనుచు

రామునాజ్ఞను మీఱి భూమిజన్ వీడి
సౌమిత్రి యేగెను రాముని కొఱకు.

## సీ తా ప హ ర ణ ము

ఆవంక లక్ష్మణుం డరుగుటఁ జూచి
రావణుం డేతెంచె రయము మీఱంగ
సకలరీతుల నొకసంయమి వేష
మకలంకముగఁ దాల్చి యవనిజకడకు.
అతిథిని కనుఁగొని యవనిజ వేగ
అతిభక్తితో నిచ్చి యర్ఘ్యపాద్యములు
"ఎందుండి వచ్చిరో ఋషిచంద్ర మీర
లిందుండి శ్రమవాయుఁ డింతలో నిటకు
వనుల కేగినవారు భర్తయున్ మఱది
క్షణములో వత్తురు స్వామి మీకడకు
వాసిగా జనకుని వరకుమారికను
కోసలరాజేంద్రు కూర్మికోడలను
శ్రీరాము భార్యను సీత నాపేరు
మీరాకచే మాకు మేలగు" ననియె.
ఆ మాయరావణుం డల్లన నవ్వి
భామినీ! నీయర్ఘ్యపాద్యమ్ము లేల

నీమావనవిలాస నిరుపమశోభ
నీయందచందముల్ నీరూప మరసి
వచ్చిన లంకాధిపతిని రావణుఁడ
చెచ్చెర రమ్మింక సీత! నాతోడ
లేడిని తేలేని బోడి యారాము
తోడుగ నీవుండి దుఃఖింప నేల
ముల్లోకముల గెల్చి మొనగాడనైన
బల్లిదుండను నాదు భార్య వీవైన
త్రిభువన సామ్రాజ్య దేదీప్యమాన
విభవమ్ముతో నిను ప్రియరాణి జేతు
రావె సీతా!" యని రాబోయె పైకి
రావణుండును తన రాక్షసాకృతిని.

మునియు కాదాతఁడు మ్రుచ్చురక్కసుఁడు
దనుజాధిపతి తన్ను గొనిపోవవచ్చె
ఎంతఘోరమ్మిది యెంతయన్యాయ
మెంతమోసము! సీత కెడదవ్రీలినది
నిలువున నీరయి నిశ్చేష్ట యగుచు
పలుకైన లేకుండ వసుధ మూర్ఛిల్లె
రయమున సీతను రథముపై బెట్టి
పయనమై యేగె నా ప్రబలరావణుఁడు
జనకజ తెలివొంది కనువిప్పుసరికి

దనుజునిరథముపై తా నేగుచుండె.
ఎవరుకాపాడుదు రెవరు దిక్కింక
అవనిజ విలపించె యవశురాలైపోయి
“హా రామ! లక్ష్మణా! ఆలింపరయ్యా
మీరలెందుండిరి మీర లేమైరి
బలిమిని సీతను బంధించి దైత్య
కులనాథు డొక్కడు కొనిపోవుచుండె
అనరాని మాట నిన్నంటితి సౌమిత్రి!
అనుభవించుచునుంటి నాపాపఫలము
రారయ్య వేగమె రక్షింపరయ్య
మీరలెందుంటిరి శ్రీరామచంద్ర.
తరులార! గిరులార! సురవరులార!
ధరణిజన్ రక్షింప తరలిరారయ్య,
దరిని రాముడులేని తరుణమ్ము జూచి
పిరికిపందవు నన్ను చెఱగొంటి వీవు
రావణా! నీకిక రాముని చేత
చావుతప్పదటంచు చాల నిందించి
మరల నా రావణు నరదమ్ము మీద
ధరణిజ మూర్ఛిల్లె మఱుమాట లేక.

ఎటనుండి వినినదో పృథ్విజయేడ్పు
ఎటనుండి వచ్చెనో యేమొ యామెడకు

అక్షీణజవమున నాకాశవీథి
పక్షిజటాయువు పఱతెంచి వచ్చి
"ఓరి దైత్యాధమ ఓరిపాపాత్మ !
ఈరీతి పరభామ నేల పట్టితివి
విడువు మీ పడతిని వేగ నీవనుచు
కడువడి పైబడి కాళ్ళతో దన్ని
రథమును పడగొట్టి రావణుం బట్టి
పృథులధైర్యమ్మున పెనగుచునుండ
రావణుం డతి భీకరాట్టహాసమున
కావరమ్మడరంగ కత్తినిదూసి
పక్షి నీవెంత నా పటుశక్తి కనుచు
పక్షమ్ములను దూల్చి వసుధపై గూల్చి
కడువడి నేగె నా యడవిమధ్యమున
పడియుండె పక్షియు ప్రాణాలు మిగిలి.
రావణు రథమట్లు రయము దీపింప
పోవుచుండగ మింటి త్రోవలఁ బట్టి
వానరుల్ కొందఱు వసుధపై నుంట
పైనుండి మోటులనో జానకి చూచి
తననగల్ మూటగా నొనరించి విసరె
వనచరు లున్నట్టి పరిసరమ్ములకు.

జనకజ రావణుం గనుగొని మరల
వినుమోరి పాపాత్మ వినుము నీకింక

ఇనకులస్వామిచే మృత్యువే వ్రాసె
పనివడి యాబ్రహ్మ యని దూరుచుండ.
దను జేశుఁ డంతలోఁ దనలంకఁ జేరి
జనకాత్మజ నశోకవనమునం దుంచి
అసురకాంతల బెట్టి యామెకు చుట్టు
అసమానశీవితో ననియె నీరీతి
"దానవసఖులార! జానకి కింక
జ్ఞానమ్ము చెప్పుడు సముచితరీతి
నయమున భయమున నామీదనెటులొ
ప్రియము జనింపగ వేగ చేయుండు
మనసున బెట్టు దీమదవతి నన్ను
వినకుండె నెంతగా వేడిచెప్పినను
ఈమెకిచ్చితి నొక యేడాదిగడువు
నామాట వినకున్న యీమెప్రాణములు
నిలువవు భూమిపై నిజమిది" యనుచు
పలికి రావణుఁడేగె ప్రబలదర్పమున
వలనుఁ జిక్కిన రామచిలుకను బోలి
తలఁచుచు రాము నా తులువలమధ్య
భీతి జెందుచు మది బిక్కు బిక్కనుచు
వైదేహి వనమున సీత యుండినది.

దానవమాయను లోనైతి ననుచు
దీనుఁడై రాముఁడు కాన నమ్మందు
వెనుకకుఁ జనుదెంచు తనదారి కెదురు
కనుగొని లక్ష్మణున్ కలగుండు వడుచు
"వదిన నొంటిగ వీడి వనముల మధ్య
నిదియేమి సౌమిత్రి ! యిటు వచ్చినావు
అసురు లెంతకునైన నగుదు రీ యవని
అసుర మాయలఁ జిక్కియామె యేమగునొ
పాటింపఁ బోక నామాట నొక్కింత
యేటికి నీవుండి యిచట లక్ష్మణుఁడ"
అని కఠినోక్తులనాడు రామునకు
వినయుఁడై జనకజన్ వీడినవిధము
వినిపించె సౌమిత్రి విన్నదనాన.
దనుజుల మాయగాఁ దలచి సర్వమ్ము
పరువులెత్తుచు వచ్చి యరసిరి వారు
ధరణిజ లేనట్టి తమపర్ణశాల
సీతను పిలిచిరి చేరి యిద్దఱును
సీతను వెదకిరి చెఱియొకప్రక్క
సీతరా దెటనుండి సీత లేదెందు
సీతను గానక శ్రీరాముఁ డంత

"అక్కట ! లక్ష్మణా యవనిజ గాన
మెక్కడ కేగుద మేమిసేయుదము
దనుజులు మ్రింగిరో దాచిరో యేమొ
కనరాదు సీత నాకనుల వెలుంగు
జానకీ ! నాబహిః ప్రాణమ్మ ! నిన్ను
గానక ధాత్రిపై నేనుండ గలనె
ఏరాక్షసుని బారి కేచటం జిక్కితివో
ఏరీతినుంటివో శ్రీరాముం డిచట
విలపించుచుండె నో వెలంది నీకొఱకు
కలనైన నేనిట్లు తలపనే లేదె
నిలువవు ప్రాణముల్ నీవు లేకుండ
మీతండ్రి యడిగిన సీత యేదనుచు
ఏతీరున వచించి యేమి చెప్పుదును
సతిని రక్షింపగా జాలనివాడ
క్షితిమీద నేనెట్లు జీవింతు" ననుచు
తలంచిన సీతనే తలచుచు మరల
విలపించి విలపించి వివశుండై మదిని
ప్రేమార్ద్రహృదయుడా శ్రీరామమూర్తి
భూమిని మూర్ఛిల్లె భూమిజ కొఱకు

తెలివొంది శ్రీరాము డలనల్ల నచట
తిలకించి లక్ష్మణున్ బిలిచి వేగమ్మె

"చూడుము లక్ష్మణా ! చోరుఁ డెవ్వండో
ఈడనే తిరిగిన జాడ లియ్యవిమె
ఎఱుఁగక రాముని శరముల శక్తి
ధరణిజన్ దొంగిలి దాచినా డెవడో
వీరకోదండు డీ శ్రీరాముఁ డింక
ఊరక చూచుచు నుండునే భువిని
ఈలోకమున సీత యెందున్నఁ గాని
కాలవిలంబన కావింపకుండ
భూమిజన్ వెదకి యీభూమి సర్వమ్ము
నామఁందు లేకున్న నమ్ము సౌమిత్రి
ఈపృథ్వి యిదె భస్మమైపోవు" ననుచు
కోపాన రాముఁడు చాపమ్ము నెత్తె
చయ్యన నడ్డుగా సౌమిత్రి వచ్చి
"అయ్యయో, శ్రీరామ అవని నేయకుము
ఒక్క జానకికయి యుర్విసర్వమ్ము
నుక్కడగింతురే యెక్కడ నైన
అయినను శ్రీరామ ఆలింపు మయ్య
దయయుంచి యిపుడు నీ తమ్మునిమాట,
ఉర్విపై దేవుఁడ వుదయించి నావు
సర్వ మెఱింగిన జ్ఞానివి నీవు
ధరణిజ కొఱకయి ధైర్యమ్ము వీడి

చరియించు టుచితమే సామాన్యు వలెనె
కోపమ్ము వలదు సంతాపమ్ము వలదు
చాపమ్ము విడువుము శాంతుండ వగుము
కాననమ్ముల నెల్ల గాలింత మింక
జానకిన్ దెత్తను జగమెల్ల వెదకి
సీత హేతువుగ నీ చేతిలో నింక
దైతేయు లీల్గక తప్ప దీనాడు,
ధరణివర్ధిల్లును ధర్మమ్ము నిలచు
కరుణించి లెమ్మని కరములనెత్తి
రామునిఁ దోడ్కొని భూమిజన్ వెదుక
సౌమిత్రి కానన సీమల కరిగె.

## జటాయు మరణము

రామలక్ష్మణు లట్లు భూమిజకొఱకు
వేమాఱు విపినముల్ వెదకుచు నచట
తిరుగుచుండిన వారి నిరువుర నరసి
ధరణిజన్ జెఱబట్టి దానవుఁ డొక్క
డరదమం దేగిన తెరువు జూపించి
ధరణిజన్ రక్షింప తనకా మహోగ్ర
రాక్షసుతో నైన రణమును జెప్పి
పక్షి జటాయువు ప్రాణముల్ వీడె

## జటాయు మరణము

జానకికై యిట్లు సమరమ్మొనర్చి
ప్రాణముల్ వీడిన పక్షివల్లభుడు
బహుపుణ్యలోకముల్ పడయుగా కనుచు
దహనసంస్కృతులెల్ల తగురీతి జరిపి
పరకాంతఁగొనిపోవు దురితునెదిర్చి
మరణమ్మునకు గూడ వెఱవని యట్టి
విహగేంద్రు త్యాగమ్ము వినుతించి మిగుల
గహనసీమలఁ బట్టి కడుదీక్ష జనిరి
అసురు డేగిన దెస నవనిజన్ వెదుక
ప్రసభమ్ముతోడుత రామలక్ష్మణులు.

## అ యో ము ఖి

శ్రీరామలక్ష్మణు లారణ్యవీథి
వారిదారిని బడి వారేగుచుండ
ధర నయోముఖియను దానవకాంత
పరగున చనుదెంచి సౌమిత్రికరము
చనవున బట్టి "యోసన్నుతాకార!
మనసున నీమీద జనియించె ప్రియము
చనుదెమ్ము నాతోడ మునివేష ముడిగి
నిను నలరింతును నిఖిల సౌఖ్యముల"
ననుచు పైబడబోయి యువలకు జనక
కౌగిలిఁ గొనబోవ కరములబట్టి

వేగమె యామెను వెనుకకు గెంటి
వికలాంగగ నొనర్చి వీడె నచ్చోట
అకలంక చారిత్రుఁ డా లక్ష్మణుండు.

కబంధుఁడు

ముని శాపవశమున దనువను వాఁడు
తన యమరత్వమున్ తనువును వీడి
వసుధ కబంధుఁడై ప్రభవమ్ము నందె
అసురరూపమ్మున నతివికృతముగ
ఘనశైలమునుబోలు కాయమ్ము కాని
కనఁబడ వాతని కాళ్ళును తలయు
ధారుణిన్ యోజనదూరమ్ము వఱకు
బారలు సాచుచు బాహుయుగ్మమున
దొరకుచు నుండిన నరులనెల్లరను
కరములతో లాగి కబళించుచుండు.

ఆమెయి నాతఁడు హస్తముల్ సాచి
రామలక్ష్మణులను గ్రసియింపఁ బోవ
కనబడకుండ నీదనుజుఁ డెవ్వండొ
తినబోవుచుండెను మనల నటంచు
సరగున శ్రీరామసౌమిత్రు లపుడు
కరవాలముల దూసి ఖండించి రతని

కరములరెండు నాతరుణమ్మె యతడు
ఘనుఁడు రాముని చేత తనశాపముక్తి
ననువుగా నంది తా నమరుఁడై మరల
శ్రీరామునికిమ్రొక్కి చేతులుమోడ్చి
శ్రీరామ! రఘురామ! కారుణ్యధామ!
నీ రమ్యగుణములు నే చెప్పఁజాల
నీరాకచేవచ్చె నిజరూపు నాకు -
ధరణిపై నా దైత్యతనువున కింక
జరిపింపుము దహన సంస్కృతుల్ రామ!
మఱియొక్కమాట నన్ మన్నించి వినుఁడు
ఎఱుగుదు నీభార్య ధరణిజన్ నాడు
కొనిపోయె నీదారి దనుజు డొక్కండు
వనములం దికమీఁరు చనుచున్నయపుడు
పంపా సరోవరప్రాంతమ్మునందు
నింపగు శైలమ్ము ఋష్యమూకమున
వసియించు సుగ్రీవవానరవర్యుఁ
డసమాన బలయుతుఁ డర్కుని సుతుఁడు
జరుపు మాతనితోడ సఖ్యమ్ము రామ!
ధరణి మేలగు నీకు తప్పక ననుచు
మరల శ్రీరాముని చరణమ్ము లంటి
యరిగె నంతర్ధానుఁ డగుచు నాతండు.

ఆకబంధుని కాయ మగ్నిలోఁ బెట్టి
ఆకాననము వీడి యరిగె రాఘవుఁడు.

శ బ రి

పంపాసరోవర ప్రాంతమ్ము లేగు
ఇంపైన త్రోవల వీక్షించి నపుడె
ఆనాడు శ్రీరాము నాననమ్మందు
కానవచ్చిన దొక యానందరేఖ.
రాముని మొగమున రమ్యత జూచి
సౌమిత్రియును చాలసంతసంపడియె.
ఏదివ్యసీమకో యేగుచున్నటుల
ఆదారివెంబడి నరుగుచువారు
కనుగొని రొకచోట కనుల కింపైన
వినుత నూత్నవసంత విభవ ప్రశాంత
రమణీయ సుందరారామ శోభితము
సమధిక రుచిరమ్ము శబరియాశ్రమము.

సలలిత సత్తప స్సంకల్పదీక్ష
ఫలియించి మేనెల్లపండి బంగారు
ముడతలు వోయిన మూర్తి యాశబరి
కడువిశుద్ధచరిత్ర, కమనీయగాత్రి
చూచిరి వార లాసుందరాశ్రమము

చూచెను శబరి యాపుంసరాకృతుల
ఆనందబాష్పముల్ మేనెల్ల నిండి
ఆనందమూర్తియై యలరి యాశబరి
"వచ్చినావా రామ! వచ్చినావోయి
మచ్చికతో నన్ను మన్నించుకొనకు
విన్నాను నీకీర్తి విన్నాను స్వామి
కన్నార నిన్నెప్డు కాంతునో యనుచు
నిన్నెతలంచు చిందున్నాను స్వామి
ఎన్నాళ్ళకోయి నీవిటువచ్చి తనుచు
సన్నుతాకృతులార! చనుదెండటంచు
అన్నకు తమ్మునికాతిథ్యమిచ్చి
పూలమాలలుదెచ్చి పూజలుచేసి
బాలరామునిజూచి పరవశయగుచు
శ్రీరామ మీకు నాచేతులతోడ
ఆరముగ్గిన పండ్ల నేరితెచ్చితిని,
తేనెపట్టులనుండి సోనలై దిగిన
తేనెలియ్యవి స్వామి తెచ్చినా నిపుడె
అదిగో ఆకనుపించు నదినుండి వచ్చు
సదమల మధునీర సారములివ్వి
ఆకలిగొంటి రీయడవులఁ దిరిగి
స్వీకరింపుఁ డటంచు ప్రియముగా నిచ్చి

కనుమయ్య నాతపోవనవాటియిద్ది
కనుము నాబ్రతుకెల్ల గడచె నిచ్చటనె
నా రామచిలుకలు నా కోకిలములు
నా రమ్యఫలతరుల్ నా పూవుబోదలు
అనయమ్ముప్రవహించు ఆ సెలయేరు
కనుము శ్రీరామ నాకనువెల్గు లివ్వి
వసుధ నీపూవులు వాడిపోవెపుడు
ప్రసరించుచుండును రమ్యసౌగభము
అదె మతంగాశ్రమ మతండు నాగురువు
అదెచూడు మయ్యవే అగ్నిహోమములు
ఈదాసిజీవిత మ్మిదెస్వామి యిపుడు
నాదెస కరుణించి నను మన్నింపు బోకు
శ్రీరామచంద్ర! నాప్రేమదీపమ్మ!
శ్రీరామచంద్ర! నాఆరాధ్యదేవ!
నీయాత్రలివి శుభశ్రేయమ్ములగుత
పోయిరావయ్య నాపుణ్యఫలమ్మ"
యనుచు రామునిసాగనంపె నాశబరి
వినమిత శీర్షయై వీడ్కోలొసంగి.

శబరిమర్యాదయు శబరిప్రేమమ్ము
శబరిని చూచిన సమయమ్మునందె
ధరణిజ దరిలేని విరహవేదనల

బరు వోకయింతగా తరుగుచున్నట్లు
రాముని మనమున క్రమముగా నూత
నామోద మేదియో యలర సాగినది.

అరసితే లక్ష్మణా! యట నగస్త్యుండు
శరభంగుఁ డత్రియు శబరి యిచ్చోట
విదితమహాత్యాగి విహగనాథుఁడును
మృదులవర్తనులు వీ రెవరికివారె
అసదృశవనమ్ముల నలరారు మాను
లసమానమధుమూర్తు లాదరాశయులు.
చరితార్థులము వీరి నరసినమనము
ధర నబ్బునే యిట్టిధన్యత యనుచు
వారలమహిమమే వచియించుచెలమి
చేరెను పంపకు శ్రీరామమూర్తి.

శ్రీమద్రామాయణమునందు అరణ్యకాండము
సమాప్తము



శ్రీరస్తు

# శ్రీమద్రామాయణము

## కిష్కింధాకాండము

### సుగ్రీవమైత్రి

అడవులందు కబంధుఁడానాడు తమకు
నుడివిన హితవాక్య మెడదలం దుంచి
వనులందు సుగ్రీవ వానరవరుని
కనఁగాను చేరీతినను సందియమున
ఆరణ్యమార్గమ్ము లందున చనుచు
శ్రీరామలక్ష్మణుల్ చేరిరి తుదకు
సొంపైన తరులతాశోభ లింపారు
పంపాసరోవర పరిసరమ్ములకు
ఆ సరోవరసీమ కరుదెంచి నంత
భాసుర సమ్మోద భావమ్ము తోచి
ఆరామచంద్రుని యాననమ్మందు
శ్రీరమ్యమై క్రొత్త చెలువ మేపారె.
శ్రీరామలక్ష్మణుల్ చేరి యచ్చోటి
ఆ రామ సౌందర్య మరయుచున్నంత

దూరమ్మునందుండి వారినిఁ జూచి
వీరవరేణ్యులు వీరి నెవ్వరినొ
తనమీద కంపించె తనయన్న వాలి
యనుకొని సుగ్రీవుఁ డతిభీతి నంది
అనుపమ బలయుతుఁ డతిబుద్ధిశాలి
అనిలపుత్రుండు తన కనుచరుండైన
హనుమంతునిం బిల్చి "హనుమ యల్లదిమె
కనుగొను మచ్చట ఘనచాపహస్తు
లిరువురు వీరులు తిరుగుచున్నారు
సరగున నీవేగి, మరిమాదతోడ
వారలెవ్వరో యేమి కారణమ్ముండి
వార లిచ్చోటికి వచ్చియున్నారో
అరసి రమ్మని" పంప అతివినమ్రుఁ డగుచు
అరిగె నాస్థలమున కాంజనేయుండు
ఆజానుబాహులు అతిబలాకృతులు
రాజలక్షణ దీప్త రమణీయతనులు
తేజఃప్రభావులై దీపించుచున్న
రాజితాకారు లా రామలక్ష్మణుల
కనుగొనినంతనే హనుమంతునకును
మనమున మిక్కిలి వినయమ్ము భక్తి
జనియింప దరిజేరి చతురత మెఱయ
మనుజభాషణముల హనుమఁ డిట్లనియె

"ఎవరయా మీరిర్వురీ ప్రాంతములను
ఎవరినో వెదకుచు నేగుదెంచితిరి
వందనీయులు మీదు వదనముల్ చూచి
డెందాన నాకొక సందియమ్మొదవె
ఎఱుఁగనగునె మీర లేకారణమున
అరుదెంచిరో" యని హనుమంతుడు మ్రొక్కె.
హనుమని వినయమ్ము, ఆదరాకృతియు
హనుమని మృదువాక్యఫణితి చూడగనె
ఆమోదముగ బుట్టె నాతనియెడల
రామచంద్రున కొక ప్రేమభావమ్ము
కనుగొని యగ్రజు కనులలో వెలుఁగు
హనుమని దిక్కయి యంత సౌమిత్రి
"నిను నెఱుంగము గాని వనచరవర్య!
వినవయ్య, కోసలపృథివికి రాజు
విశదవిఖ్యాతుఁడు విబుధ వందితుఁడు
దశరథనృపతికి తనయుల మేము
ఈతడు శ్రీరాముఁ డేను లక్ష్మణుఁడ
ఏతెంచె తనసతి సీతతో నితడు
వనముల కీరీతి జనకువాక్యమున
వనులకు వీరితో వచ్చితి నేను.
కనుపండువగు పుణ్యగౌతమీ తటిని

వనమునందున మేము వసియించుచుండ
ఇరువురమ్మచట మేమింట లేనట్టి
తరుణమ్ము గనిపెట్టి దానవుం డొకడు
కొనిపోయె సీతని వనిత నాకతన
వనముల వెదకుచు వచ్చితి" మనియె
హనుమంతుడును వారియంఘ్రుల కెఱగి
వినయమ్ము తొలాడు ప్రియభాషణముల
"రామలక్ష్మణులార! రాసుతులార!
నామాట నమ్ముడు నాతోడ రండు
అనిలు తేజమ్మునం దంజనాసతికి
జనియించినాడ నోసద్గుణులార!
ఘనుడైన సుగ్రీవ కపివీర వరున
కనుచరుండను నన్ను హనుమంతు డంద్రు
రరుగుద మిక మన మాతనికడకు
ధరణి నే మైత్రైన జరుగు మీ కనగ
వినినంత సుగ్రీవు డను పేరు వేగ
హనుమంతు వెంబడి నరిగిరి వారు.
వేషమ్ము చూడంగ విరయభూషితము
భాషణమ్మున వేదపాండితి కలదు
సరళస్వభావుడు సౌజన్యు డింత
పరిణతబుద్ధి యీ వాయుసుతుండు;

ఘనుండు సుగ్రీవుం డాకపి యెంతవాడో
యనుకొని శ్రీరాముం డాశ్చర్యమందె.
తనవద్ద కరుదెంచు ధరణీశు సుతుల
గనుంగొని వినయుండై కపిరాజు నిలువ
హనుమ సుగ్రీవున కంజలి బెట్టి
వినిపించె రాముని వృత్తాంత మెల్ల.
తనతోడి చెలిమికై చనుదెంచి నట్టి
ఘనుండు రాముని౦ జూచి కపివరుం డంత.

"స్వాంతమ్మునందున జానకికొఱకు
చింతింపకయ్య యో శ్రీరామచంద్ర!
ఇనకులస్వామి లింబలమీద నీవు
ఇనునియంశను ధాత్రి జనియించితేను
ధరణిని మేలయి స్థిరముగా నింక
వరలుగావుత మనయిరువురి చెలిమి.
నిపుణాత్ము లతిశౌర్య నిష్ఠాతులైన
కపు లసంఖ్యాకులై కలరు నాయొద్ద
ధరణీతలమ్మున దశదిశలందు
ధరణిజ యెటనున్న తడయక వెదకి
ఆమెను చెఱబట్టి యఱిగిన దైత్యు
నామమ్ములేకుండ నాశ మొనర్చ

సాయమిాయఁగ నీకు సర్వవిధాల
చేయుచుంటి ప్రతిజ్ఞ శ్రీరామ" యనియె.

తనరు సంప్రీతితో తనమాట లెల్ల
వినెడు రాముని జూచి వనచరవరుడు
ధరణిపై నొకనాఁడు తనసైనికులకు
దొరకిన నగలను త్వరగ చూపించి
"రాక్షసుఁడొకఁ డేగు రథమునందుండి
ఈక్షోణిపైఁబడె నీభూషణములు
విలసిత సామ్రాజ్య విమలచిహ్నములు
వెలది సీతవా యేమొ తిలకింపు" డనఁగ
సీతకట్టినచీర చెఱఁగున నున్న
సీతనగలగుర్తు శ్రీరాముఁ డెఱిఁగి
"జానకీ! నీకెట్టిసంతాప మొదవె
నేనెట్లు రక్షింతు నిన్నింక" యనుచు
అక్కునఁ జేర్చి యాసీతనగలు
గ్రక్కున మొగమున కన్నీరు నింప
తనమాట మరల నావనచరవిభుఁడు
వినిపించి రాముని వేడి యోదార్చె.
ఆరీతి సుగ్రీవు డాడు మాటలకు
శ్రీరాముఁ డెద కొంత యూరట నంది

క్షితిమీఁద నిజమైన హితుఁ డీతఁ డనుచు
నతనిస్నేహమును తా నాసించె మదిని
సురుచిరమూర్తు లాయిరువురి కపుడు
జరిగె స్నేహ మ్మగ్నిసాక్షిగా నచట.

## వా లి వ ధ

ఊరటం గొని కొంతతీరిక నున్న
శ్రీరాము నొద్దకుఁ జేరి సుగ్రీవుఁ
డతిదీనుఁడై తనయాత్మలో నున్న
వెతనెల్ల నీరీతి వినిపింపఁ దొడఁగె.
"వినుమయ్య రామ! నావిన్నపమొకఁటి
ననుఁ బ్రోవఁ గలిగిన నాథుఁడ వీవు
కనుచూపుమేరలోఁ గల దెట్టయెదుట
కనుమదె కిష్కింధ యనెడు పురమ్ము
అనుపమ బలుఁడు నాయన్న యౌ వాలి
నను నీవలకు నెంటి నాభార్య రుమను
గైకొని, యందుండి కపిరాజ్య మెల్ల
ప్రాకటమ్ముగ తానె పాలించుచుండె.
వాలికి భయపడి పరువెత్తి వచ్చి
ఈలీల నుంటి నీఋశ్యమూకమున.
మునిశాపమున ఋశ్యమూకమ్ము కడకు
చనుదెంచెనా వాలి చచ్చు నాక్షణమె.

నను వీడకుండగ నమ్రవర్తనులు
హనుమదాదులు కొంద అరుదెంచినారు.
ఇంతకున్ నేనొనరించిన నేర
మింతైన లేదు నీవేర్పడ వినుము.
వసుధలోఁగల సర్వబలవంతులందు
అసమానవీరుడ నగుదు నేనంచు
చనుదెంచె దుందుభి యనెడు వాడొక్క-
డనిసేసి మావాలి నణఁగద్రొక్కుటకు.
కనుపించు నాగిరిగహ్వరమందు
ననిసేసి రాయిర్వు రతిశయబలులు
మొనసి బాహాబాహి ముష్టియుద్ధమున
చనినది యొకపూర్ణ సంవత్సరమ్ము
బయటికి నెత్తురుల్ ప్రవహించె గాని
బయటికి గుహనుండి వాలి రాలేదు.
ప్రాణముల్ బాసెను వాలి యటంచు
వానరమంత్రులు వచ్చి నాకడకు
"బల్లిదుఁ డైనట్టి ప్రభువు కన్పడక
కల్లోలమయ్యెను కపిరాజ్య మెల్ల
వాలితమ్ముడ వీవు వానరరాజ్య
మేలుమంచును పట్టమిచ్చిరి నాకు.
మరల దుందుభి పైకి తిరిగి రాకుండ

గిరిగుహన్ పెనుఱాళ్ళబరువున మూసి
కైకొని సంతన కపిరాజ్య మేను
ప్రాకట విజయుఁడై వాలి విచ్చేసి
ఆగ్రహావేశుఁడై యరసి నావంక
సుగ్రీవ! నీకెంతచూపట్టె గర్వ
మీలీల నారాజ్య మేలెద వనుచు
కాలితో ననుఁదన్ని నేలపైఁ ద్రోసె.
"అన్న! నీపదవి నాకక్కఱలేదు
సన్నుతవానర సమ్రాట్టు నీవె"
యని యంతయుంజెప్ప యంఘ్రుల వ్రాలి
వినయమ్ముతో చాల వేడితిఁ గాని
ననుక్షమియింపక నాసతిన్ బట్టి
నను చంపబోవగా చనుదెంచి తిటకు.
అదె చూడు రామ! ఈయద్రిసానువున
ఎదురుగా చెట్టంత యెత్తున నున్న
అసురుఁ డాదుందుభి యస్థిపంజరము
విసరివేయగ వాలి వేగాన వచ్చి
పడినదిచ్చట రక్తపంకముల్ గొలిపి
కడుగొప్పముని మతంగాశ్రమస్థలిని.
తనతపోభంగమై మునిశాపమిచ్చె
వనచరాధముడ! ఓవాలి! నీవింక

యెపుడేని యీగిరి కేతెంతు వేని
అపుడె నీతల వ్రక్కలయి చత్తువనుచు.
రానేరఁ డని వాలి యీనగమ్మునకు
నేనిట ధైర్యాన నివసించుచుంటి
ఇది నాదు కథ రామ! ఏమిసేయుదువొ?
సదయాత్మ! నీవె నా శరణంచు మిగుల
వేడు సుగ్రీవుని ప్రేమతో నెత్తి
"ఏడుము నీభీతి ప్రియమిత్ర యింక
నీసతిన్ చెఱబట్టి నీకిట్టి యెగ్గు
చేసిన వాలికి చేటు మూడినది.
ఆ కుటిలాత్ముని హతమార్చి నీకు
చేకూర్తు ముదమని శ్రీరాముఁ" డనియె.

అంత సుగ్రీవుఁ డోయనఘ శ్రీరామ!
అంతటి బలుఁడ వీ వగుదువు నిజము
వచియింతు నైనను వాలిబలమ్ము
ప్రచురోగ్రుఁ డాతఁడు వాసవు సుతుఁడు
ప్రతిదినమ్మును నాల్గు వార్ధులం దోగి
అతిభక్తి శంభున కర్చనల్ సలుపు
ఆయుత బలశాలి అతిభయంకరుఁడు
వేయిచేతుల కార్తవీర్యు నోడించె,

తన్నెదిరించిన దశకంఠుఁ బట్టి
మున్నీటిలో ముంచి మూర్ఛనొందించె
దనుమాడె దుర్వార దుందుభి నదియె
కనుపడుచున్న దాకంకాళ మనుచు
చూపె రామునివైపు సుగ్రీవుఁ డెడద
తోఁచగా తనకేదో దుడుకు శంకయును.

శ్రీరాముఁ డంత సుగ్రీవునిఁజూచి
ఈరీతి వెఱపు నీకేల సుగ్రీవ!
చూడు మొక్కింత నాశూరత యనుచు
పోడిమిమై కాలిఁబొటవ్రేల మీటి
యెగురగొట్టెను దైత్యునెముకలప్రోగు
మిగిలి నూరామడ మేరఁ దూలంగ
పదపడి శ్రీరాముఁ డెదురుగా నచట
చదలనంటుచునున్న సప్తతాళముల
భంజించె నేకైకబాణఘాతమున
శింజినీ ధ్వనికిని చెదర దిక్తటులు
నేలపెళ్ళలతోడ తాళవృక్షములు
తూలె నూరామడ దూరమ్ముపోయి.
శ్రీరామచంద్రుని క్రూరనారాచ
దారుణ దుర్వార మారణశక్తి

వీక్షించి సుగ్రీవుఁ డెద మెచ్చుకొనుచు
రక్షింపు మని వ్రాలె రాముపాదముల.

దరిఁ జేర్చి వానరవరు నాదరమున
చిఱునవ్వునవ్వుచు శ్రీరాముఁ డంత
"వనచరవర ! తేపె వాలిని పిలిచి
అని సేయఁ జనుము నీ వెనుక నేయుండి
నేలఁ గూల్చెద వొక్క నిశితబాణమున
వాలి" నంచును పంపె వాలిసోదరుని.
సుగ్రీవుఁ డామాటచొప్పున వేగి
అగ్రజు నెదిరించి యనిసేయఁ బిలిచె
సమరూపు లత్యంతసాహసాన్వితులు
సమధికసత్వులు శౌర్యభాసురులు
వాలిసుగ్రీవు లవార్యదోర్బలులు
చాలసేపటు పోరు సాగించినారు.
శ్రీరాము సాయమ్ము చిత్తమందెంచి
పోరాడి పోరాడి పోరాడ లేక
పారి సుగ్రీవుడు ప్రాణాలతోడ
శ్రీరాము దరిజేరి చేతులుమోడ్చి
"ఏలయ్య శ్రీరామ యిట్లు జేసితివి
వాలిధాటికి నేను తాళజాలుదునె
నేనేగి పోరికి నీమాటనమ్మి

ప్రాణాలతో నిట్లు పారివచ్చితిని
చూడుము నామేను చూర్ణమ్మొనర్చె
వీడె నాతఁ" డటంచు విలపించసాగె.

దీనుఁడౌ సుగ్రీవుదెస రాముఁ డరసి
"వానరవర్య! నావాక్యమ్ము వినుము
మీసమంతయుఁగూడ భేదమ్ములేని
భాసురాకారులు వాలియు నీవు
పోరిలో నిన్నట పోల్చగ లేక
ఊరకుంటిని లేదు వేఱు కారణము
నమ్ముము సుగ్రీవ నాపల్కు లెదను
పొమ్ము చేపట్టి పొద్దె పోరికి మరల
పోల్చుట కయి నిన్ను పొంత నేయుండి
తాల్పుమీ గజపుష్పదామ మ్మటంచు
పూదండ నొకటిచ్చి పురికొల్పి పంపె
నాదరమ్ముగ పోరి కతనిని మరల.

అలరెను సుగ్రీవుఁ డాదండఁ దాల్చి
విలసిత నూతన విక్రమాకృతిని.
మఱునాఁడె కిష్కింధ కరిగి సుగ్రీవుఁ
డఱవసాగెను వాలి ననికి రమ్మనుచు.
ప్రీలె దిక్తటములా భీషణధ్వనికి

వాలి యుగ్రుండయి బయటకు వచ్చి
ప్రాణాలతోడ నాపరిపంథి నింక
పోనీను ననుచుండ వాని యర్ధాంగి
తార యడ్డమువచ్చి తాళుమో నాథ!
పోరి కీదినమున పోబోకు మయ్య
నిన్ననే పోరిలో నీచేత నోడి
తన్నులు తినినట్టి తమ్ముఁడు మరల
నని సేయఁ బూనగా అర్థమ్ము వేఱె
కనుపించుచున్నది కాదనుబోకు
రణవీరు లిరువురు రాజనందనులు
చనుదెంచి రినసుతు సాయమై యనుచు
వినియుంటి నామాట వినుమని వేడ
తనసతిన్ వారించి యనికేగె వాలి.

రెండు మదేభముల్ రెండుశైలములు
భండన మ్మొనరించు భంగిని వారు
మొనసి ముష్టాముష్టి మొండిధైర్యమున
పెనగి బాహాబాహి భీకరాకృతుల
ఆకశమేప్రీలు నట్టహాసముల
తాకి కొండొరులను దర్పమ్ము లెగయ.

ఎగయును నింగికి, దిగును ధారుణికి
ఒగి పట్టి సుగ్రీవు నొడిసిపల్లార్చు
చూపులకందని రూపమా వాలి
నైపుణ్య మరయగా నయనాద్భుతమ్ము.
తనుశక్తి క్షీణించి తాలిమి తూలి
యనిలోన సుగ్రీవుఁ డలయుట జూచి
అచటనే యొకచెట్టు కావలనుండి
ప్రచుర విక్రమకళాభార ధౌరేయ
నారాయణుండైన శ్రీరాముఁ డొక్క
క్రూరనారాచంబు గురిఁజేసి కొట్టి
వాలి నాక్షణమందె నేలనుఁ గూల్చె
నేలను గూలిన వాలిని జూచి
కడకమై సుగ్రీవుకపిబల మెల్ల
విడువక చేసిరి విజయరావములు,
వలదంచు చెప్పినన్ బవరాన కేగి
యిలగూలి తీవని విలపించె తార,
వసుధైక వీరు డీవాలి నాతండ్రి
యసువులఁ బాసెనంచంగదు డేడ్చె,
తనతోడినైరాన ధరణి నీస్థితికి
తనయన్న వచ్చెనం చినసుతుం డేడ్చె.

భీమమై తనగుండె (వీల్చిన యట్టి
రామనామాంకిత పరిదరమ్ముఁ జూచి
కనువిప్పి రాముని కనుగొని వాలి
కొనప్రాణములతోడ ననియె నీరీతి
"ఏలయ్య శ్రీరామ! యినకులసోమ!
నేలపాల్జేసి నీనిర్మలకీర్తి
చెట్టుచాటుననుండి చెట్టతనాన
పట్టి యీవాలిని పడనేసినావు ?
చెప్పుము చేయెత్తి క్షితిమీద నీకు
ఎప్పుడయినను నే నెగ్గుసేసితినె,
అన్నదమ్ములము మేమట్టిట్టు పడగ
క్రన్నన నీవు రా కారణమేమి ?
వలయుచో రావణున్ వాలాన జుట్టి
నిలిపియుందును నేను నీకాళ్ళముందు
రాచధర్మము కాదు రామ నీకిట్టి
నీచకార్య"మ్మని నిందించుచుండ-
కరుణతో వాలిని, గాంచి రాఘవుఁడు
పరమప్రశాంతత పలికె నీపగిది
"నీవుచేసిన పని నీవెఱుంగకయె
నీవిట్లు వచియింతు వో వానరేశ,
పాటించుచున్నట్లు పరమార్థ మీవె

మాటికి ధర్మమ్ము మాట మెత్తేదవు
నీమది నీతియు నియమమ్ము లేని
కామాంధుడవుగాక భూమిపై నీవు
తమ్ముని సతి, బట్టి తమ్ముని గెంటి
యిమ్మాడ్కి నీవుండు టేటి ధర్మమ్ము
ఇనవంశ నరపతు లిలను ధార్మికులు
వినుము సైరింప రీ విపరీతములను.
భరతుం జేలెడి ధర్మపరిపాలనమున
ధరణి నీబోంట్లకు తావుండబోదు
వృక్షమడ్డుగం జేసి మృగమీవు గాన
శిక్షించితిని దీన చెడుగేమి లేదు
మరణమే తెంచు నీతరుణ మందైన
ఎఱుంగుము నీ తప్పు నెడదలో వాలి!
మాన్యతగాంచి నీమనుగడ యింక
పుణ్యలోకములకు పోయెద" వనియె.

శ్రీరాము మాటలు చిత్తాన కెక్క
శ్రీరాముంగని వాలి చేతులు మోడ్చి
"శ్రీరామ! నన్నీవు సైరింపుమయ్య
నేరక చేసితి నేరమ్ము లెన్నో
పరసతిన్ బట్టిన పాపిని నేను
ఎఱుగక పల్కితి దురుసుమాటలను

# వాలివధ

పృథుశక్తిమంతుల సేందజెందటినో
పృథివి నోడించిన వీరు నన్పట్టి
ఇలగూలనేసితి వేకబాణమున
తెలిసెను రామ నీదివ్యమహా శక్తి
ధరణిని నీచేత మరణమ్ము దొరకె
పరమార్థ మిది నిన్ను మఱువలే ననుచు
తన భార్య తారను తనయు నంగదుని
కనుగొని వాలియు ననుజు రప్పించి
"సోదరా! సుగ్రీవ చూచుకొమ్మింక
ఈదీను లిరువురిన్ ఆదరమ్మొసఁగ
ఇమ్మానితాకారు నీరాముఁ గొలిచి
ఇమ్ముగ కిష్కింధ నేలుకొమ్మీవు,
భరియింపఁజాల నీ బాణమ్ము నికను
పెఱికింపు మని ప్రక్క కొరిగెను వాలి.
నీలుఁ డంతటవచ్చి వాలికి మ్రొక్కి
వాలిగుండెలనుండి బాణమున్ పెఱికె
దివ్యసీమలకేగె దీప్తమై యొక్క
భవ్య తేజము లేచి వాలిలోనుండి.

వీరుడు మాయన్న పృథివిపైఁ గూలె
నీరాజ్యపదవుల నేనొల్ల ననుచు
శూరతవీడి యాసుగ్రీవుఁ డొక్క

వైరాగ్యభావాన ప్రక్కకు తొలఁగ
తారాంగదులు నల్లె భోరున నేడ్వ
శ్రీరాముఁ డోదార్చె వారినందఱిని
సన్నుతమ్ముగ సల్పె శాస్త్రోక్తవిధుల
అన్నకు సుగ్రీవుఁ డంత్యకర్మములు.
సలలితమ్మగు నొక సన్ముహూర్తమున
చెలులు తారయు రుమ చెంతప్రక్కనుండ
వైభవమ్మొసగెడు వానరరాజ్య
శోభాభిషిక్తుఁడై సుగ్రీవుఁ డలరె.
రంగారు శోభతో రమ్యసద్గుణుని
అంగదునుంచిరి యావరాజ్యమున.

"శ్రీరామచంద్ర ! నీ కారుణ్యముననె
ధారుణి నాకింత గౌరవ మ్మబ్బె
నని పల్కి శ్రీరామునంఘ్రుల కెఱఁగి
చనెను సుగ్రీవుఁడు తనసౌధమునకు
చారు మనోహర శర్వదాకృతులు
తారయు రుమయును తనవెంట రాగ.

నివసించుచుండి రా నికటమందొక్క
ప్రవిమలగుహఁజేరి రామలక్ష్మణులు

విస్మయుండై వానరవిభుని దగ్గఱకు
హనుమంతుం డొక్కనా డల్లనవచ్చి
"కారుణ్యమెసంగ నీకార్యమ్ములెల్ల
శ్రీరామచంద్రుండు చేసెనుగాన
రయమున కపిరాజు రామునిపనిని
నియమప్రకారము నెఱవేర్పు మింక
చనుచున్న వెన్నియోదినము లూరక రాము
మనమున నీమాట మఱువ" కనంగ
వడిగ నీలుని తనకడకు రప్పించి
నుడివె సుగ్రీవుండు పుడమియందున్న
వనచరబలమెల్ల త్వరగ రప్పించి
జనకజన్ వెదకెడు పనిచూడు మనుచు.

వరదలు ముంచెత్తు వానలు ముగిసి
శరదిందుచంద్రికల్ ధరణిని విరిసె.
సీతావిరహబాధ శ్రీరామమూర్తి
చేతమ్మునం దోంచి చీకాకుపఱచె.
శ్రీరాముం డొకనాడు చినతమ్ముం జూంచి
"ఈరీతి సుగ్రీవుం డేల నాలస్య
మొనరించుచున్నాడో కనుగొనుమయ్య,
దినములు మాసముల్ చనుచుండె గాని
జనకజకై యేమి సలుపుచున్నాడో

కనుపడ డెప్పుడున్ కపిరాజు మనకు
మనసులో మనలను మఱచెనో యేమొ
వెనువెంటనే నీవు వెడలిరమ్మ"నియె.

అగ్రజు నాగ్రహమ్మరసి సౌమిత్రి
ఉగ్రుండై కిష్కింధ కొక్క భ్రుకుటి నేగి
ద్వారమ్ముకడనిల్చి తన చేతినున్న
ఘోర కార్ముకమెత్తి నారి మ్రోయించె.
అల్లలనాడి యా యఖిల కిష్కింధ
కల్లోలమయ్యె నా కార్ముకధ్వనికి
తారారుమలగూడి తనసౌధమందు
తీరని తమితోడఁ జేరి క్రీడించు
కపిరాజుగుండెలు కలగుండువడియె
విపరీతమేదియో వెనుదన్నినట్లు
కోపానవచ్చి యా గుమ్మమ్ముకడనె
చాపియై నిల్చిన సౌమిత్రిజాడ
నెఱిఁగింప అంగదుం డరిగి లోనికిని
సరగున తారయు చనుదెంచి వెలికి
సదమల మృదువాక్య చాతుర్య మమర
సదయాత్మ లక్ష్మణున్ శాంతింపఁజేసె
ఏతెంచి సుగ్రీవుఁ డింతలో వెలికి

చేతులు మోడ్చుచు చేరిలక్ష్మణుని
ఆమోద మొనఁగూర్చ్చి నాదరోక్తులను
"సౌమిత్రి ! వినుము శ్రీరాముని పనిని
మఱువలేదయ్య నామదియందు నెపుడు
జరుపుచుంటిని సర్వసన్నాహ" మనుచు
సౌమిత్రితోనేగి రామునికడకు
రాముని కతిభక్తి ప్రణతులర్పించి
పలికె నీరీతిగా వానరవిభుఁడు
"అలసత్వమొకకొంత సలిపితిస్వామి
మునుముందె నేవచ్చి నినుఁజూడనైతి
ననుక్షమియింపుమో యినకుల తిలక!
జనకజన్ వెదుకగా వనచరులెల్ల
చనుదెంచి నారదే కనుగొనుమయ్య
ఇలనెల్ల వెదకి నీయిల్లాలి వార్త
తెలియఁజేయుదు రొక నెలనాళ్ళలోన
సెలవిమ్ము నాకన శ్రీరాముఁ డతని
నలరుచు కనుఁగొని యూగాక యనియె.

సు గ్రీ వా జ్ఞ

చనుదెంచి తనముందు వినయులై యున్న
వనచరులను జూచి వనచరవిభుఁడు
"వరవీరులార యో వానరులార !

ధరణిని మనకొక పరమార్థమగుచు
కలదు శ్రీరాముని కార్యమొకండు
పలుపుడు వేగ మీశక్తినిం జూపి
జనకజన్ శ్రీరాముసతిని మోసమున
కొనిపోయె క్రూరుడై దనుజుం డొకండు
మానక మీరక మహినెల్ల వెదకి
జానకీదేవిదౌ జాడ నెఱింగి
మరలి రావలెమీరు మాసమ్ములోన
అరిగి రాలేని మీరారీతి తరగి
ప్రాణమ్ములుండవు వసుధ మీ" కనుచు
వానరేశ్వరుం డంపె వానరతతిని.
వానరవిభునాజ్ఞ భక్తినాలించి
వానర నాయకుల్ పయనమై చనిరి
తమతమ సైన్యముల్ తరలించుకొనుచు
సమధికోత్సాహులై జనకజన్ వెదుక.
చనె నుత్తరమునకు శతబలి వేగ
వినతుండు ప్రాగ్దిశా పృథ్వికి వెడలె
నడచె సుషేణుండు పడమటిదెసకు
కడువడి తమవెన్క కపివరుల్ నడువ
అంగద జాంబవదాదులం గూడి
పొంగుచు హనుమయు పొలుపుమీఱంగ
తరలి పో నెంచుచు దక్షిణదిశకు

అరిగె ముందుగ రాము నానతిఁ గొనగ.
ఆమోదముగ తన యంగుళీయకము
రామనామాంకిత రమ్యమౌ దాని
హనుమంతున కొసంగి తనగుర్తు గాగ
అనిపెను శ్రీరాముఁ డాదరమ్మెసఁగ
శ్రీరామ ముద్రికన్ శిరమునఁ దాల్చి
శ్రీరామ నామమే చిత్తమందుంచి
పాతాళమైనను వ్రక్కలు జేసి
సీతను గనుగొని యేతెంతునంచు
అనవద్య పటుదీక్ష మనమున చెలగ
వనచరసేనతో హనుమంతుఁ డరిగె.

దినములు చనుచుండె తీవ్రమౌ గతిని
జనకజన్ గానక చనుదెంచినారు
వరుస ప్రాగుత్తర పశ్చిమ దిశల
కరిగిన వారెల్ల రరిగిన యట్లె
మన ప్రయత్నములెల్ల చనెను వ్యర్థముగ
జనకజన్ దనుజుఁ డేమొనరించె ననిన
సందేహములతోడ సంకులమ్మగుచు
అందఱి చిత్తముల్ హనుమపై నుండె.

## స్వ యం ప్ర భ

జగమెల్ల గాలించి జనకజన్ గనెడు
తెగువతో దక్షిణదిక్కుకు జనిన
హనుమయు జాంబవ దంగదాదులును
వనములు పర్వత ప్రాంతమ్ములెల్ల
చనిచని చూచిరి స్థలము లన్నియును
కనరాదు రాముని కాంత యెచ్చటను
ఇది యది యనకుండ నేగుచో నెల్ల
వెదకుచు డస్సి యా వీరులు తుదకు
చలువలు జిమ్మెడి శైలమం దొక్క
బిలమును జూచి యా బిలమును జొచ్చి
కనులకద్భుతముగ కనుగొని రచట
మణిమయ కాంచన మహనీయ సౌధ
వనసరోవగ లతా వాసి తమ్మైన
వినుత ప్రదేశ మా విమలాంగణమున
సురుచిరస్థలమున సుదతి యొక్కర్తు
ఒరులెవ్వరును లేక ఒంటిగా తపము
చేయుచుండుట జూచి చేసిరందఱును
పాయనిభక్తితో ప్రణతు లాయమకు.
ఆచెట్టు చేమలు నాపండ్లతోట
లాచల్వనీడల నరసి వానరులు

జనకజ యెటులును కనుపడదింక
మనమూరకేపోయి మరణించుకంటె
మనమిందె నివసింత మనుకొనుచుండ
హనుమంతుఁడును విని యాతంకపడెచె.

మయుఁడు నిర్మించెనా మహాసీయబిలము
నియతతపమ్మును నిత్యమ్ము సలుపు
నారీతి నచట స్వయంప్రభ యనగ
మేరుసావర్ణికి కూరిమి తనయ.
కనువిప్పి యామెయు హనుమదాదులను
కనుగొని, వారిదౌ కార్యమ్ము నెఱిగి
వినుతించి మది వారి వినయవర్తనము
మునుముందు వారల కనుకూలమైన
సలలిత ఫలముల శ్రమవాయఁ జేసి
పలికె నీరీతిగా "వనచరులార!
ఎవ్వరైనను సరె యీగుహఁ జొచ్చి
అవ్వలఁ జననేర రసువుల తోడ
కాని శ్రీరాముని కార్యమ్ము నెడద
పూని మీరున్నట్టి పుణ్యమ్ము చేత
అనిపెద మిమ్ము నే నవలికి మీరు
కనులు మూయుండన కపులెల్లవారి
కనులు మూసినయంత తనశక్తిచేత

యూ యమ వారల నావలకనిపె
శ్రేయమ్ము లగుగాక క్షితిని మాకనుచు.

ఆరీతి గుహనుండి యరుదెంచి కపులు
ధారుణీజాతకై దారులన్నియును
తిరుగుచు తోయధి తీరమ్ముఁ జేరి
ధరణిజ నెచ్చటన్ అరయలేమైతి
మెచటికేగుద మంచు నేమియుఁ తోచ
కచటనే సభఁజేసి యాగిరి వారు.

సంపాతి

జానకిన్ గానక పోనేర మింక
ప్రాణముల్ తీయు నా వానరవిభుఁడు
కనుక నిచ్చోటనే గడపుచు బ్రతుకు
మనముండి పోవుదమని కొందఱనిరి
అతిదీనుఁ డయి లేచి యంగదుఁ డంత
క్షితిజాతఁ గానని బ్రతుకేల నాకు
ఒకరిచే జచ్చుట యుర్వి నాకేల
ప్రకటమ్ముగా నేనె ప్రాయోపవేశ
మొనరింతు నిండ్లకు చనుఁడు మీరింక
వినయమ్ముగా నిదె వేడుదు ననగ
హనుమంతు డామాట కడ్డమ్ము వచ్చి

మనకింత భీతియు ననుమాన మేల
మానుడీ యోచనల్ మమలందు మీరు
జానకి నెట్టులో కానగా వలయు
రక్షింప జానకిన్ రాక్షసునుండి
పక్షిజటాయువు ప్రాణముల్ బాసె,
మనమింతమంది యీ మహిమీదనుండి
జనకజన్ వెదుకంగ చాలమా యనుచు
హనుమంతు డేదియో యనుచుండగానె-

కనులకు విభ్రాంతి కల్గించునటుల
ఆకాశమున నుండి యరసి యాకపుల
వీక్షమై మారుత వేగమ్ము తోడ
చనుదెంచి సంపాతి యనుపక్షిరాజు
వనచరుల్ ఎవరయ్యవచ్చి మీరిటకు
సీత జటాయువు దైతేయు డనెడి
భీతి నేవేవియో పల్కుచున్నారు
భ్రాతిసత్త్వుడు జటాయు వనుజుండు నాకు
ప్రతిలేని వీరుడు పక్షివంశమున
వానికేమైనదో వచియింపు డనంగ
జానకి కథనెల్ల జాంబవంతుండు
వినిపింప సంపాతి కనుల నీర్వెట్టి
ధనుజుడకట! యెంతపనిజేసినాడు

జనకజన్ బట్టె, నా యనుజుని జంపె
విన లేను నేనిట్టి విపరీతవార్త
వానరవరులార! భయము నొందకుడు
నేనెఱింగినమాట నిజమైనదిపుడు
కావరమ్మున రాముకాంతను గొనిన
రావణదైత్యుని రాజ్యమల్లదియె
వననిధికావల వరలు నాలంక
కనుపించుచుండె నాకంటిచూపునకు
చిననాడు నేను నాయనుజుండు కలసి
ఇనుని దన్కను నింగి కెగసిన వేళ
అనుజుఁడు మూర్ఛిల్లి యవనిపైఁ బడియె
కవలి నా ఱెక్కలు కాలిపోయినవి
కానినో మిమ్మెల్ల క్షణములో నటకు
నేన చేరిచియుందు నైన నేమాయె
మీవానరులలోన మేటి యాయీరుఁ
డీ వార్థిలంఘించి పృథ్విజంజూచి
త్వరగ రామునకిక ధరణిజవార్త
నెఱిఁగింపుఁడని చెప్పి యరిగె సంపాతి.

జాంబవంతుఁ డాంజనేయుని ప్రోత్సహించుట

వినిన తర్వాత నా విహగేశు పలుకు
మనముల ధైర్యమ్ముగొని వనేచరులు

జనకజన్ బట్టి, నా యనుజుని జంపె
విన లేను నేనిట్టి విపరీతవార్త
వానరవరులార! భయము నొందకుడు
నేనెఱింగినమాట నిజమైనదిపుడు
కావరమ్మున రాముకాంతను గొనిన
రావణదైత్యుని రాజ్యమల్లదియె
వననిధికావల వరలు నాలంక
కనుపించుచుండె నాకంటిచూపునకు
చిననాడు నేను నాయనుజుండు కలసి
ఇనుని దక్కను నింగి కెగసిన వేళ
అనుజుఁడు మూర్ఛిల్లి యవనిపైఁ బడియె
కనలి నా ఱెక్కలు కాలిపోయినవి
కానినో మిమ్మెల్ల క్షణములో నటకు
నేనె చేరిచియుందు నైన నేమాయె
మీ వానరులలోన మేటి యావీరుఁ
డీ వార్ధిలంఘించి పృథ్విజంజూచి
త్వరగ రామునకిక ధరణిజవార్త
నెఱిఁగింపుఁడని చెప్పి యరిగె సంపాతి.

జాంబవంతుఁ డాంజనేయుని ప్రోత్సహించుట

వినిన తర్వాత నా విహగేశు పలుకు
మనముల ధైర్యమ్ముగొని వనేచరులు

భూమిజన్ జూడగా పోయి రమ్మనియె.
ఆమాట కుప్పొంగి హనుమంతుఁ డంత
ఆమోదకుతుకమ్ము లతిశయింపంగ
ఈవార్ధి నాకెంత ఈ లంక యెంత
వేవేగ నేనేగి పృథ్వీజంజూచి
యరుదెంతు శ్రీరాము కరుణచే ననుచు
త్వరగ నంగదునాజ్ఞ బడసె నాపనికి
తిలకించి హనుమని బలము వానరులు
చెలరేగి చేసిరి సింహనాదములు.

శ్రీమద్రామాయణమునందు కిష్కింధాకాండము
సమాప్తము



శ్రీరస్తు

# శ్రీమద్రామాయణము

## సుందరకాండము

అంగద జాంబవదాది నాయకుల
సాంగత్యబలమును సత్ప్రేరణములు
రామకార్యారంభ రమణీయదీక్ష
భూమిజన్ గనుగొను పుణ్యచింతనము
లినుమడింపగఁజేయ తనపాటవమ్ము
హనుమంతు నుత్సాహ మంబరమ్మంటె.
వానరవీరుఁ డావాయునందనుఁడు
మేనుఁ బెంచెను మహామేరువువోలె
శివుఁ దలంచెను శ్రీరాముఁ దలఁచె
అవనిజన్ దలఁచెను అంబుధిం దలఁచె
దేదీప్యమానమ్మ దివ్యతేజమ్ము
మేదిని నల్దెసల్ మిఱుమిట్లు గొలుప
తనపాదఘాటికి ధరణియే క్రుంగి
అణగారు నను చింత నాత్మలో నెంచి
ప్రక్కనున్న మహేంద్రపర్వత మ్మెక్కి
గ్రక్కున నిలయెల్ల కదలి కంపింప
బింకమ్ముతో మహా భీకరాకృతిని
లంకను జేరగా లంఘించె వార్ధి.

## మైనాకుడు

రామకార్యార్థమై ప్రబలవేగమున
సామీరి వార్థిపైఁ జనుటను జూచి
తరణియు తగ్గించె తనతాపబాధ
కురిసిరి చల్లని విరివాన సురలు,
ఇంద్రుని వజ్రాస్త్ర మెడదఁ దలంప
సంద్రాన డాగిన చలిమల సుతుఁడు
మైనాకగిరి రాము మహితకార్యమున
నైనేగుచున్నట్టి పావనిం జూచి
నీమేని శ్రమ వాయ నీవొక్కగడియు
నామీద నిలుపుమో సామీరి! యనఁగ
చేతితో మాత్ర మా స్నేహితుం దాకి
వాతాత్మజుం డేగె పనియున్న దనుచు.

## సురస

పరికింప నెంచి యీ పావనిశక్తి
సురలు పంపించగా సురసయనంగ
నాగమాత యొకర్తు వేగమే వచ్చి
ఆగుమో కోతి నాకాహారమైతి
వని పెద్దగుహబోలు తననోరు దెఱువ
హనుమంతుఁ డొకచిన్న యంగుష్ఠమాత్ర
రూపమ్ముగా నొకత్రుటిలోన మాఱి

యూపెగర్భము జొచ్చి యావలి కురికి
వినయుఁడై తనపని విని పింప నతని
సునిశిత ప్రతిభకు సురసయు మెచ్చి
తనశుభాకాంక్ష లా హనుమకుఁ దెలుప
వినువీథి నాతఁడు వెడలెను మరల.

సిం హి క

హనుమంతుఁ డారీతి యబ్ధిపైఁ జనుట
కనుగొని సింహిక యనెడు రాకాసి
నిను మ్రింగెద నటంచు తనదారికడ్డు
చనుదెంచుచుండగా హనుమంతుఁ డామె
కుత్తుకన్ బిగనొక్కి గ్రుద్దులు గ్రుద్ది
నెత్తురుల్ గ్రక్కించి నీటిలోఁ ద్రోసె.

ఆరూఢ వేగాన హనుమఁ డారీతి
శ్రీరాముఁ డేసిన శితబాణ మట్లు
అంబుధిపై దాటి యవనితీరమున
లంబాద్రిపై కెక్కి లంకను జూచె.
పావనిశక్తిని పరమహర్షమున
దేవతల్ గమనించి దీవించినారు
శ్రీరామదూత యీ మారుతి కెపుడు
శ్రీరమ్య విజయమ్ము సిద్ధించు నటుల.

### లంఖిణి

కమనీయవనములు కనకసౌధములు
రమణీయమై పొల్చు రాజమార్గములు
కలిగి సంపన్నమై కనుల పండువుగ
నలరారు లంకను హనుమంతుఁ డరసి
పురిలోని కడుగిడి యరుగఁ బోవంగ
పరువున లంఖిణి వచ్చి యడ్డముగ
"పగబోకుము లోని కాగు మోకోతి!
ఈగైన చొరరాని యీలంక దరికి
ఎటులేగుదెంచితి వెవ్వడ వీవు
ఇటనుండి పొమ్మిక నెచ్చటి కైన
పరమేశుఁడైన యీ ద్వారమ్మునుండి
అరుగగా లేడు నా యనుమతి లేక
బ్రదుక నెంచెదవేని త్వరగ పొమ్మనుచు
నదలించు లంఖిణి నణగార్చి త్రొక్కి
కడువడి హనుమఁడు కంఠమ్ము పిసికి
సడి చప్పుడును లేక చంపె నచ్చటనె.

### హనుమంతుని లంకాప్రవేశము

హనుమంతుఁ డెవరికి నగుపడకుండ
తనశరీరము చాల తగ్గించివైచి
తిరుగు చచ్చట రాత్రి యరుదెంచినంత

పరు లెవ్వరును లేని తరుణమ్ము జూచి
ప్రాకారకుడ్యమ్ము పై కెగఁ బ్రాకి
యేకాంతముగ లోని కేగి నెమ్మదిగ
చూచెను వాకిళుల్ చూచె నంగడులు
చూచెను వీథులు చూచెను సర్వ
మా నగరమ్మున జానకి కొఱకు
కానగ నయినట్టి స్థానమ్ములెల్ల.
మదమున సురద్రావి నిదురించువారె
సుదతుల జతగూడి సొక్కెడి వారె
లంకయం దానాఁడు లవమాత్రమేని
శంక లేకుండగ సకలదానవులు
రావణు నంతఃపురమ్మును గూడ
పావని చొచ్చి యా భవ్యగేహమున
సదమలాంబరభూష సౌందర్యరాశి
మృదుతల్పమందున నిదురించుచున్న
మండోదరిం గాంచి మహిజాత యనుచు
కొండొకవడికి యీకోమలతన్వి
పతివియోగానల పరితప్త చిత్త
క్షితిజాత గాదని చింతించి హనుమ
పురమెల్లఁ జూచితి భూజాత నచట
నరయుటే నైతినం చాత్మలో వగచె.

అశోకవనము - రావణుని అతిశయము

పురికి నావల మంచి తరుశోభ తోడ
పరలుచున్న అశోకవనవాటి కడకు
మఱునాటి యుదయమ్మొ యరిగి తానొక్క-
తరుశాఖచాటున దాగి యాహనుమ
పరిసరమ్మున చైత్యప్రాసాద గృహము
దరినుండిన యశోక తరుమూల మందు
దనుజాంగనల మధ్య తనుశోభ మాసి
వనరుచు గూర్చున్న వనితను గాంచి
మరల మరల తన మానసమందు
ధరణిజరూపమ్ము సరిపోల్చు కొనుచు
ఈమెయె కాబోలు రామునిభార్య
భూమిజ యనుచును తామది నెంచి
మృగరాజు బిలమునం దొగి కట్టఁ బడిన
మృగశాబకము రీతి బెగడొంది యడలు
సీత దుస్థితిఁ గాంచి చింతించె మిగుల
చేతమ్మునందున వాతాత్మజుండు -

దానవాంగనలెల్ల జానకిం గాంచి
జానకీ నీకింత జాప్యమ్మదేల

దానవేంద్రుని పొందుఁ దలఁపకున్నావు
దానవనాథుని రాణివై నీవు
త్రిభువన సామ్రాజ్య దేదీప్యమాన
విభవమ్ము లనుపొంది వెలుగుట మాని
కోఱగాక వనములఁ దిరుగాడుచున్న
సఖుపేద రాముని స్మరియింతు వేల.
చెప్పితి మిన్నాళ్లు చిలకకు వలెనె
చెప్పిన మాటకు చెవియొగ్గ వీవు
గడువుదాటుచునుండె గాన రావణుఁడు
పుడమి ప్రాణాలతో విడువడు నిన్ను
విను మిప్పుడైన మాప్రియభాషణముల
ననుచున్నయంతలో నచటికే తెంచె
ధళధళాయత కాంతు లొలయుచుండంగ
ఘళఘళార్భటి దైత్యవీరులు కొలువ
తనవైభవము జూపి తనశోభ దెలిపి
జనకజన్ లోగొను వెనుకోర్కెతోడ
మణిమయభూషణ మహితవేషుండు
వినుత దానవరాజ్య విపులచిహ్నితుఁడు
అనుపమబలశాలి అతులతేజస్వి
కనులందు మదమత్త కామపూరితుఁడు
దశమస్తకుండును దశకిరీటుండు

విశదబాహాహారాన్విత విపులాయుధుండు
మణిఛత్రముల బూని మఘువులు బూని
వనితలు నూర్వురు తనవెంట నిలువ
ఘణఘణోద్భట మహాజయజయధ్వాన
రణితార్భటులతోడ రావణాసురుడు.

ఆ దీనవదనాబ్జ యామెయే సీత
ఈదర్పితోరస్కు డితడె రావణుడు
అని గ్రహించుచు మది నాశ్చర్యపడియె
దనుజు తేజము జూచి హనుమంతు డపుడు.
రావణుం డంతట రమ్యవాక్యముల
"నావద్ద నీవుండ నలినాక్షి సీత!
వెఱపేల నీకు నాపిఱికి రాఘవుడు
పరువిడె నడవులంబట్టి యానాడె
అతిలోకరమణీయమైన నీరూపు
మతినెంచి మోహించి మనసార నిన్ను
కొనివచ్చితిని సీత! కోపమ్ము వదలి
కనుము, నాబలమును ఘనయశోవిభవ
మణుమాత్ర మేనియు నా రామునొద్ద
కనుపింప వాతని మనమున మఱచి
కనికరింపుము నన్ను కౌగిలియిమ్ము
దనుజసామ్రాజ్యమ్ము తగ నేలుకొనుము

కడు న్యాయమే పెండ్లి గాంధర్వరీతి
పుడమి దానవులకు చెడుగిందు లేదు.
ఘనమైనసంపదల్ కానుకల్ నీదు
జనకున కిచ్చెద వినతులొనర్చి
వినయమ్ముతో సర్వదనుజభామినులు
నినుఁజేరి గొల్తురు నిత్యమ్ము వినుము
నీకిష్టమైనట్టి నిన్ను తాకెదను
నీకౌగిలింతకై నిలిచితి సీత!
అను రావణునివంక కవనిజ తనదు
కనులైన త్రిప్పక కినుక వహించి
గడ్డిపోచను దీసి కలుకు రావణుని
కడ్డమ్ముగా నుంచి యవలి దిక్కుచు
"ఈరీతి నను దెచ్చి యిచట బంధించి
కారులు పల్కెదో క్రూరాత్మ వినుము
ఘనుఁడు శ్రీరాముని కాలిగోరునకు
అణువైన పోలని యధముడ వీవు
ఖరదూషణాదుల పరిమార్చి నట్టి
పరమవీరుఁడు రాము నెఱుఁగవో యేమొ
దరినెవ్వరును లేని తరుణాన నన్ను
చెఱబట్టి లంకకు పఱతెంచి నట్టి
పిఱికిపందవుగాని అరయుచో నిన్ను

నరకికి పాతెడు వాడు నా నాథుఁ డపుడె.
పరభామలను బట్టు పాపివి నీవు
పరిమార్చు నిన్ను నీపాపకృత్యములె
నీతోడ పలుకుట నీచుఁడా యింక
పాతక మ్మగునని సీత యనంగ
దనుజేంద్రుఁ డుగ్రుఁడై ధరణిజ నరసి
"జనకజా! నీమద మ్మణగంగలేదు
మఱి రెండు నెలలకు మహిని నీబుద్ధి
తిరుగకయున్న నాకటుకత్తులకు
బలిసేతు నిన్నంచు పండ్లు దీటించి
పలుకుచు రావణుం డలుకతో నరిగె.

దనుజేంద్రుఁ డనినట్టి యనుచితమ్ములకు
కనులునిప్పులు గ్రక్క హనుమ యాక్షణమె
వానిపై లంఘించి వధియింపనెంచె
కాని శ్రీరాముని కార్యవిఘ్నమ్ము
జరుగునంచు దలంచి ధరణిజం జూచు
తరుణమ్ము కోఱకు నాతరువందె యుండె.

దానవాంగన లంత "జానకీ యేల
దానవేంద్రుని మదిఁ దలఁప కున్నావు
నిందించితివి గూడ నీచుఁ డటంచు

ఎందేగ గల వింక నీలంక విడిచి
వినుము లంకేశుని వేగమే నీవు
మనమున ప్రేమఁ గమగొన వేని
నినుఁబట్టి చీలిచి నిన్ను భక్షింతు"
మనుచుండ భయముతో వణకుచు సీత
"దానవాంగనలార! నానాథుస్మరణ
ప్రాణముల్ పోయినన్ మాననటంచు
పరువెత్తి పోయి యాపావని యున్న
తరువుక్రిందకు జేరి దురపిల్లుచుండె
శ్రీరామనామమే స్థిరభక్తితోడ
సారెసారెకు మది సంస్మరించుచును.

త్రి జ ట స్వ ప్న ము

"దనుజేశుమాటలు వినకున్నయెడల
నినుబట్టి దండన నొనరించు కంటె
తెరువేదిగాను మాకు తెలియదటంచు
వెఱపించు దానవతరుణుల నాపి
త్రిజటయన్నదొకర్తు తెలిపె నీరీతి
"నిజముగా కంటిని నేనొక్క కలను
జనకజ నేమియు ననకుడు మీరు
దనుజ భామినులార! వినుడు నాకలను
జనియించి నట్లుండె మనలకె కీడు

అనలోగ్రకీలల కాహుతిత్రైయగుచు
మనలంక భస్మమై చనెను సర్వమ్ము
అతివీరభీకరుం డైన శ్రీరాముం
డరుదెంచె మనలంక కబ్ధినిదాటి
రామరావణ మహారణసముద్యమము
భీమమై చెలరేగె పృథ్వి కంపింప
దానవబలముతో దానవేంద్రుండు
ప్రాణాలం బాసెను రణరంగమందు
భుజశౌర్య మలరంగ భూమిజం గూడి
విజయమై భవమున వెడలె రాఘవుండు
ఇది నాదుకల సర్వ మిటులె యౌ ననుచు
నెదదోచుచుండె నా కేలనో" యనగ
త్రిజటస్వప్నము విని దితిజభామినులు
నిజదర్పములు మాని నిశ్చేష్టలైరి
ఆమాటలు వినంగ నాత్మలో సీత
కామోద ముదయించి యానన మ్మలరె.
ఒకక్రొత్తయాసయు నొకక్రొత్త ధైర్య
మకలంకమై తోచె నామె కాక్షణమె
కడుశుభసూచక క్రమమ్ము లగుచు
ఎడమ బుజమదరె నెడమక న్నదరె.
వారున్నచోటనే పడినిద్రబొంది
ధారాతసాంగన లందఱు జంత —

ధరణికి దిగివచ్చి ధరణిజ పాద
సరసీరుహమ్ముల సాష్టాంగపడగ
హనుమంతు నుత్సాహ మినుమడించినది
మనమున యోచించె మరల నాహనుమ
చనుదెంచుచో నకస్మాత్తుగా తాను
దనుజమాయగ నామె తలచునో యేమొ
అని భీతినంది యాహనుమంతుఁ డపుడు
జనకజ దిశవైపె తనదృష్టి నిలిపి
జనకజ విననట్లు సలలితఫణితి
వినుతించె రాముని విఖ్యాతి నిట్లు.
"శ్రీరామ! రఘురామ! సీతాభిరామ!
కారుణ్యగుణధామ! కళ్యాణరామ!
దశరథవరపుత్ర! ధన్యచారిత్ర!
విశదసద్గుణవర్య! విక్రమధుర్య!
హరుని చాపముద్రుంచి అవనిజందెచ్చి
పరశురాము నెదిర్చి భంగ మొనర్చి
జనకు వాక్యము నెంచి వనసీమ జొచ్చి
దనుజులజంపిన రణరంగభీమ"
అని మనోహరముగా వినుతించు చున్న
హనుమంతుఁ గనుగొని యాశ్చర్యమంది
"కలయొ దైత్యులమాయొ కాక యిదేమి

పలుకునే కోతు లీ లలితవాక్యముల
అరుదెంచెనో యేమొ యారావణుండు
దురితమ్ము దలఁచి నన్ పరిభవింపంగ -
కాదు, కాదిప్పుడీ కపివీరవర్యుఁ
డేదియో మంచికే యేతెంచి నట్లు
కనుపట్టునని తన మనమందుఁ దలఁచు
జనకజ కెదురుగా హనుమంతుఁ డరిగి
సవినయభక్తితో సాష్టాంగ మెఱఁగి
"ఎవరమ్మా! నీవు హిమధాము కళవొ
భువిమీద దిగినట్టి పుణ్యదేవతవొ
దురితమ్ము నెదనెంచి దుష్టరావణుఁడు
చెఱబట్టి తెచ్చిన సీతమ్మ వనుచు
శ్రీరాము నానతి క్షితినెల్ల వెదకి
చేరితి నమ్మ నీచెంత కీరీతి
అనిల తనూజుఁడ నంజనాసుతుఁడ.
హనుమంతుఁ డనువాడ నమితబలుండ
రామునిబంటును రాక్షసున్ గాదు
నామాట నమ్ముము నాతల్లి" యనఁగ
శ్రీరామునామము చెవిఁబడగానె
ధారుణీజాతకు ధైర్యమ్ము వచ్చి
"వానరవర్య! ఈ దానవువీట

## సీతా దర్శనము

దీనత నున్నట్టి జానకిన్ నేనె
ఎట్టు లా శ్రీరాము నెఱుఁగుదు వీవు,
ఎట్టులుండును రాముఁ డెట్టివాడనుచు
నెడదలో సందేహ మెడలింప సీత
యడుగగా హనుమంతుఁ డనియె నీరీతి
"నీమది ధైర్యమ్ము నిలుపుమో తల్లి!
క్షేమమ్ముగానుండ్రి రామలక్ష్మణులు
దనుజులు నిన్నట్లు కొనిపోయి నంత
వనులన్ని వెదకుచు వారలిర్వురును
వనచరభూమికి వచ్చినయపుడు
ఘనుఁడు శ్రీరాముని కనుగొంటి నమ్మ
కనులపండువుగ నాజనువు ధన్యముగ
కలిసెను సుగ్రీవ కపిరాజుతోడ
చెలిమి శ్రీరాముని కెలమిదీపింప,
వినువీథి నుండీవు విసరిన నగలు
కనుగొని రాముఁడు కడుచింత నొందె
వనచర విభుఁ డంప వననిధిం దాటి
కనుగొంటి నిన్నిట దనుజులమధ్య
వెఱపుమానుము తల్లి త్వరగ శ్రీరాముఁ
డరుదెంచు లంక కీ యసురుల ద్రుంప
వర్ణింపఁ దరమె నాస్వామిగుణమ్ము

లర్ణవ గంభీరుఁ డాతఁ డో జననీ!
రాముని వాక్యముల్ రసమ్యామృతములు
రాముఁడు జలధర శ్యామసుందరుఁడు,
అంబుజ పత్రాక్షుఁ డతిదయామూర్తి
కంబుసన్నిభమైన కంఠమ్మువాఁడు,
అరివీర భీకర శరచాపధారి
సురుచిర దరహాస సుప్రసన్నుండు
ఆజానుగత బాహుఁ డాశ్రితావనుఁడు
రాజిత రాజాధిరాజ లక్షణుఁడు
సమధిక కారుణ్య సాధుస్వభావ
రమణీయమూర్తి యా రామచంద్రుండు
నాతండ్రి రాముఁడు నాతల్లి వీవు
భూతలమ్మున మీరు పూజ్యదేవతలు,
రాముని తమ్ముఁడు రమ్యగుణుండు
సౌమిత్రి బంగారు చాయ వాఁ డనుచు
ప్రణతులర్పించె నా వాయుసుతుండు.
హనుమని పలుకులు వినినకొలంది
జానకి కెదలోని సందేహ మెడలి
యానందబాష్పాల నానన మ్మలరె.

### శ్రీ రామ ముద్రిక

హనుమంతుఁ డంతట జనకజం జూచి
కనుము నీకిదియె నీకాంతుఁ డొసంగ

ఆనవాలుగ తన యంగుళీయకము
దీనిఁగైకొను మమ్మ జానకీ యనఁగ
శ్రీరాము శుభనామ చిహ్నముద్రితము
శ్రీరామచంద్రుని చేతి యుంగరము
నరసి శ్రీరాముఁడే యరుదెంచి నట్లు
కరుణతో మాట్లాడి కాపాడి నట్లు,
తను వెల్ల పులకింప ధరణిజ యప్పుడు
మునుకొను ప్రేమ నా ముద్దుటుంగరము
తనగుండెలకు నద్ది హనుమని జూచి
కొనియాడు చుండ నా వనచరవరుఁడు
"జననిరో, వినుము నా జవశక్తు లింక
కనుచూపు కందని గగనమ్ము వఱకు
కాయమేర్పడఁ బెంచు కామరూపుఁడను
నీయాజ్ఞ యైనచో నిఖిల రాక్షసుల
దునుమాడి నిన్ను నేఁ గొనిపోవఁ గలను
క్షణములో శ్రీరామచంద్రుని కడకు
కనుమమ్మ యనుచు నా హనుమంతుఁ డపుడు
వినువీథికంటగా తనమేను బెంచి
తన మహదాకార దర్పమ్ము జూప
జనకజ కద్భుతాశ్చర్యమ్ము లొదవె
తన నిజరూపమ్ము దాల్చి పావనియు

జనకజకాళ్ళకు వినయుండై మ్రొక్కె
హనుమంతుం గనుగొని జనకజ యపుడు
హనుమ నీయుపకృతిం గొనియాడం దరమె
డెంద ముప్పొంగె నాడీల్వద్ద బ్రతుకె
సుందరకాండమై శోభిల్లె నయ్య
దారుణ చరితుం డీ దశకంఠుం జంప
శ్రీరామమూర్తికే గౌరవమ్మగును
కాన కిష్కింధకుం గడువడి నేగి
వానరవర్య యో మాని తాకార !
కౌసల్య కనినట్టి కమనీయమూర్తి
నాసామి కెఱిఁగింపు నానమస్కృతులు
కాకాసురుండు నాడు కండలు పెరికి
చీకాకు పెట్టుట చెప్పి, వేగమ్మె
జనకజ బాధలు సమయం జేయంగ
కొనిరమ్ము హనుమ యా యినకులేశ్వరుని
రామునే సేవించి బ్రతుకెల్ల గడపు
సౌమిత్రి నడిగెను జానకి యనుము
ఇదియె నా యాన వా లిమ్ము నీవచట
పదిలమ్ముగా రామభద్రున కనుచు
తన శిరోమణిం దీసి హనుమకొసంగి
యనిపె దీవనలిచ్చి యత్యాదరమున.

జనకజకాళ్ళకు హనుమంతుఁ డెఱఁగి
జనకజన్ గనుగొన్న సంతస మ్మెసఁగి
ఆపగాలేక యీ హర్షాతిశయము
దాపున నున్నట్టి తరువుల గూల్చి
సీతకాశ్రయమైన చెట్టొండు తక్క
భీతిలే కచ్చటి వృక్షసంతతిని
వేరులతోఁబాటు పెకలించి బయటి
ద్వారబంధము క్రిందపడునట్లు తన్ని
హనుమంతు నెదిరించి రసురకింకరులు
అలుకతో నుగ్రుఁడై హనుమంత డపుడు
వలకేల నొక్కని వలకాల నొకని
వాలమ్మునం జుట్టి వారినందఱిని
లీలగా నేలపైఁ గూలుచుచుండ
భయపడి రాక్షసభటుఁ డొక్కరుండు
రయమున పరువెత్తి రావణుకడకు
రాక్షసకులరాజ! ప్రళయోగ్రతేజ!
అక్షీణబలవంతుఁ డతులసాహసుఁడు
సీతవద్దకు వచ్చి కోతియొక్కండు
ప్రీతిగా మాటలు వినిపించి కొన్ని
వెనుక కేగు చశోకవనవాటి నెల్ల
తునిమి తూటాడెను కనుగొను మనఁగ
ఘనగవాక్షమునుండి దశకంఠుఁ డంత

కనులుద్రిప్పి అశోకవనమున్న దిశకు
"అక్కట! యిదేమి నాకాశ్చర్యమయ్యె
ఒకకోతి యెటువచ్చె నుదధిని దాటి
వచ్చుటేకాకుండ వనమెల్లఁ ద్రుంచె
మచ్చుకు లేశంత మంచి మొక్కొకటి"
అనుచు నాగ్రహముతో ననిపె రావణుఁడు
హనుమంతుపైఁ దన యసురవీరులను.
వచ్చినవారిని వచ్చిన యట్లె
హెచ్చిన బలముతో నేపు మీఱుచును
కనుగొనువారికి కడుభయమ్మొదవ
హనుమంతుఁ డొకడె యా యసురలనెదిరి
భీకరాకారుఁడై వినువీథి కెగసి
రాకాసిమూకను రాపాడి తన్ని
జంబుమాలిని గూల్చి సైన్యముతోడ
దంభోళివలె మంత్రి తనయుల నణచి
హతమార్చి సైన్యాధిపతు లైదుగురిని
ధృతి మీఱి రావణుసుతు నక్షుఁజంపి
ఎదురు లేనంత తా నేతెంచి చిక్కె
పదపడి ఇంద్రజిత్పాశమ్మునందు.

దనుజులు హనుమను త్రాళ్ళతోఁ గట్టి
వనచరుం బట్టితి మనుచు దర్పమున

# లంకాదహనము

మనముల నలరుచు మహిత వేగమున
కొనిపోయి నిలిపిరి దనుజేశు సభను.
సురుచిర మణిమయ సోపానసరణి
విరచిత బహురమ్య వేదికాకృతులు,
సారముక్తాహార తోరణపంక్తి
తోరమై వెలిగెడి ద్వారబంధములు.
పసిడిపూతల మేలివన్నె లేపారి
పసమీఱు కుడ్యముల్ బలుపు కంబములు
వినుతఛత్రమ్ములు వింజామరములు
మణిఖచితోన్నత మహితాసనములు,
రాజితోజ్జ్వల దీపరాజితో వెలిగి
యోజన వైశాల్య మొప్పు నాసభను
మణిపాత్రములయందు మధువులుపూని
దనుజాంగనశ్రేణి తనచుట్టు నిలువ
నవరత్న సింహాసనాధ్యక్షుఁ డగుచు
ప్రవిమల ఠీవితో రావణుం డలరె.

రావణాసురు సభారమ్య వైభవము
పావని కగుపించె పరమాద్భుతముగ
"ఓరోరి కోతి, నీవు దధిని దాటి
యేరీతి వచ్చితి వెవ్వఁడ" వనుచు
దనుజేంద్రుఁ డేదియో దర్పమ్ము మీఱ

ననబోవ హనుమంతు డడ్డమ్మువచ్చి
"వినుము రావణుండ నే ననిలనందనుండ
హనుమంతుఁ డనువాడ నమితబలుండ
శ్రీరాము నానతి సీతనుఁ జూడ
వారిధి లంఘించి వచ్చితి నిటకు
నీకొక్క మాటను నే చెప్పఁ దలఁచి
నీకడ కరుదెంచి నిలచితి నిటుల
మునివేషధారివై మోసాన వచ్చి
జనకజన్ చెఱబట్టి కొనివచ్చినావు
వనజాసనుని పుణ్యవంశాన బుట్టి
యొనరించినాడ వీ ఘనపాపకృతిని
రాముఁ డందఱివోలె సామాన్యుఁ డనుచు
భూమిజన్ లోగొన బోయితి వేమొ
దారుణ శస్త్రాస్త్ర ధారా మహోగ్ర
నారాయణుం డిల శ్రీరాముఁ డనగ
ఖరదూషణాదుల పరిమార్చినట్టి
అరివీర భీకర పరమవిక్రముడు
వాలమ్ముతో నిన్నుఁ బడనీడ్చినట్టి
వాలి నొక్కమ్మునఁ గూలంగ నేసె
ధరణి దుష్టులఁ జంపి ధర్మమ్ము నిలుప
అరుదెంచియుండిన అవతారమూర్తి
నీకును నాకును నిఖిలలోకముల

కేకైక రక్షకుం డీరామ విభుఁడె
శ్రితవత్సలుండైన శ్రీరాము మహిమ
మతినెంచి యికనైన దివిజాధినాథ
నామాటవిని వేగ భూమిజ నిచ్చి
రాముని పాదాల వ్రాలి సేవింక
ప్రాణాల నిలుపుకో మ్మాటలఁగాదేని
దానవా తప్పదు నీనాశ మనగ-
కనులు నిప్పులురాల దనుజేంద్రుఁ డపుడు
"దనుజసైనికులార వినలేదె మీరు
నను నిందసేయుచు నాకండ్లముందు
వనచరాధముఁ డిట్లు పలుకుచున్నాడు
మానితభువనైక మహితవీరుడను
నేనెంత యీనీచవానరుఁ డెంత
కండకండలుగాగ కత్తులు దూసి
ఖండించిచంపు డీకపిని నాయెదుట
ననగ విభీషణుఁ డడ్డమ్ము వచ్చి
వినుమన్న! దూతను దునుమాడఁ దగదు
వలయుచో వేఱొకభంగి శిక్షించి
తొలగింపు మీకపిన్ వెలుపలి కనియె.
రావణు నానతి రాక్షసు లపుడు
పావనితోకకు వస్త్రముల్ జుట్టి

నిండు తైలము వోసి నిప్పు ముట్టించి
మండించి గెంటిరి మారుతిన్ వెలికి
వచ్చెను బుద్ధి యీవానరాధముడు
చచ్చెను వీడింక చచ్చె నటంచు.

హనుమనితోకకు నగ్ని ముట్టించి
దనుజులు చేసిన దారుణకృత్య
మవనిజ యాలించి యగ్నిని వేడె
పవనసూనున కెట్టి బాధ లేకుండ.

హనుమంతునకు మంచియదను లభించె
దనుజాధిపతిలంక ధ్వంసమ్ము జేయ
జ్వాలదగ్నిశిఖలతో చండతేజమున
వెలిగి లంకాపురవీథులఁ దిరిగి
మేడలు మిద్దెలు మేలిసౌధములు
వాడలు విపణులు వాకిళులందు
ఇది యదియనిచూడ కెల్లచోటులను
వదలక తోకతో వహ్ని రగిల్చె
తోకను తగ్గించి తోకను పెంచి
వీకమై యూపున వినువీథి కెగసి
వసుధకు డిగి యడ్డువచ్చుచునున్న
యసురవీరుల నెల్ల నణగార్చి త్రొక్కి

విలయాగ్ని మూర్తియై విజయవిహార
మలరంగ హనుమంతు డాలంక నెల్ల
భీకరశిఖలతో బీభత్సమగుచు
ఆకాశవీథుల కంటుచునున్న
అగ్నిసీమగ జేసె నార్పగా రాని
యగ్నికీలలలోన నసురేంద్రునగర
మాహుతియైపోయె నఖిలమ్ముగూడ
హాహాకృతులతోడ నార్పులతోడ.

శుభవార్త

హనుమంతుఁ డంతట యబ్ధిలో ముంచి
తనతోక చల్లార్చి, జనకజం జూచి
ఆమె సేమమ్ముగా నలరుట నరసి
ఆమెకు ప్రణతుల నర్పించి వేగ
మావలి దరికేగ నబ్ధి లంఘించి
పావని సంతోష వదనమ్ము గాంచి
యంగదాదులు మహాహర్షమ్ము లలర
పొంగుచు, హనుమడు భూమిజన్ గనుట
దనుజుల లంకను దహియించు టెల్ల
విని యొకరొక్కరి వీపుల వ్రాలి
గంతులు వేయుచు కౌగిళుల్ గొనుచు

అంతుపట్టగరాని సంతస మ్మెసఁగ
సీతాప్రమదచాత! శ్రీరామదూత !
వాతాత్మజా, బల ప్రాభవోపేత !
స్వామికార్యధురీణ సదమలాచరణ
కామరూపాగ్రణీ కపికులాభరణ !
జయ వీరహనుమంత ! జయ యశోవంత !
జయ రాక్షసాంతకా ! జయజయ యనుచు
వినుతించి హనుమను వీపులమీఁద
కినుమడించిన ప్రీతి నెక్కించుకొనుచు
ఆమోదముగ నేగి రావలీముఖులు
రామున కీవార్త రయమున దెలుప.

త్వరగతి కిష్కింధవద్దకుఁ జేరి
పరిసరమ్ముల నున్న వానరవిభుని
మధువనమ్మును జొచ్చి మంచిపండులను
మధువులనెల్లను మనసార మెసవి
కావలిగానున్న కపుల నదల్చి
యావనమ్మును సర్వ మట్టిట్టు చేయ
నాగ్రహమ్మున నేగి యటనున్నవారు
సుగ్రీవునకు వారిచొప్పెల్ల నుడువ
వానరపతి తనవనమున కేగి
యాననమ్ముల వారి యానందమరసి

శ్రీరాముకార్యమ్ము సిద్ధించె ననుచు
గౌరవమ్మునఁ జూచి వారినందఱిని
వారినిఁ దోడ్కొని వచ్చెను వేగ
మారుతిన్ ముందుంచి శ్రీరాము కడకు.

సన్నుత సత్కీర్తి డా సామీరి యరిగి
తిన్నగా శ్రీరామదేవునిఁ కెఱఁగి
"చూచితి సీతను చూచితి రామ!
చూచితి జనకజన్ చూచివచ్చితిని
నే తెల్పగనె స్వామి నీక్షేమవార్త
ఆతల్లి కత్యంతహర్షాశ్రు లొలికె
దనుజాంగనలమధ్య దానవుపీట
మనమున నిన్నెంచి మాటిమాటికిని
ఇనకులేశుఁడు నన్నుఁ గొనిపోవు టెపుడొ
యని రోజులెంచుచు యవనిజ యుండె
కొనుమిదె గుర్తుగా జనకజ యిచ్చె
తనదు చూడామణి ననుచు నాహనుమ
సీత శిరోమణిన్ శ్రీరామమూర్తి
కాతతభక్తితో హస్తమం దుంచె.

సీతక్షేమమెఱింగి శ్రీరాము డలరి,
సీతదుస్థితి నెంచి చింతించి మిగుల

సీతచూడామణిన్ చేతిలోఁ జూచి
సీతయే తనవద్ద కేతెంచి నటుల
చేతమ్మునందెంచి సీతను దలచి
ప్రీతితోడుత తనహృదయాన కద్దె.

దరినున్న హనుమంతు నరసి రాఘవుఁడు
దరహాసవదనుఁడై పరమాదరమున
"రావోయి హనుమంత రమ్ము మహాత్మ
రావయ్య మిత్రమా రమ్యచారిత్ర
జానకికిని నాకు సమ్మదమ్మెసగ
ప్రాణముల్ నిలిపిన ప్రాణమిత్రుఁడవు
సాహసమ్మెసగంగ సౌహృదమ్మెసగ
బాహుపరాక్రమ ప్రౌఢిమ మ్మెసఁగ
క్షితిమీద మాకు నీ చేసిన మేలు
స్తుతియింపఁ దరమె యోశూరవరేణ్య!"
యని ఆంజనేయుని హర్షమ్మెసంగ
వినుతించి కౌగిలిగొనుచు రాఘవుఁడు.
"మారుతీ చెప్పుము మఱియొక సారి
ధారుణీతనయ యాదైత్యుని వీట
యెటులుండె పాపము! యేమిచెప్పినది
యెటులేగితివి లంక నెటులఁ జొచ్చితివి
తెలుపుము హనుమంత తెలుపు"మటంచు

నలరుచు రాఘవుఁ డాలించు చుండ
శ్రీరామపదములచేరి మారుతియు
వారిధిలంఘించి వరుసగా తాను
ధరణిజంగని లంక దహనమ్మొనర్చి
తిరిగివచ్చిన యట్టి తీరెల్ల నుడివి
"శ్రీరామ! రఘురామ! సీతాభిరామ!
ధారుణీతనయ ఁవిన్ దలచుచు మదిని
తనకు కాకాసురుం డొనరించి నట్టి
యనుచిత మ్మెఱిఁగింపు మనె నీకు మరల
ధారుణీతనయకు ధైర్యమ్ము గలుగ
శ్రీరామ! నేనిట్లు చెప్పితి నయ్య
సీతమ్మతల్లి నీచింతలు తీరె
భూతలపూజ్యుఁ డా పుణ్యపూరుషుఁడు
శ్రీరామచంద్రుఁడు వైరిమర్దనుఁడు
చేరు నీలంకకు శ్రీఘ్రమ్మె యింక
రణరంగమందున రావణుం జంపి
నినుగూడి యానంద మినుమిడింపంగ
కోసలరాజ్య సింహాసనాధ్యక్ష
భాసురపదమును పడయుంగ జాలు
తరుణమ్ము నాతల్లి యరుదెంచె ననుచు
మఱిమఱి చెప్పితి మాతల్లి సీత

చూచుచు నుండె తత్ శుభవేళకొఱకు
వేచియున్నది నిన్ను వీక్షించుకొఱకు
రామరామా యను నామము తక్క
ఆమెకు చిత్తమం దన్యమ్ము లేదు
శ్రీరామ నీనామచింతనా బలమె
ధారుణి నాశక్తి ధైర్యమ్ము లగుచు
కొనసాగె గాని నాఘనశక్తి లేదు
నను నిట్లు దీనికై వినుతింప దగునె
సీతామనోనాథ! శ్రీరామచంద్ర!
నాతల్లి యీయమ్మ నాతండ్రి వీవు.
నేధన్యతం గంటి నినుఁజేరి స్వామి
ఈ ధాత్రి పైన నాకీవె దిక్కింక
నీపాదసేవయే నిత్యమ్ము నాకు
ప్రాపుగ నిమ్మిక పరమాత్మ యనుచు
పాదాలవ్రాలిన పావని నెత్తి
యాదరమ్మున రాముఁ డాశీస్సులిచ్చె.

శ్రీమద్రామాయణమునందు సుందరకాండము
సమాప్తము



శ్రీరస్తు

# శ్రీమద్రామాయణము

## యుద్ధకాండము

సమరసన్నాహము

వననిధిన్ లంఘించె జనకజం జూచె
దనుజుల కొక్కింత తనశక్తి చూపె
వినుతశక్తియుతుండు విక్రమాన్వితుఁడు
హనుమంతుఁ డొకఁడె యీవనచరులందు
కాని, యీకపులను కడలి దాటించి
దానవు నోడింపఁ దగు దారికొఱకు
చింత నొందుచు నున్న శ్రీరామమూర్తి
చెంతకు సుగ్రీవుఁ డంతలో వచ్చి
మనమునం దీశంక మానుము రామ!
పనిరెట్టిదైనను భయమందఁ బోక
ధారుణి నైనను తల్లకిందుఁ జేయు
వీరులు గలరు నావిపులసైన్యమున
అల జాంబవంతుఁడు నానుషేణుండు
నలుఁడు నీలుఁడు మహాబలుఁ డంగదుండు
మైందుఁడు ద్వివిదుడు మఱి పెక్కు రుండ
రెందాన నీకేల సందియ మ్మింగ

చెచ్చెర లంకయే శ్రీరామచంద్ర!
వచ్చి నిల్చును నీదు పాదాలముందు
కడలిని కట్టి యాకట్టపైనుండి
వెడలుచే లంకకు వీలైనదారి
నిపుణత నీపనిన్ నెఱవేర్పగలుగు
కపివీరు లున్నారుగాన శ్రీరామ
వినుమయ్య నీచేత రణరంగమందు
దనుజేంద్రు మరణమ్ము తప్ప దనంగ
ఆరీతినే పల్కె మారుతికూడ
శ్రీరామచంద్రుని ప్రేరేచి నంత
ఆనందభరితుఁడై యరసె రాఘవుఁడు
వానరనాథుని వాయునందనుని-
కపిరాజు శీఘ్రమ్మె కబురంపె తనదు
కపిసేనసెల్లను కదలి రమ్మనుచు.
ఏమూలనున్న వా రామూలనుండి
చీమల బారులై చేరిరి కపులు;
వారిధియుప్పొంగి వచ్చిన యట్లు
ధారుణి నిసుమంత తావులేకుండ.

హనుమయొనర్చిన పనికికోపమున
దనుజేంద్రుఁ డేదైన తలపెట్టఁ గలఁడు
తడయక లంకపై దండెత్తి వేగ
వెడలంగ శ్రీరామవిభుఁ డాత్మనెంచె.

వర్తించె నాకాశపథమునం దుగ్రి
మార్తాండబింబ మామధ్యాహ్నమందె
శుభముహూర్త మటంచు సూర్యవంశజుఁడు
త్రిభువనవీరుఁడా శ్రీరామమూర్తి
కదలె నసంఖ్యాక కపిసేనతోడ
కదలి చేరెను వేగ కడలితీరమును
అభిరామముగ వారి కన్నిచోటులను
శుభశకునమ్ములే శోభిల్లె నపుడు.

మంత్రులతో రావణుని ఆలోచనము

హనుమ చేసిన పని నరసిన వెనుక
కనుల నిద్దుర లేదు దనుజనాథునకు
శ్రీరాముదగ్గఱ మారుతిం బోలు
ధీరు లింకెందఱు వీరు లున్నారో
పరితిన్నైనను వారిధిం దాటి
శ్రీరాముఁ డిచటకు చేరుట నిజము.
మనసునం దీభీతి మాటిమాటికిని
పెనుభూత మట్లుగా పీడించుచుండ
తన మంత్రివరులను తనసైన్యపతుల
వెనువెంట నచటకుఁ పిలచి రావణుఁడు
"దనుజనాయకులార! దరోగ్రులార!

చనుదెంచె నొకకీడు మనలంక కిపుడు
అరసిరేగద మనయందఱిముందు
నరుదెంచి యొకకోతి జరిపినపనిని
ఘోరరాసి లంకనుఁ జొచ్చి సర్వమ్ము
కొఱకంచుతోఁగాల్చి పరువెత్తినాఁడు
అక్షీణబలుడు నాయాత్మజుఁడైన
అక్షయపుత్రుని హతమార్చినాఁడు
మనసైన్యపతులను మనమంత్రిసుతుల
మనకండ్లముందె మట్టాడిచంపె
ఏతీరునో యింక నీయబ్ధిదాటి
సీతకై శ్రీరాము డేతెంచు నిటకు
శ్రీరాముబారిని ఛేదించి లంక
నేరీతి రక్షింత మోజఁగింపుఁ డనగ
ఒక రొకరుగ దానవోత్తంసు లెల్ల
ప్రకటదర్పమ్మున వచ్చి ముందునకు
"అక్షీణబలధుర్య అనుపమశౌర్య
రాక్షసకులనాథ రావణేశ్వరుడ!
త్రిభువనమ్ములగెల్చి దేవేంద్రు గెల్చి
విభవమ్ముతోనున్న వీరుఁడ వీవు
ధరణియం దత్యుగ్రతపము నొనర్చి
సరసిజాసనునుండి వరముల గొనిన
పటుశక్తిశాలి వీపరిసరభూమి

కేటుల రాముఁడువచ్చి యెదిరింపఁగలఁడు
ఈలీలసందియ మ్మేలను నీదు
కాలిగోటికికూడ కాదు రాముండు
కట్టుదిట్టముచేసి కడలితీరమును
దిట్టపర్చెద మగ్రదితిజుల నుంచి.
ఒకవేళ రాముఁ డీయుదధిని దాటి
అకలంకమగు లంక కరుదెంచె నేని
ఒక్కమ్మడిగ ముందుకురికి యారాము
నుక్కడగించక యూరకుండెదమొ"
యను వారిమాటల కడ్డమ్ముగవచ్చి
వినయుఁడై లేచి విభీషణుం డపుడు.

### వి భీ ష ణ ప రా భ వ ము

"సోదరా, రావణా! శూరవరేణ్యా!
మేదిని నీవంటిమేటి లేడనిన
పలుకు సత్యమె కాని యిల నీదు మేలు
తలపకుండగ వీరు పలుకుచున్నారు.

వినుమొక్కక్షణము నావిన్నప మొకటి
మానివేషముఁబూని మాయలు పన్ని
జానకిన్ మోసమ్ము సలిపి తెచ్చితివి

రాము డింతకును నీ కేమి చేసెనర్చె
కామాంధయై యట్టి కాంత శూర్పణఖ
దురితమ్మొనరించెను దుష్టురాలై యేగు
ఖరదూషణాదుల కావర మడచె
అంతమాత్రమున నీ కాతనిమీద
నింత టిశత్రుత్వ మేల దైత్యేంద్ర!
హనుమంతుబోలిన అతిబలు లుండి
రనఘుండౌ రాముని వెనుక మిక్కిలిగ
జగదేకవీరుండౌ జననాథుండనుచు
మిగులవిందుము గాన తగువును మాని
యాతనిజానకి నాతని కిచ్చి
దైతేయనాథ! నిన్ దయంజూడ మనుషు
కాదేని విధ్వంసకాండ యీలంక
మీదనే బడు నిక మేలెంచు" మనియె.
తనకిష్టములుగాని తమ్మునినుడులు
విని రావణుండంత కనులెఱ్ఱఁ జేయు
టరసి మహాపార్శ్వుఁ డనెడు రాక్షసుఁడు
నిరుపమబలశౌర్య నిస్తులధైర్య
పిఱికివాఁడగుచు విభీషణుం డిట్లు
పిఱికిమందులు నీకు పెట్టుచున్నాఁడు
వెఱపేల మేము నీవెనుకనుండంగ

నిరత మీలంకను పరిరక్షఁ జేయు
శివుఁడైన నీదరిఁ జేరరాఁడనిన
అవని రాముఁడెంత యసురేంద్ర! నీకు
సీత నీచేజిక్కె సీతను గూడి
ప్రీతితో నీవిఁక క్రీడింపు మయ్య
మనకుంభకర్ణుఁడున్ మనయింద్రజిత్తు
మనకుండగా భీతి మనకేల ననియె
తన జవశక్తులు తన సాహసమ్ము
తన తపోబలమును తలఁచి నెమ్మదిని
రావణుఁ డుబ్బి యారాక్షసుంజూచి
నీవచనమ్ములు నిక్కమో వీర
రాముని లంకకు రాకుండఁ జేసి
సామంతమునఁ గెల్చు సాహసి నగుదు
కాని, యిష్టములేని మానినిం గూడి
నేను జీవింపగ లేను ధారుణిని
బలిమి నే స్త్రీనైన పట్టుదు నేని
ఇలమీఁద పడును నాతల వ్రక్కలగుచు
అలరంభ పుంజకస్థలయును నాకు
కలుగజేసిరి యిట్టి కఠినశాపములు.

రణమున ముందుగా రామునిఁగూల్చి
విననిచో నామాట జనకజ నపుడు

కరుణయున్నది లేక కడతేర్తు నాదు
కరవాలమున కామె నెఱజేసి వేగ
కలిగెను నాకిట్టి తలపని యనఁగ
అలరిరి దానికా యసురు లందఱును.
మరల విభీషణుం డరసి రావణుని
"కరుణించి వినుము నాకడసారిమాట
దురమున రాముని ద్రుంచెద నింక
ధరణిజన్ కత్తుల కెఱసేతు ననుచు
పరుషమ్ము లేవియో పలుకుచున్నావు,
ఎఱుఁగవు రాము డీ ధరణీతలాన
నినువంటి పాపులన్ నిర్జించు కొఱకె
జనియించి నట్టి శ్రీవనజాక్షుఁ డతడు.
దైతేయ సాగ నీ దర్పమ్ము లింక
నీతలంపిటు గాదె నీనాశమునకె
దనుజుల నెల్లను ధ్వంసమ్మొనర్చి
రణమున రాముఁడే దునుమును నిన్ను
భూమి నే దేవతాస్వామియు కూడ
రామునకెదురు నిన్ రక్షింపఁ" డనఁగ
ఆవిభీషణు మాట కాగ్రహమ్మంది
రావణుఁ డుగ్రుఁడై రౌద్రమ్ముతోడ
నీవు చూడఁగ లేక నీయన్న పెంపు

నోవిభీషణా పల్కుచుంటివి ఏరీతి
ఓరికులద్రోహి! ఓరోరి నీచ!
ఈరీతి మాటల నెపుడు నేర్చితివి
పామ్మూవలకు నాదుపురమును విడచి
తమ్ముడ వికగాదు ధరణి నీవింక
నని యావిభీషణు నందఱిముందు
దనుజేంద్రుఁ డలుకతో తన్ని పోఁద్రోసె.

## విభీషణుని శరణాగతి

దనుజులసభయందు తనవారి ముందు
తనయన్న రావణుం డొనరించినట్టి
పరిభవబాధను భరియింప లేక
మఱియొకచోటున కేగనే లనుచు
అరిగె విభీషణుం డారఘురాము
చరణమ్మె తనకిక శరణ మటంచు.
శ్రీరాము వెనుకనే జేజేలు పలికి
మారుతిమున్నగు వారినిఁ గూడి
తండోపతండముల్ తరలి యేతెంచి
యుండిరి కపులెల్ల రుదధితీరమున
వారిధిపై నుండి వచ్చుచునున్న
ఆ రావణానుజు నరసి వానరులు

మనమీద కిదె చూడు హనుమానమొదలి
చనుదెంచుచున్నాడు దనుజుఁ డొకండు
గగనమ్మునందుండి దిగినంత నతని
పొగ రణగించుడు పొడువుడటంచు
వనచరు లార్చుట విని రాఘవుండు
'దనుజుఁడే కానిండు మన కేలభీతి'
యనునంతలోపల నతఁ డేగుదెంచి
వినయుఁడై తలవాల్చి విన్నదనాన
"శరణు సద్గుణధామ! శరణు శ్రీరామ!
శరణు సజ్జనపాల! కరుణాలవాల!"
యనుచు శ్రీరాముని యంఘ్రుల వ్రాలి
"వినుము రామప్రభూ! దనుజేంద్రుఁడైన
రావణు తమ్ముడ నేవిభీషణుఁడ
'రావణా, నీ కేల రామునితోడ
వైరమూతడు శ్రీరనారాయణుండు
ధారుణీజాతను తపసివేషమున
మోసానఁ గొనివచ్చి చేసితి వెగ్గు
చేసిన పాపమున్ చెప్పి రామునికి
ఆతని జానకి నాతని కొసగి
దైతేయ వేషమా ధర్మాత్ము కరుణ'
నని చెప్పినందుల కలిగి రావణుఁడు
తనకాలితోఁ దన్ని నను గెంటె బయట

కతని కర్మమ్మనిం కతనికి వదలి
అతనికి భయపడి యరుదెంచి తిటకు
దిక్కు నీవేనంచు దివ్యావతార
గ్రొక్కితి దేవ నన్బ్రోవు" మనంగ
దరహాస సుందర సురుచిరాననుఁడు
కరుణాసముద్రుఁ డాకాకుత్స్థకులుఁడు
తలచక శత్రుని తమ్ముఁడటంచు
వలదు విభీషణ భయము నీకింక
నని చెప్పి శ్రీరాముఁ డభయమ్మొసంగె
వనచరు లాశ్చర్యభరితులై కనిరి
సదయుఁ డారాముని సాధురక్షణము
నిదియును శుభమంచు నెదలరుదెంచి.
హనుమయు సుగ్రీవుఁ డాదిగాకపులు
వినుచుండ రాముని గని విభీషణుఁడు,
ఎఱుఁగుదు శ్రీరామ! ధరణీతలాన
జరుగును రావణాసురునికి నీకు
ఘోరసంగ్రామ మాఘోరయుద్ధమున
క్రూరరావణుఁ డిక కూలుట నిజము.
వినిపింతు నైన నాదనుజేంద్రు బలము
మనసున నుంచుట మంచిదికాన.
వనజాసనుని గొల్చి వరములు గొనిన
ఘనతపశ్శాలి యాదనుజేంద్రుఁ డరయ

సుర యక్ష రాక్షసవరులచే తనకు
మరణమ్ము లేకుండ వరముల నందె.
మారణాస్త్రవిదుండు ఘోరకర్ముండు
ధారుణి నసమానధీరుఁ డతండు.
అతిబలుం డాతని సుతుఁ డింద్రజిత్తు
ప్రతిలేని వీరుడై వాసవుఁ గెల్చె.
దంభోళిసాహస్ర సంభవ్యబలుండు
కుంభకర్ణుం డొకకొండంతవాడు.
సమధికయోధులౌ సైనికుల్ గలరు
ప్రముఖు లాలంకలో పదికోటు లనఁగ
"అనుపమ బలు లెంద అడ్డువచ్చినను
వినుము విభీషణా! దనుజేంద్రు జంపి
వినుతలంకాపుర విమలరాజ్యమ్ము
ననువుగా నిడుదు నీ" కనుచు నాక్షణమె
అభయమ్మొసఁగి రాము డావిభీషణుని
విభవమ్ముతో లంక కభిషిక్తుఁ జేసె.
కపులు రాముని ధీరకార్యమ్ము నరసి
విపులహర్షాత్ములై విలసిల్లి రపుడు.

## సే తు బం ధ న ము

దనుజేంద్రుఁడు తనంత తనకాళ్ళకడకు
చనుదెంచు ననుమాట యణువైన లేదు

కడలిని దాటి యీకపులతో నేగి
కడుదుష్టుఁ డతనిని కడతేర్చు టొకటె
తనకున్నపనియని తలఁచి రాఘవుఁడు
తనముందు నున్నట్టి వననిధిం జూచి
కోరెను వినయుఁడై దారియిమ్మనుచు
కోరి యాసాగరున్ చేరి ప్రార్థించె.
సుడులతో కెరటాలమడుగుతో నెగయు
కడలిరా జిసుమంత కదలనే లేదు.
రాముఁ డంతట మహోగ్రహము దీపింప
"సౌమిత్రి! చూడు మీసాగరు డింత
గరువమ్ముమీఱివ కెరటాలతోడ
కెరలి పొంగును నన్ను కేడించు పగిది
వేమారు చెప్పినన్ నామాటవినని
ఈ మహాజలనిధి నింకింతు నొక్క-
కనుఱెప్పపాటులో కనుగొను" మనుచు
ప్రణుతోగ్రరూపమా బ్రహ్మాస్త్ర మెత్తె.
ఆగుమో శ్రీరామ యనుచు సాగరుఁడు
వేగమె యరుదెంచి వినతు లర్పించి
సాకేతవాస! ఈసాగరుం, డెపుడు
నీకడ దాసుడే నీకేల కినుక
జలము దారులకపుల్ చరియించునపుడు
జలచర సర్పాది జంతువులేవు

యొనరించునోయని మనమున శంక
జనియించి యాగితి సైరింపుమయ్యా
కపిసేనయందున కలడు నలుండు
నిపుణుఁ డీజలముపై నిర్మింపగలడు
సేతువున్ పాషాణవ్రాతమ్ముతోడ
ఆతనిచేత నీయబ్ధిఁ గట్టించి
కడలి దాటింపు మీకపిసేన ననుచు
నుడివి యదృశ్యుఁడై వెడలె సాగరుఁడు.

భూమి వ్యర్థముగాదు రాముని శరము
రాముఁడు ద్రుమకుల్యసీమలో మిగుల
హింసాప్రవృత్తితో నెసఁగు దస్యులను
ధ్వంసమ్ముచేసె నాదారుణాస్త్రమున.

జలనిధిన్ బంధింప నలు డేగుదెంచె
నలుమూలలందుండి బలువైనరాళ్ళు
కదలించి తెచ్చిరి కపులెల్ల రేగి
సదమలాత్ముఁడు మహాసాగరు మహిమొ
నలుని నైపుణ్యమో తెలుప శక్యమ్మె
జలములందుంచిన శిలలెల్ల తేలి

లంకా ప్రవేశము

వారధియయ్యె నావార్ధిపై నపుడు
శ్రీరామునకు కడుప్రీతి గొల్పుచును.

వానర జయ జయ ధ్వానమ్ము లెసంగ
దానవహృదయముల్ తల్లడిల్లంగ
సీతామనోవర్తి శ్రీరామమూర్తి
సేతువుమీదుగా చేరెను లంక.

దుర్భేద్యమగు తన దుర్గమ్ముకడకె
నిర్భీతిగా వచ్చి నిలిచిన కపుల
వీక్షించి తనసౌధవీథుల నుండి
రాక్షసరాజైన రావణుం డంపె
వేగులవాండ్ర నావిపరీత మేదో
వేగమ్ముకనుగొని వెడలి రండనుచు.
వెడలి వేగమ్ము యావేగులవాండ్రు
కడు దీనులై వచ్చి నుడివి రీరీతి.
అనుపమబలశౌర్య అసురేంద్రవర్య!
కనుగొనియుంటి మాకడకేగి మేము
కడలి నేరీతిగా కట్టిరో వారు
పడియున్న దొక పెద్ద వారధియచట
వాలాన్వితులు పెక్కువానరాధిపులు
నేల యీనిన యట్లు నిండిరెల్లడల
వారలమధ్యగా భాస్వన్మహోగ్ర
వీరులిద్దఱు రాజపూరుషుల్ గలరు
రామలక్ష్మణు లట రాజితోదగ్రు

లా మహాకార్ముకు లనలతేజులును
అచ్చటే యుండె నీ యఖిలలంకకును
చిచ్చుపెట్టిన కోతి శ్రీరాము నొద్ద
అందఱున్ యోధులే అందఱున్ సములె
అందఱున్ అరిభీకరాస్యులే వారు.
ఏమికోలాహల మ్మేమి యార్భటులు!
ఏమిసెప్పుదు మిక స్వామీ యనంగ —
వినినంత నావేగు లనినపల్కులను
దనుజాధిపతిగుండె దద్దరిల్లినది
ఉడువీథియందుండి యొకసారి నూరు
పిడుగులు తలమీద పడినట్టు లయ్యె.

మా య శి ర స్సు

ఇకమీద శ్రీరాముఁ డేక్షణమందొ
ప్రకటోగ్రరూపుఁడై వచ్చు నిచ్చటకు
మతిపోయినట్లయ్యె దితిజనాథునకు
ధృతిమాలి గతిమాలి దీనుఁడై తుదకు
అనువైన మోసమ్ము నొనరించి మరల
తనవైపు త్రిప్పుకోదలఁచె జానకిని.
బోరన నవరక్త ధారలు జిమ్మ
శ్రీరాము తలవంటి కృత్రిమ శిరము
శూలానఁ దగిలించి శూరవేషమున

కేలను ధరియించి లీలగా నేగి
"జానకీ నమ్మ మీ దానవుమాట
మానసమ్మందు నీ వీనాటికైన
రణమున తెలిసె నీ రామునిశక్తి
కనుగొను మియ్యదే కత్తిని దూసి
శ్రీరాము శిరమును ఛేదించి నాను
ధారుణి దిక్కు నీ కీ రావణుండె
నమ్మసేయక నీదు వయసుటందమ్ము
రమ్మ నా దేవివై రాణివై భువికి
ఇలనెల్ల నేలుకో మిత్రులం గాదేని
బలిచూడు" వని కత్తి ఝళిపించసాగ.

మహిజాత చూచి యా మాయాశిరమ్ము
బహువిధమ్ముల దుఃఖబాధతో కుమిలి
శ్రీరామచంద్ర నా హృదయాధి నాథ
శ్రీరామచంద్ర నా ప్రేమదీపమ్ము
ఆనాడు నాతిచరామి యన్నట్టి
హా నాథ ననువీడి యరిగితే నేడు
హతవిధీ నాకెట్టి స్థితిం దెచ్చినావు
మృతిదక్క వేఱొక్క గతి లేదటంచు
అవనిజ హా రామ యని యేడ్చియేడ్చి

యవనిపై మూర్ఛిల్లె నంతలో బయట
రణసముద్భత భీకరార్భటిధ్వనులు
వినిపించి యవలకు వెడలె రావణుఁడు.
ధరణిజ తెలివొంది పరికింప బోవ
ధరణిపై బడియున్న శిరమును మరల
మఱుక్షణమందె యా మాయాశిరమ్ము
తిరిగి కన్పడక యదృశ్యమై పోయె.

సరమ

దనుజుని మాయగా దలఁచి యియ్యదియు
జనకజ యొక్కింత స్థైర్యమ్ము నూని
గ్రహియించలేక యీ రావణుమాయ
బహువిధమ్ములమది భావించినాను
ననుక్షమియింపుము నా రామచంద్ర
యనుచు నమస్కృతు లొనరించుచుండ
సరమ యనునొకర్తు చనుదెంచి యటకు
"త్వరగ నీకొకమాట నెఱిఁగింపఁ దలఁచి
యరుదెంచితిని తల్లి వెఱవకు మింక
అరయు మీపనులెల్ల నసురుని మాయ
లీమాఱు రావణు నెద నమ్మకమ్మ
నామాట లాలింపు రాముని దేవి!
అది మాయతలగాని యన్యమ్ము గాదు

విదితవిక్రమ మహావీర శేఖరుఁడు
రాముఁ డెక్కడ నీచరావణుండేడ.
నీమది ధైర్యమ్ము నిలుపుమో తల్లి
నినుదెచ్చి దర్పాన దనుజేంద్రుఁ డిటకు
తనవినాశనమును తాఁ దెచ్చుకొనియె
రావణానుజుఁడు నా ప్రాణవిభుండు
రావణాసురన కీప్రకటసత్యమ్ము
దెలుపగా నాతఁడు తీవ్రకోపమున
పలువురిలో పరాభవము గావించి
బయటకు గెంటె నాపతి విభీషణుని
భయపడి నాభర్త పక్షమున నేగి
శరణు జొచ్చెను నేఁడు కరుణామయుండు
పరమాత్ముఁడైన నీపతియొద్ద తల్లి!
పలుమాఱు లిట్టు లా పాపికి నీతి
పలుకఁజూచినది నాభర్తయే కాదు
కడకు నాతనితల్లి కైకసి గూడ
నుడివె రావణున" కీచెడుపని యేమి
పరభామలను బట్టు పాపివైనావు,
ఎఱుఁగవే మును నీకు జరిగిన శాస్తి
బలిమిని నీవేగి పట్టినవనిత
లిలమీఁదఁ శాపమ్ము లిడిరి నీకెన్నొ

రాముఁడు కారుణ్యధాముఁ డుత్తముఁడు
రాముని జానకిన్ రాముని కిచ్చి
రాముని దయవేఁడు రావణా యనిరి.
కామాంధుఁ డాతఁడు కనఁడు ధర్మమును
రణరంగమం దిక రాముని చేత
దనుజేంద్రుమరణమ్ము తప్పదు చూడు
ఆ సువేలాద్రిపై యల్లదే కనుము
భాసురమూర్తి నీభర్త రాఘవుఁడు
వనచరసేనతో వచ్చియున్నాఁడు
రణరంగభీకరార్భటులు నయ్యవియె
వినుమంచు సరమయు వెడలిన వెనుక
మనమున ధైర్యమ్ము జనియించి సీత
దేవతావరులార! దిక్పతులార!
పావనగుణులార! పరమాత్ములార!
జయమగుగాత నాస్వామి రామునికి
జయమగుగావుత జగతి ధర్మమున
కని వేఁడుకొని రాముఁ డరుదెంచుకొఱకు
కనిపెట్టుకొనియుండె కడునుత్సుకతను.

## సుగ్రీవుని సాహసము

ఆలమ్మునకు తరి యాసన్నమయ్యె
కోలాహలముతోడ కోతులసేన

గట్టులు పుట్టలు కనుపడకుండ
ముట్టడించిరి లంకచుట్టు నల్దెసల.
రణయత్న మేరీతి వనచరసేన
లొనరించుచున్నవో కనుగొను కొఱకు
గోపురాగ్రమ్మెక్కి ప్రాపి రావణుఁడు
కోపమ్ముతోఁ జూచె కోతిమూకలను.
దనుజేంద్రుఁ డారీతి కనుపడినట్టి
క్షణమందె యాగ్రహస్వాంతుఁడై లేచి
సుగ్రీవుఁ డాగోపురాగ్రాన కెగసి
యుగ్రుఁడై రావణు నురముపై కురికి
తలదన్ని పడగొట్టి ద్వంద్వయుద్ధమున
పలుబాధలనుబెట్టి పరువిడి వచ్చె
క్షణములో మఱియొక్క వనచరుఁ డిట్లు
చనుదెంచి చేసిన సాహసమ్మునకు
మనమున విభ్రాంతి జనియించి మిగుల
దనుజేంద్రు గుండెలు దడదడలాడె.
వానరు లాశ్చర్య పరవశులైరి
వానరేశ్వరు శౌర్యపాటవమ్మరసి.

అంగద రాయబారము

సమరమ్మునకు ముందు సామపద్ధతియె
క్రమవిధానమ్మని రాముఁడు తలఁచి

ఆయత ధీమంతుఁ డంగదు తోడ
రాయబారమ్మంపె రావణు కడకు.
ఆమోదమును దెల్పి రామునానతికి
రాముని మనసును గ్రహియించి వేగ
అంగదుం డేతెంచి యసురేంద్రుసభకు
రంగారుశోభతో రాజిల్లుచున్న
ఆ సభాభవనమం దసురేంద్రుఁ జూచి
భాసురమూర్తి యావానరవరుఁడు
"దనుజేంద్ర! శ్రీరాముఁ డనుపగా నీకు
వినిపింప నొకమాట విచ్చేసినాను.
వాలానజుట్టి నిన్ నాలుగబ్ధులను
లీలగా ముంచిన వాలిసుతుండ.
అతిబలాన్వితుఁడ నన్నంగదు డంద్రు
దితిజేంద్ర! వినుము నే తెలిపెడిమాట.
దరినిరాముడు లేని తరుణమ్ముజూచి
ధరణిజన్ చెఱబట్టు దురితమ్మునెంచి
మౌనిరూపముదాల్చి మాయవేషమున
జానకిం దెచ్చిన జాల్ముఁడ వీవు
భూమిజ నికనైన రాముని కిచ్చి
రాముని పాదాల వ్రాలి ప్రార్థించి
క్షమియింపవేడుము కాదేని నీకు

సమరాన తప్పదు సర్వనాశనము"
అనునంతలోనె ఆయంగదుఁ డట్లు
దనుజేంద్రు డుగ్రుడై కనులెఱ్ఱజేసి
"ఆ రాముఁడెంత యీ అంగదుఁడెంత
ఈరీతి నీతుల నెఱిఁగింప నాకు
రణమునగాని యీరావణుశక్తి
కనుగొన జాలడీ మనిసి రాఘవుడు,
దూతగా నేతెంచి తుందుడుకొప్ప
ఈతీరు మాట్లాడు నీకోతి నింక
పట్టుడు కొట్టుడు పరిమార్పుఁ" డనుచు
దిట్టలౌ దితిజుల నెట్టనఁ బంప
ధీరుడై వానరవీరుఁ డంగదుఁడు
వారినందఱబట్టి వాలానఁజుట్టి
ధారుణిపైఁ గొట్టి దర్పానఁ జంపి
"ఓరోరి రావణ! ఓరినీచుండ!
రామునిశక్తిని గ్రహియింపలేక
ఈమాడ్కి వర్తింతు వింకను నీవు
నీచెవిఁ బెట్టవు నీమంచి నీవె
నేచెప్పెడి దికేమి నీవె కన్గొనుము
రామచంద్రుఁడు రిపుప్రళయు డల్లదిగో
భీమ కార్ముకధారి వేచి యున్నాడు
రణములో నిన్నింక దునుమాడు కొఱకు
నని చెప్పి తానేగె వెనుక కంగదుఁడు.

# రామరావణ సంగ్రామము - 1

## ఇంద్రజిత్తు నాగపాశము

రావణు నాత్మలో రవ్వంత కూడ
కావరమ్ముడఁ గని కాఁ ణమ్మునను
శ్రీరామ రావణ ఘోరసంగ్రామ
మారంభమైనది యవని కంపింప.
దిట్టలౌ వానరుల్ తీవ్రకోపమున
ముట్టడించిరి నాల్గుమూలలన్ లంక
వనచరుల్ లంకపై బడినట్టి వార్త
క్షణములో వ్యాపించె కాలాగ్నివోలె
అమరధాటికి గూడ నణువైన చెడని
ప్రముఖ లంకాపురీ ప్రబలదుర్గమ్ము
వనచరధాటికి వణకసాగినది
తునియలు తునియలై తూలిపోయినది.
తూటాడె కుముదుండు తూర్పుద్వారమును
దాటెను శతబలి దక్షిణశ్రేణి
వచ్చె సుషేణుండు పశ్చిమదిశను
చొచ్చిరి లంకలో శూరులై కపులు
జ్వలదగ్నిహోత్రులు శౌర్యభూర్యహులు
ప్రళయ మాహేశ్వరుల్ రామలక్ష్మణులు

బద్ధ తూణీరోగ్ర బాహుకోదండు
లుద్ధతులై వచ్చి రుత్తరదిశకు.
దుర్నిరీక్ష్యోదగ్ర దోర్దండబలులు
వర్ణనాతీతులా వారినిర్వురిని
చూచిన యంతనే క్షోభించిపోయె
నేచిన భీతితో నెడద రావణుఁడు.

## నా గ పా శ ము

అరి తేరిన యోధు లసమాన బలులు
పోరిలో కడుగొప్ప పేరును గనిన
దనుజవీరుల నేరి దనుజేంద్రుఁ డంపె
వనచరసేనతో నని నొనర్పంగ
పరశు పట్టిస కుంత బాణ తూణీర
కరవాల కోదండ ధరులయి యరిగి
రసుర వీరాగ్రణు లనిసేయు కొఱకు
వసుధ కంపించెడి పదఘట్టనముల
బండలు కొండలు పగిలించి తెచ్చి
భండనోదగ్రులై వచ్చిరి కపులు.
అన్యోన్య జయకాంక్ష నసురకీశేశ
సైన్యవిన్యాసముల్ సాగె నుగ్రముగ
ప్రాణాలకు తెగించి రణమందు పోరి

దానవుల్ కూలిరి వానరుల్ పడిరి.
పీనుగు పెంటలు పెనుగుట్ట లయ్యె
శోణితధారలు స్రోతస్సు లయ్యె.
వానరబలముల పటుశక్తి ముందు
దానవులంతంత తగ్గిపోవంగ
దనుజుల ప్రోత్సాహ మొనరించి వేగ
చనుదెంచె నింద్రజి త్తనుపమధృతిని
మాయావి యాక్రూరమాంసాశనుండు
మాయగా మబ్బుల మధ్యగా దాగి
విస్తృత సంగ్రామ విద్య లెసంగ
అస్త్రముల్ గుప్పించి అగ్నివర్షించె.
వెనుకకు తగ్గి రా దనుజనాయకుని
రణపాటవమునకు వనచరు లడలి
నక్తంచరుని క్రూరనారాచహతుల
రక్తసిక్తాంగులై రామలక్ష్మణులు
తోచిరి రణధైర్యపూర్వులు లగుచు
పూచిన మోదుగ భూజముల్ పోలె.
తోయదమ్ములమధ్య దొంగయై దాగి
మాయారణారంభుఁ డాయింద్రజిత్తు
పరిబలమారణ నాగపాశమ్ము నేసి
ప్రబలుఁడై బంధించె రామలక్ష్మణుల.
రణమందు రామలక్ష్మణు లీల్గి రనుచు

దనుజు లూరేగిరి పెనుబొబ్బ లిడుచు
వానరు లండఱున్ వారిని జేరి
దీనులై ఖిన్నులై తిలకించుచుండ
అటనున్నవారల కద్భుత మ్మొదవ
పటుతర జవశక్తి భాసురుం డగుచు
ప్రళయప్రభంజన ప్రాభవోద్వేగ
కలిత విజృంభియై గరుడు డేతెంచి
ఆ మహానాగము లన్నిటిన్ దూల్చి
రామలక్ష్మణులను ప్రణుతించి యరిగె
ఇనసమ తేజస్కులా యిరువురు మరల
రణమున నిలిచిరి ప్రబలోగ్రు లగుచు.
వినుత వాయవ్యాస్త్ర వితతుల నంపి
ఘనఘనాఘనముల కడలకుఁ ద్రోలి
విలసితాగ్నేయాస్త్ర విస్ఫురచ్చటల
తొలగింపఁ జేయుచు ధూమాంధ్యములను
దనుజమాయల కెట్టి తావు లేకుండ
రణసీమ నెల్లెడ రామలక్ష్మణులె
దారుణ దివ్యాస్త్ర తతులను గురిసి
పాఱఁద్రోలిరి దైత్యబలము నంతటిని.
దానవు లారీతి దీనులై యరుగ
వానరు లఱచిరి పరమహర్షమున -

# రామరావణ సంగ్రామము - 2

## వానరవీరుల విజయము

భయకరమ్మగు సర్పబంధమ్ము లూడి
రయమున నుగ్రులై రామలక్ష్మణులు
చనుదెంచుటయు వారి వెనుకనే మరల
రణరంగమందున వనచరసేన
చెలరేగి చేయుచు సింహనాదములు
నిలచి యుండుట జూచి, యలుకతో నెగసి
తన సైన్యపతులను తన వీరవరుల
తన వద్దకును పిల్చి దశకంఠుఁ డపుడు
నేత్రమ్ములందున నిప్పులు కురిసి
ఆత్రమ్ము మీఱగ నందఱిన్ జూచి
"దనుజనాయకులార! ధైర్యాత్ములార!
అనుపమ బలులార అతిధీరులార!
తిలకింపుఁ డల్లదే నలుప్రక్కలందు
బలితలంకాపుర ద్వారముల్ కూలె
వనచరసేనతో వచ్చిన యట్టి
మనుజు లా రామలక్ష్మణులకు నడలి
పాఱివచ్చిరి మనవారెల్ల రదిగో
తేఱి చూచుట కిక తీరిక లేదు
దివిజుల గెల్చిన ధీరులు మీరు

భువినెంత యీకోతిమూకలు మీకు
ధరణికి మీబల ధైర్యముల్ చూప
తరుణమ్మువచ్చె నో దానవులార!
సమకూర్చుకొనుడు మీ సైన్యమ్ములెల్ల
సమకూర్చుకొనుడు మీశస్త్రాస్త్రములను
గెల్చిన రణమందు విజయమో మృతియొ
తేల్చుకొండని చెప్పి దీవించి పంపె.

కడుభయంకరులయి కాలాగ్నులటుల
వెడలిరి దానవవీరు లాయునికి.
పటుసాహసాన్వితుల్ వనచరవీరు
లటునుండి వచ్చిరి యసురులపైకి.
పలుతెఱంగుల రణప్రభువులై కపులు
చెలరేగి పోరిరి చెట్లడ్డు పెట్టి
ధరణిఁ గూలిరి వీరు లిరువాగులందు
ఒరసి పారెను రక్తముర్వి నేరులుగ.
వానరవీరులు వరుస నొక్కొక్కరె
దానవయోధులఁ దాకి రుగ్రముగ.
ధరణి కంపించెడు కరణి ఘోరముగ
జరిగిన వానుష్టిసమరముల్ తుదకు -
దునిమె నకంపన ధూమ్రాక్షవరుల
ననుపమ సాహసుం డాంజనేయుండు,

కూలెం బ్రహస్తుండు నీలునిచేత,
ఆలమ్ము సేయుచు నేలకొఱంగె
నలవజ్రదంష్ట్రుండాయంగదుచేత,
తిలకించి వారట్లు లిలగూలు జెల్ల
వారిమంత్రులు వచ్చి పటువర్ప మమర
ఘోరసాగిరి మహాఘోరయుద్ధమున.
నీలజాంబవ దాదు లాలమ్ము నర్చి
కూలిచి రవని నాకుటిల దైత్యులను.
బలిముఖ ధాటికి నిలంబడలేక
తొలగిరి దైత్యులు పలుపంచలకును.

## రావణుని పరాజయము

చచ్చిరి సమరాన సైన్యాధిపతులు
పిచ్చెక్కినట్లయ్యె విబుధవైరికిని.
ఈ మానవులు మఱి యీ కోతిమూక
లేమి సేయుదు రని యెంచెను తాను
కొలిమించిచ్చుగ రేగి కోతులబాధ
తలమునకలై వచ్చె తనదాక నేడు
రథ భట సైనిక రభసమ్ము మీఱ
పృథుల శస్త్రాస్త్రముల్ వేగ ధరించి
వానరసేనలం బట్టి వధింప
తానె స్వయమ్ముగ తరలె రావణుండు

ఒకప్రక్క రావణుం డొకప్రక్క కపులు
ప్రకటార్భటులతోడ వచ్చి పోరంగ
మండుటగ్నుల నింపె మారణాస్త్రములు
కొండలు పిండియై కూలె నెట్టెదుట.
అంగద జాంబవదాదులం గూడి
రంగమధ్యమునకు రణమొనరింప
సుగ్రీవుం డతిబలశూరుడై వచ్చి
యుగ్రుండై ముందున కురికె ధైర్యమున.
తనశక్తి సామర్థ్య దర్పముల్ చూప
వనచర వరులపై దనుజనాథుండు
కురిసెను బాణాగ్ని కోటులవరుస
పరువెత్తుటకు గూడ తెరువు లేకుండ.
దనుజేంద్రు ధాటికి తాళగ లేక
వనచరుల్ భయమున వణకుటం జూచి
చనుదెంచె రాముండే సమరమ్మొనర్ప
దనుజేంద్రు మీదకు హనుమంతు నెక్కి.

తిలకింపగనె రాము తేజమ్ము నెదుట
కలగుండువడి దైత్యకులనాథుం డెగసి
పరమోగ్ర మారణ శరపరంపరల
గురిసెదు రాముపై కోపమ్మెసంగ.
పరిహాసమ్ముగ నొక్కబాణమ్ము నేసి

నరకెను రాముఁ డాశరములన్నింటిని
దనుజేంద్రు రథమును ధనువునుగూడ
తునిమె వేఱొక వాఁడితూపు నంపించి
విరథుఁడై దనుజుడు విన్నదనాన
ధరణిపై నిలబడు టరసి రాఘవుఁడు
ధనురస్త్రములులేని దనుజ! నీతోడ
ననిసేయు టిపుడు నా కర్హము గాదు
నేటికి నిర్భీతి నీవింక పొమ్ము
వీటికటంచును విడిచె రావణుని.

ఆకస్మికమ్ముగ నైన యుద్ధమున
ప్రాకటసత్త్వుఁ డా రాముని వలన
జరిగిన తనపరాజయమును దలఁచి
యరిగెను రావణుం డతిఖిన్నుఁ డగుచు.

## రామరావణ సంగ్రామము - 3

### కుంభకర్ణుని వధ

తడయక రావించి తన వీరవరుల
తడబడు నుడులతో దశకంఠుఁ డంత
"దనుజనాయకులార! దయయుంచి వినుఁడు
మనుజమాత్రుఁ డటంచు మది నింత దనుక

గ్రహియింపకుంటి మహారాముని శక్తి
బహుబలసాహస ప్రాభవుం డతఁడు
క్షణములో ననునొంచి వెనుకకుఁ దరిమె
వనచర సేనపైఁ బడినప్పుడేను.
దురములో రాముని దునుమాడుకొఱకు
జరిగింపవలె నింక సకలయత్నములు
కుంభద్బలుండు నాసోదరుం డైన
కుంభకర్ణుని మేలుకొలుపఁ డీరనియె.

పదివేల గజములఁ బంపి త్రొక్కించి
పదివేలబండ్లపై పాయసాన్నములు
పదిలమ్ముగా బంపి భటులెల్ల రేగి
మదమున నిదురలో మత్తిల్లి యున్న
కుంభకర్ణుని లేపి కొనివచ్చి నంత
అంభోధి గంభీరుఁ డసురేంద్రుఁ డపుడు
తమ్మునిఁ గనుగొని దరిఁజేర్చి పొగడి
"తమ్ముడా! పనియుండె త్వరగ నీతోడ
కనుమదె రాముఁడు కపిసేనఁ గూడి
మనపైకి దండెత్తి చనుదెంచినాడు
నీవంటి వీరుఁ డీ నేలపై లేడు
కావున తమ్ముఁడా నీవేగి త్వరగ

రణరంగమందున రామునిఁ గూల్చ
యొనరింపు సాహది కుల్లాసమనుచు
సదమల రణవేషసత్కృతుం జేసి
కదనమ్మునకు కుంభకర్ణునిఁ బంపె.
విదిత దర్పుండయి భీకరాకృతిని
కదనమ్మునకు కుంభకర్ణుండు వెడలె.
చదలనంటు మహోగ్ర సాహసాకృతిని
కదలివచ్చెడు కుంభకర్ణునిఁ జూచి
దనుజుండు గాఁ డిది పెనుకొండ యనుచు
వనచరసైన్యముల్ పరువెత్తి పోయె.
దానవు నెదిరించు ధైర్యమ్ము లేక
వానరాధిపులును ప్రక్కకు చనిరి.
హనుమంతుఁ డంతటి యతిశయబలుడు
దనుజశూలాహతి కణగి వెన్కాడె
కుంభకర్ణుని పద క్రూరఘట్టనకు
కుంభిని సర్వమ్ము క్రుంగుచునుండె.
అరిగె రాముని పయి కండకావరిన్ వదలి
ఉపశక్తిమంతుఁడా యుగ్రదానవుడు.

శైలముల్ విసరుచు శూలముల్ విసరి
ఆలమ్మొనర్చె నా యసురాధిపుండు.
దారుణమ్మయిన యాదైత్యునార్భటికి

బూరటిల్లెను సర్వభూనభోంతరము.
వీరాధివీరుఁ డా శ్రీరాముఁ డేయు
నారాచధారకు నకుమనే విఱిగి
అసురుఁ డేసిన భీకరాస్త్రమ్ము లెల్ల
వసుధపైఁ బడియెను భగ్నమ్ము లగుచు
శ్రీరాముఁ డేసిన మారణాస్త్రముల
నేరీతినైన తానెదిరించి నిలచి
కుంభినియందున కూలుచు మరల
కుంభించి లేచు నా కుంభకర్ణుఁడు
మరణింపడేమొ యీ మాయావి యనుచు
వెఱగందుచుండిరి విబుధులు కూడ.
సామాన్యముగ వీడు చావడటంచు
రాముఁ డుగ్రుండయి ప్రబలమహాత్వ
దీపిత దుర్వార దివ్యాస్త్రమొకటి
చాపమ్ముపై కెత్తి సంధించి వదలె.
తలతెగి యాఘోర దనుజు మొండెమ్ము
కులపర్వతమ్ముఁబోలె కూలె కుంభినిని -
ప్రవిమలమ్మగుచు నారాక్షసునుండి
దివికేగ నొకమహాతేజమ్ము లేచి
తనయంత వాడైన తమ్ముని చావు
విని రావణుం డేడ్చె పృథ్విని దొరలి.

త్రిశిరుఁడు మున్నగు దితిజేంద్రు సుతులు
దశకంఠు నోదార్చి దనుజసైన్యముల
సమకూర్చి శ్రీరామచంద్రు నెదిర్చి
సమర రంగమునందు సమసి రందఱును.

## రామరావణ సంగ్రామము - 4

### సంజీవని

తనయుల మృతి విని ధరణిమూర్ఛిల్లిన
జనకు నాశ్వాసించి రణవిజృంభణము
లేపార పోరికి నింద్రజిత్తేగె
కోపాట్టహాస సందీపితుం డగుచు.
పటు ధనుష్టంకార భాంకార మెసఁగ
చటులోగ్ర లసురులు చనిరి వెన్వెంట
అనికి తానరుదెంచు టరివీర వర్యు
లణుమాత్రమంతైన నరయకుండంగ
వినువీథి మబ్బుల వెనుకగా డాగి
దనుజేంద్రపుత్త్రుఁడు తనశక్తికొలఁది
బాణపరంపర వర్షించుచుండ
వానరుల్ మూర్ఛిల్లి వసుధపై బడిరి.
ఏమాత్ర మిందద్రజి త్తెడమీయకుండ
రామలక్ష్మణులపై బ్రహ్మాస్త్ర మేయ

ఆకస్మికమ్ముగ నా మహాయుధము
చీకాకు పఱుపగా చేష్టలు దక్కి
శ్రీరామలక్ష్మణుల్ క్షితిమీద బడిరి.
వారినిగని కపుల్ వగచుచుండంగ
అమితహర్షమ్మున నఱచుచు చనిరి
తమనాయకుని జేరి దనుజసైనికులు -

సరగున వచ్చి యా జాంబవంతుండు
పరువున రమ్మని పావనిం బిలిచి
"హనుమంత వినుమయ్య యర్థి నీవె
పనియొండు గలదు నీవలన నిచ్చోట
అల హిమాచలపంక్తు లందొక్క గిరిని
నలరు సంజీవని యనెడు నోషధిని
త్వరగ తేవలె నీవె పవమానసుతుడ
తిరిగి ఱేపటి ప్రొద్దు తెలవారకుండ
ధారుణి మూర్ఛితులైరి వీరెల్ల
వేఱేమియును గాదు వెఱపిక లేదు
క్షితిని సంజీవని చేత వీరలకు
స్మృతివచ్చు వేగమే యేగి" రమ్మనగ
ఎటులేగి యెపుడు తానేతెంచినాడొ
పటుజవ సత్త్వుడా పవమానసుతుడు
బాలార్కునకు ముందె పరువిడివచ్చి

ద్రావాలెను సంజీవి శైలమ్ముతోడ.
సంబర మ్మెసఁగ నా శైలమ్మునుండి
జాంబవంతుఁడు చూప సంజీవిఁదెచ్చి
ప్రబలులై లేచిరి పడినవానరులు
ప్రబలులై లేచిరి రామలక్ష్మణులు.

ఇంద్రజిత్తు వధ

అరుదెంచి యింద్రజిత్తారీతి నిన్న
జరిపిన మోసంపుచర్యల కలిగి
వనచరసేనతో వానరాధిపులు
చనుదెంచి పటుతర సాహసమ్ములర
వేగమ్ముతో వీథివీథులఁ దిరిగి
కాగడాల్ ముట్టించి కాల్చిరి లంక.
శిలలను విసరుచు చెట్లతో మోది
చెలరేగి భీకర సింహగర్జనల
శుంభద్బలులు మహాశూరులైనట్టి
కుంభనికుంభుల కూల్చిరి ధరణి
ప్రకటసత్త్వులనేక రాక్షసవరుల
మకరాక్షుతోఁ బాటు బ్రమందించినారు
దనుజు లంధఱుకూడ తమఘాటి కడలి
వెనుకాడి పరువెత్త దనుజేంద్రుపురిని

వీరరసావేశ విజయవిహార
ధీరులై వానరుల్ తిరిగి రానాడు.

తననాగపాశమ్ము తనదు బ్రహ్మాస్త్ర
మనిలోన వ్యర్థమై చనిన వాపయిని
దనుజేంద్రపురి ధ్వంస మొనరించినారు
వనచరుల్ తమయిచ్ఛ వచ్చినట్లనుచు
మనమున చింతించి మఱుసటిదినమె
కినుకతో నింద్రజిత్తునికి నేతెంచి
సీత మాదిరిగనె చేయించినట్టి
కైతవప్రతిమను గైకొని వచ్చి
"వనచరాధములార! కనుడు మీముందె
జనకజ నిదె నేను చంపుదు" ననుచు
వరదలై నెత్తురుల్ పాఱ యాబొమ్మ
శిరమును ఖండించె కరవాల మెత్తి.
అసలైన సీతగా నాబొమ్మ నెంచి
పసచెడి వానరుల్ పరువున నేగి
దనుజేంద్రుని కుమారుఁ డొనరించినట్టి
పనిని రాముని వద్ద వినిపించుచుండ
త్వరగ విభీషణుం డరుదెంచి యటకు
"ధరణిజ కాదది దనుజు మోసమ్ము
ఎనలేని మాయలా డింద్రజిత్తని

పనులన్ని యిట్టివే వసుధాతలాన
హరుని భక్తుఁడనను నతిశయ మ్మయిన
గరువమ్ముకూడ నాఖిలునకుఁ గలదు
హరుపూజ పూర్తిగా జరిపిన నాఁడు
ధరణి నజేయుఁ డానిరుపమ సత్వ
డీరహస్యము నిక నెడదయం దునిచి
మీరు వర్తింపుడు మేలగు" ననియె.

ఆమాయరాక్షసున్ హతమార్చుమనుచు
సౌమిత్రినింజూచి రాముఁడు నుడివె.
వనచరసైన్యముల్ వెనువెంట నడువ
తన దివ్యశస్త్రాస్త్ర తతిని చేబూని
మఱునాటి యుదయమ్మె తరుణమ్ము జూచి
యరిగె నాయసురుపై ననికి లక్ష్మణుఁడు.
తనగృహాంగణమందు వెనుకభాగమున
అనుపమా నొక గుహాభ్యంతరస్థలిని
ఏకైకదీక్షతో నింద్రజిత్తెనసి
శ్రీకంఠు పూజలు చేయుటఁ జూచి
కడుమంచి తరుణ మీగడియ యటంచు
పడగొట్టి యాగుహావరణమ్ము నెల్ల
క్షణములో నింద్రజిత్తొనరించు పూజ
వనచరుల్ విధ్వంస మొనరించి నారు.

తన పూజ నీరీతి ధ్వంసమొనర్చు
వనచరసేనను వాకలమక్ష్య
విలసిత విక్రమాన్వితుఁడు లక్ష్మణుని
తిలకించి యింద్రజిత్ దిగ్భ్రాంతి నొందె;
తనరహస్యము జెప్పి పినతండ్రి యిటుల
ననిపె వీరలనని యాత్మలోఁ దలఁచి
వెనువెంటనే పూని ఘనకార్ముకమ్ము
ననిసేయ నేతెంచె నసమశౌర్యమున.

గండర గండడై కపిసేన నెల్ల
ఖండింపఁ దొడఁగెను కఱకుటమ్ములను
ఉగ్రులై ముందున కురికిరి కపులు.
ఆగ్రహమ్మున వచ్చె నసురేంద్రసుతుఁడు
కలగె పాదోనిధుల్ కంపించె ధరణి
విలయతాండవమయి పృథ్వియల్లాడె.

తనమంత్రిబలమును తనమాయలెల్ల
మనమునఁ దలచి యాఘనుఁ డింద్రజిత్తు
వినువీథి డాగుచు ననిసేయ చొప్ప
గనిపెట్టి సౌమిత్రి కార్ముక మెత్తి
"రాముని యానతి నేమీఱ నేని
భూమి సత్యమ్మని రాముని మాట

ఇరవుగా నింద్రజి త్తెందుదాగినను
ధరఁ గూలు గావుత తక్షణ" మ్మనుచు
వదలెను దారుణోత్పాతమై దైత్య
విదళ నోగ్రంబైన భీకరాస్త్రమును.
ఘనతరాగ్నిజ్వాలి కాభీల మగుచు
వినువీథి కెగసె నాభీకరాస్త్రమ్ము
తలతెగి కూలె నాఖలుఁ డింద్రజిత్తు.
చెలఁగి చేసిరి కపుల్ సింహానాదములు
అనుజుని సామర్థ్య మరసి రాఘవుఁడు
మనమున నలరుచు వినుతించె మిగుల
ధరణిని గూలె నీదురితాత్ముఁ డనుచు
సురలు వర్షించిరి విరుల వానలను -

మం డో ద రి వి లా ప ము

అమరేంద్రు గెలిచిన అతిశయబలుఁడు
సమయుట విని యేడ్చె సర్వ మూలంక
ఎవరిపై తనయాశ లెల్లను బెట్టె
బవరాన కేగెనొ వారలే పడిరి
శుంభన్మహోదగ్ర శూరులైనట్టి
కుంభకర్ణుండును కొడు కింద్రజిత్తు.
పిడుగుపాటుగఁ దోచి వీరలచావు
పృథమిపై మూర్ఛిల్లి పడెను రావణుఁడు

కొండంతవాడైన కొడుకు చావునకు
మండోదరియు తన గుండెలు పగిలి
స్మృతిలేక పడియున్న పతిసేదఁ దీర్చి
అతిశోకమున నిట్లు ప్రార్థింప సాగె.
"వనజాసనుని పుణ్యవంశోద్భవుడవు
ఘనతపశ్శాలివి వినుత వీరుఁడవు
త్రిభువనమ్ములయందు తిరుగులేకుండ
విభవమ్ముతో నేగి విజయమందితివి
ననుక్షమియించుచు నామనోనాథ!
వినుమయ్య యొకమాట వినతిజేసెదను.
చచ్చెను తమ్ముడు చచ్చిరి సుతులు
చచ్చి రమాత్యులున్ సైన్యాధిపతులు
కనులెత్తి సురలైన కానగాలేని
దనుజలంకాపురి దగ్ధమైపోయె.
దైతేయపతి! నీవు ధర్మమ్ము దప్పి
సీతను దెచ్చిన పాతకమ్మునకు
క్షితిమీద మనకింత చేటుమూడినది -
మతినెంచు మికనైన మంచిమార్గమ్ము
ఏనును నీయింటి యిల్లాలిఁ గాన
జానకి పడుబాధ నే నెఱుంగుదును -
రాము డజేయుఁడు రణరంగమందు

రాముడు దైవ మీ భూమీతలాన
జానకిన్ శ్రీరామచంద్రున కిచ్చి
మాను మీ వైరము నానాథ యికను
మహిని నిల్పుము నాదు మాంగళ్య మనుచు
బహువిధమ్ముల వేడు పత్నినిఁ జూచి
భండనావేశుఁ డా పౌలస్త్యుఁ డంత
"మండోదరీ! నీదు మాట నిజమ్మె
కాని, శూర్పణఖను గావించి యట్లు
పూనెను వైరమ్ము మొదట రాఘవుఁడె
ధరణిపై రాముఁడు దైవమ్మటంచు
నెఱిఁగియే యీరీతి జరిపితి నెల్ల
వచ్చిన జయ మంది వచ్చెద నేను
చచ్చిన రాముచేఁ జావంగవలెను.
అరసెద నాతని యతిశయమ్మ"నుచు
నరగెను రావణుం డతుల దర్పమున.

రావణుడు సీతను చంపబోవుట

తనకు వచ్చినఁ జేటు దలఁచిన కొలఁది
కనులు నిప్పులు గ్రక్క దనుజనాథునకు
దీనికి హేతువు జానకి యనుచు
జానకిం జంపగా దానవేశుండు
కరవాలమును దూసి ధరణిజ వంక

కరుగుచుండ సుపార్శ్వుడను దైత్యుఁ డాపి
"అసురేంద్ర నీకేల? అబలను జంప
పసమీఱ రాముని పరమాయువు మదిగొ
సమధిక సంగ్రామ సాహస మ్మొసఁగ
సమకూడియుండె నీసైన్య" మ్మనంగ
రావణుం డరిగెను రాముని పైకి
తీవరించిన యుద్ధదీక్షితుం డగుచు.

## రామరావణ సంగ్రామము - 5

### లక్ష్మణుని మూర్ఛ

ఆనాడు రావణుం డాగ్రహోద్రేక
శోణరేఖా పరిస్ఫురిత నేత్రుండు
కడు భయంకర మహాకాలాగ్నిమూర్తి
కడువడి సైన్యమున్ కపులపైఁ బంపి
రామలక్ష్మణులున్న రణరంగమునకు
భీమ జవమ్మున వెడలి క్రౌర్యమున
ఇరువంకలందున తెరువు లేకుండ
కురిపించె వారిపై శరపరంపరలు
రణబలోద్దాములు రామలక్ష్మణులు
దనుజసేనల బట్టి దునుమాడుచుండ
వేవేగ వానర వీరు లేతెంచి

రావణున్ ముంచిరి రాళ్ళవర్షమున
అగ్రజుపై నొక్కయమ్ము రాకుండ
ఉగ్రుడై లక్ష్మణుం డురికి ముందునకు
రావణు చాపమున్ రథమును తునిమి
రావణుపైఁ గూర్కె రౌద్రమ్ము మెఱయ
ప్రళయరుద్రుండయి వచ్చు సౌమిత్రి
బలసముద్ధతిఁ గాంచి ప్రాభవమ్ముడిగి
తనప్రాణములె యిఁకఁ దక్కవటంచు
మనమున భీతిల్లి దనుజేంద్రుఁ డంత
తనమామ మయుడును తనకిచ్చినట్టి
ఘనమైన శక్తిని మనసునఁ దలఁచి
తెంపు వహించుచు తీసి మంత్రించి
పంపెను సౌమిత్రి ప్రాణముల్ దీయ
కఠినమోఘమ్ముగ కదలి యాశక్తి
పుడమిపై లక్ష్మణున్ బడగొట్టి యేగె
విరథుఁడా రావణున్ వెనుకకుఁ బంపె
సరగున నాతని సారథి వచ్చి
మరణించె సౌమిత్రి మహిమీద ననుచు
నఱచుచు హర్షాన నసురులు చనిరి.

వానరులెల్లరు వచ్చి లక్ష్మణుని
దీనులై శోకాన తిలకించుచుండ

ధరణినిఁ బడియున్న తమ్మునిఁ జూచి
దురపిల్లె రాముఁడు దుఃఖాన మునిఁగె.

"తన సుఖమ్మెఱుఁగక జనియించుటాది
నను వెంట నంటుచు నన్నె సేవించు
పసితమ్ముఁ డితఁడు నా ప్రాణతుల్యుండు
అసువులే నాకయి యర్పించె" ననుచు.

అంతలోన సుషేణుఁ డరుదెంచి యటకు
"చింతమానుము దేవ! శ్రీరామచంద్ర!
ప్రాణమ్ములున్న వీ బాలుని మేన
మానితవీరుఁ డా మారుతి మరల
చని వేగ సంజీవిఁ గొని తెచ్చునెడల
మనకుతప్పకఁ దక్కు మహిని సౌమిత్రి"
యనుచున్న యంతలో హనుమంతు డటకు
నరుదెంచి శ్రీరామునంఘ్రుల కెఱఁగి
పఱచి యా హిమగిరి ప్రాంతభూములకు
భూమిపై తొలిప్రొద్దు పొడువక మునుపె
సౌమిత్రి కడనుంచె సంజీవిఁ దెచ్చి.
మహనీయ సంజీవి మహిమచే లేచి
మహిమీద సౌమిత్రి మరల నిల్వఁగనె
కుతుకమ్ముతో నాడె కోతులసేన.

సతతమ్ము సమ్మోద సంధాత యయిన
హనుమంతు వినుతించి హర్ష మ్మెసంగ
చినతమ్ముఁ గౌగిలిఁ జేర్చి రాఘవుఁడు
మఱునాటి యుదయాన మరల యుద్ధమున
కరుదెంచు సమయమం దసురేంద్రవరున
కొకభీతి జనియించి యుల్లమ్ము నెల్ల
వికలమ్ము గావించె వివిధ భంగులను.
"ఔరౌర! యెంతటి వీరాధివీరు
లీరామ లక్ష్మణు లెంత సాహసులు.
చనిపోయె ననుకొన్న సౌమిత్రి బ్రతికె
తనకిక మరణమ్ము తప్పదు భువిని
మరణమ్ము లేకుండ మనుజులచేత
వరములు గొనలేదు బ్రహ్మచే నుండి"
దనుజేంద్రుఁ డీరీతిఁ దలఁచి యొక్కింత
మనమున బూనుచు మరల ధైర్యమును
మణిగణాంచిత నూత్నమకుటాయుతములు
తన పది తలలను తడవి చూచుకొని
తన తపోబలమును తన మంత్రబలము
తన యస్త్రశస్త్రముల్ తలచి దర్పమున
మణి భూషణాంబర మహితవేషమును
రణయోగ్యముగ దాల్చి రమ్యమై యలరు

తన రూపమును రక్ష దర్పణమ్మందు
కనుగొని మనసున గర్వించి మిగుల
అనికేగ సారథి కంపె వార్తలను
తన కాంచనరథమ్ము త్వరగ తెమ్మనుచు.

ఆదిత్య హృదయము

జనకజన్ మోసానఁ గొనిపోయెనాఁడు
అనుజున కవమాన మొనరించె నేడు
తన వెంట వచ్చిన వనచరతతిని
దునిమె ననేకుల దురితుఁడై యితఁడు
ఏరీతి రావణుం డిలగూలు ననుచు
శ్రీరాముఁ డెదలోన చింతించుచుండ
భవ్యవిచారుఁడు పరమతపస్వి
దివ్యప్రభావుఁడు దేవసముండు
మునియగస్త్యుఁడు వచ్చి ముదము మీఱంగ
ఇనకుల తిలకుని వీక్షించి పలికె
"చింతింపకుము రామ! క్షితిని దైత్యేంద్రు
డంతమొందెడు కాల మాసన్న మయ్యె
అనఘ శ్రీరామ! మీ యన్వయస్వామి
యినుని వేడుము నీదు మనమున నున్న
సకలార్థసిద్ధియు సమకూడు నింక

సకల శత్రువులను సమయుదు రనుచు
దివ్యమంత్ర మ్మతి తేజఃప్రదమ్ము
భవ్య మైశ్వర్యమ్ము పరమార్థమయిన
ఆదిత్య హృదయమ్ము నపుడు రామునకు
బోధించె మునిచంద్రు డాదర మ్మెసఁగ.

మనసున సూర్యుని స్మరియించుకొనుచు
మునికి శ్రీరాముఁడు ప్రణమిల్లి యంత
సర్వసాక్షియు జగచ్చక్షు వౌ యినుఁడు
పూర్వదిక్తటమున పొలుపుగాఁ దోఁచె.
సురుచిరమూర్తి యాసూర్యుని యెదుట
శిర మరవాలిచి శ్రీరాఘవుండు
ధ్యాన తత్పరుఁడయి ప్రార్థించె నిట్లు.

"విమల తేజోరూప! విశ్వప్రదీప!
సమధిక జయచిహ్న చండప్రతాప!
ప్రాకటాంశుస్ఫార భాసురాకార!
శ్రీకరోద్యతభావ! శ్రీసూర్యదేవ!
సర్వదేవుఁడ వీవె, సర్వమ్ము నీవె,
సర్వ జగద్రక్ష! సద్ధర్మపక్ష!
కారుణ్యగుణసార! కాంతివిస్తార!
వైరిమర్దన చండవీరమార్తాండ!

శశ్వదంశు వికాస! స్వచ్ఛప్రకాశ!
విశ్వసంధాత యో విజయప్రదాత!
వందనమ్ము దినేశ! వందనమ్మర్క!
వందన మాదిత్య! వందన" మనుచు
మెదురభక్తితో మిత్రు నర్చించి
ఆదిత్య హృదయమ్ము నఖిలమ్ము చదివి
నిలిచిన రాముని నెమ్మోనియందు
వెలుఁగొందె నొక మహావిమల తేజమ్ము
విదితరావణ వీర్య విక్రమాటోప
విదళనోద్యమ శౌర్య విక్రాంత మగుచు.

రా వ ణ వ ధ

వేవేగ నంతలో వినువీథినుండి
దేవేంద్రుఁ డంపిన దివ్యరథమ్ము
సారథి కొనివచ్చె శ్రీరాముకొఱకు.
వీర కోదండోగ్ర నారాయణుండు
రాముఁ డా రథమెక్కి రావణుపైకి
భీమ తేజమ్మున వెడలె పోరునకు.

అరుదెంచె రావణుం డొకప్రక్కనుండి
కరతరాయుధపంక్తి కరముఁ బూని

రణరంగ ఘంటికా ఘణఘణాత్కార
రణితమౌ కాంచనరథముపై నెక్కె

ధర్మసంస్థాపనోద్యత్ సమారంభ
కర్మవీరుడు పుణ్య కాకుత్స్థకులుడు
రణమున నొకప్రక్క రాముఁడు నిల్చె
వినుత విజయచిహ్న విభవమ్ము లలర
దుర్మార్గ పాపౌఘ దూషిత క్రూర
కర్మతుండును లోకకంటకుం డైన
దశకంఠుఁ డొకప్రక్క దర్పాన నిలిచె
అశుభ దుశ్శకునమ్ము లడరి కన్పింప
ఇనుమడించిన ధృతి నెనఁగి యిర్వురను
రణసముద్ధతు లైరి రామరావణులు
తనవీరవేషమున్ కనుగొని తానె
తనలోనముదమందు దశకంఠుఁ జూచి
రాముఁ డిట్టుల పల్కె ప్రస్ఫుటఫణితి
మోమునం దాగ్రహముద్ర దీపింప
"రణమున కేమి యీరాముని మాట
వినుమొక్క నిమిస మోదనుజేంద్ర! నీవు
దనుజుల దౌష్ట్యమ్ము లణగించుకొఱకె
వనభూములకు నేను వచ్చిన వాఁడ.
రాముని కెదురుగా రణముసేయంగ

ఏమిఁ భావించి నీవిటకు వచ్చితివో,
ఖరదూషణులు నాదు కఱకుటమ్ములకు
ఎఱయైన మాటను మఱచితి వేమొ
సర్వలోకముల నీసాటి లేరనిన
గర్వమ్ము తలకెక్కి కావర మ్మెనసి
ముల్లోకములమీద మొనసి దండెత్తి
కల్లోలపఱచిన కలుషచిత్తుఁడవు
అతివల చెఱపట్టి అమరుల నణచి
యతులను హింసించి కతమేమి లేక
నీవంశ విఖ్యాతి నేలఁ గల్పితివి
నీవార లెల్లరు నేల గూలితిరి
ఇవియెల్ల చాల కీయిలమీద నీకు
ప్రవిమల సాధ్వి నాభార్య జానకిని
చెఱగొని మోసాన పరువెత్తినట్టి
పిరికిపందవు నీవు దురితచిత్తుఁడవు.
ఈరీతి నపచార మొంచి నాకింక
ఏరీతి తప్పించు కేగఁ జాలెదవు
ఆనాఁడె నీవు నాకగుపించు నెడల
బాణాగ్నిశిఖలకు బలిచేసియుందు -
నీపాపకార్యముల్ నిఖిలమ్ము పండి
నీపయిఁబ్రద్దలౌ నిముసమ్ము వచ్చె

ఏవరమ్ముల బల మ్మెవరు నీదిక్కొ-
ఈవిశ్వమును వీడి యెచటి కేగెదవొ
చూచెద నీలావు కాచుకొమ్మింక
నా చేతి శరవృష్టి నీ చూడా" యనుచు
పోరుసల్పగనిల్చె దారుణోదగ్ర
ఘోరకార్ముక మూని వీర రాఘవుఁడు.

రామ తేజమ్ములో రగులు వేడిమికి
రాముని మాటలో రగులు వాడికిని
ఒడలెల్ల ఝల్లని వడకి రావణుఁడు
కడుదీనుఁడై పోయి క్షణములో మరల
ధైర్యమ్ము బిగబట్టి తలపునందున్న
కార్యమ్ము సమకట్టి కాల్నిలబెట్టి
"దేవతల్ దేవేంద్రుఁ డేవేల్పుగూడ
నావైపు రాలేక నాల్గుదిక్కులకు
పరువులెత్తిరి రామ! యెఱుగవో యేను
నరుఁడ వీ పిరికి వానరులను గూడి
ధరణి నజేయుఁ డీ దశకంఠు పయికి
అరుదెంచి నావేమి యొరగబెట్టుటకు
ఈ నా ధనుర్శక్తి మిది చాలు నాదు
బాణమొక్కటి నీదు ప్రాణముల్ దీయు

ఆలమ్మునకు కాలమాసన్న మయ్యె
కాలూని నిలుపుము కదలబోకనుచు
కనుల నిప్పులురాల కదనాంగణమున
ఇనకులేశుని రాము నెదిరించి నిలిచె
దాపురించిన యొకదావాగ్నివోలె
కోపియై చాపియై పాపి రావణుఁడు.

రామరావణ యుద్ధరభసమ్ము చూడ
వ్యోమవీథుల నిల్చి రొదిగి దేవతలు.
కనివినియెఱుగని కఠినాస్త్రశస్త్ర
చణ విదారణ ఘోరసంగ్రామ మద్ది.
ఇరుగడలందుండి యెనయు దివ్యాస్త్ర
గురుతర ధూమాగ్నికోటులు నిండి
సంచలించెను జగచ్చక్రమల్లాడి
పంచభూతమ్ములు వణకి క్షోభించె
ఒకరేయు బాణమ్ము లొకరు ద్రుంచంగ
ఒకరు వేఱొకరిపై యుగ్రులై యురుగ
శరపరంపరలతో చదలెల్ల నిండి
పరమాద్భుతమ్మయ్యె వారియుద్ధమ్ము.

ఎన్నిదివ్యాస్త్రమ్ము లేసినగూడ
అన్నింటినిం ద్రుంచి యలసటలేక

అవనిపై గూలిన యసురేంద్రు నుండి
దివికేగ నొకదివ్యతేజమ్ము లేచి
అగణిత దుష్కర్మ నసురేంద్రుఁ గూల్చి
జగతికి శ్రేయమ్ము సలిపిన యట్టి
ఘనుఁడు రాముని శక్తి వినుతించినారు
జనులును మునులును సర్వదేవతలు.

ప్రభవించి పావన బ్రహ్మవంశమున
త్రిభువన వీరుడై దీపించి తుదకు
తనయన్న దుష్టుఁడై ధ రఁగూలు టరసి
మనమునం దతిచింత గొనె విభీషణుఁడు
రణరంగమున కేగి రావణుభార్య
తనపతి శవమును కనుగొని యేడ్చె
"ఎంతతపశ్శాలి వెంతశూరుఁడవు
ఇంత దీనుఁడవయి యిల గూలి తనుచు.

కారుణ్యసింధు వా శ్రీరామమూర్తి
వారలనోదార్చి వారల చేత
జరిపించె సముచిత శ్రాద్ధకర్మములు
ధరణిని గూలిన దైత్యనాథునకు.

విభీషణుని పట్టాభిషేకము

ధరణి నిల్పుకొనంగ తా నన్నమాట
సరగునఁ జెప్పించి సాగరజలము
అసురేంద్రుఁ డీల్గిన యవసరమందె
అసురేంద్రు సోదరుం డల విభీషణుని
కమనీయరీతి లంకారాజ్యమునకు
సముచిత వైభవ సమ్మోదమమర
వనచరు లలరంగ పట్టాభిషిక్తు
నొనరించె రాము డత్యుత్సుకుం డగుచు.

అగ్నిపరీక్ష

శ్రీరాము నాతని శ్రీఘ్రమ్మె యేఁగి
ధారుణీజాతకు మారుతి నుడివె
రాముని విజయమ్ము రావణు మృతియు
హనుమని పలుకుల నాలించినంత
కనుల నానందాశ్రుకణములు రాల
తనస్వామి రాముని కనఁగోనుకోర్కె
జనకజ యెఱిగించె హనుమంతునకును
శ్రీరామునకుఁ జెప్పి సీతతలంపు
మారుతి సంతోష పరవశుం డగుచు
అరిగె విభీషణు ననుసరించుచును
ధరణిజన్ రాముని దరికిఁ దోడ్తేర

జనకజ కెఱిగిరి వినయులై వారు
దనుజకాంతలు వచ్చి జనకజకప్డు
జలకమ్ము లాడించి సదమలాంబువుల
లలితభూషణ వస్త్రి విలసితం జేసి
హనుమదాదుల గూడి వెనువెంట నడచి
కొనివచ్చినారు రామునివద్ద కెలమి
సన్నుతాత్ముఁడు తనస్వామిని మరల
నిన్నిరోజులకు తానీక్షించి తనుచు
ప్రేమయు భక్తియు వినయమ్ము దోప
రాము కాళ్ళకు మ్రొక్కి భూమిజ నిలిచె.
"కోపమ్ము దీపింప చూపులయందు
భూపుత్రిఁ గని రామభూవిభుఁ డంత.

"జనకజా ! మోసాన దనుజుఁడు నిన్ను
గొనిపోయిన కతాన కినుక వహించి
అసురేంద్రుఁ జంపితి నబ్ధిని దాటి
వసుధకుఁ దెలియ నా బలపౌరుషములు.
చెఱబట్టి నిన్నట్లు చేకొని చనిన
పరవాసమున నీవు వసియించు కతన
స్వీకరింపగఁ జాల క్షితిని నిన్మరల
ఏకడకైన నీవేగ వచ్చు" నఁగ
శ్రీరామచంద్రుఁడే సీతను గూర్చి

యీరీతి నసిరెయనా ధారణి ననుచు
ఆసనమ్ముల వాల్చి దీనులై మిగుల
వానరులెల్లరు భయమంది చూడ
"ఏనుఁగుచేజిక్కు నెలదీగ వోలె
జానకి వణఁకుచు స్వామికి మ్రొక్కి
"శ్రీరామచంద్ర! నా చేతో ఉధినాథ!
యీరీతి సందియ మ్మేల నాపైని
కలసియుంటిమి యింతకాలమ్ముదనుక
నిలను నావర్తనమ్మెఱుఁగవే నీవు
అసుర సద్గోనునప్పు డవశను నేను
దోసగు నాయెడద లే దిసుమంతకూడ
హనుమంతుతోడ నీవానాడె నాకు
అనిపియున్నెడల నీయాత్మలో మాట
కరుణాత్మ నీవె నా పరమదైవమవు
ధరణిజ యెటకేగు ధరణి నిన్మఱచి
స్థిరముగా నిన్నె నాచిత్తాననిల్పి
అఁగియుందును నాడె అగ్నికాహుతిగ"

అనునంతలో రాముఁ డాననమ్మెత్తి
కనుసన్నసేయుటఁ గాంచి లక్ష్మణుఁడు
చితిని పేర్చించగా, సీతమ్మతల్లి
ధృతిమీఱ నేతెంచి పతికి కై మోడ్చి

శ్రీరాముఁడే నాకు క్షితి దైవమేని
శ్రీరాముడే నాదు హృదయేశుఁ డేని
నామనోవాక్కాయ నయవర్తనముల
రామునే భర్తగా ప్రేమింతునేని
అవనికిఁ దెలుపు నీయగ్ని దేవుండె
ప్రవిమలమైన నావర్తనమ్మనుచు
జ్వాలదుగ్రవహ్నిలో పదమూని చేరె,
మల్లెపూపాన్పుగా మహిజాత కపుడు
చల్లనై తోచెను సకలానలమ్ము.

శివుఁ డింద్రుఁడును బ్రహ్మ శీఘ్రమె వచ్చి
సవినయమ్ముగ రామచంద్రునిఁ జూచి
"చితియందు జేరె యో శ్రీరామచంద్ర!
అతిసాధ్వి సీత యిట్లాహుతియగుచు
ఊరక వీక్షించుచుంటివి విదేల
నారాయణుడ వీవు ధారుణిమీద
శ్రీవరలక్ష్మి యీసీత ధారుణిని
ఈవెఱుంగని ధర్మ మిలలోన లేదు
స్వీకరింపుము రామ! సీత" యనంగ
ఆకస్మికమ్ముగ నగ్ని దేవుండె
ప్రత్యక్షమై వచ్చి రాముని కెఱఁగి

"అత్యంత సాధ్వి యీ యవనిజ రామ!
పరమపతివ్రత పావనచరిత
ధరణి సర్వముకూడ తనరి హర్షించు
శ్రీరామ సీతను చేకొనుమన"గ
శ్రీరాముఁ డలరుచు చిత్తమ్ము నందు
సరసిజాసనుఁ డాది సురలను కపుల
పరమాదరమ్మున భావించి చూచి
"ధరణిజ శీలమ్ము నెఱుగనా నేను
ధరణికిఁ దెలియ యీ తన్వివర్తనము
చేసితి నిట్లని" చేతుల లోన
భూసుతం జేకొనె పొలుపు మీఱంగ.
సమధిక సౌందర్య సదమల ప్రేమ
రమణీయమూర్తు లా రాముడు సీత
ఎలమి కూర్చుండగా నేకాసనమున
తిలకించి హర్షాన పులకించి రెల్ల.
"ధరణి కంటకుఁడైన దశకంఠుఁ జంప
ధరణి జనించిన హరివి శ్రీరామ!
సకలదేవతలకు జనుల కెల్లరకు
అకలంక సంశ్రేయ మయ్యె నీరీతి
రామరాజ్యమ్మింక భూమికంతకును
క్షేమరాజ్యమ్మయి చెలగు గా కనుచు

కడు ప్రీతి రాముని ఖ్యాతి నుతించి
వెడలిరి బ్రహ్మాది విబుధు లెల్లరును.

రాముని విజయమ్ము పరిణుతించి మిగుల
ఆమోద మందిరి యమరసంతతులు
దివినుండి దశరథుం డవనికి వచ్చి
అవనిజం గొనిచూడి యాశీస్సులిచ్చి
తనరారు హర్షాన తనయులిద్దఱిని
కనుగొని ప్రీతితో కౌగిలిం బూని
పరమాదరమ్మున వారిముగ్గురిని
మఱిమఱి దీవించి మరలి తాజనియె.
రామునికోఱకయి శ్రీమనంది వచ్చి
రామునే సేవించి రణసీమయందు
మృతిగొన్న వానర బృందమ్ము నెల్ల
బ్రతికించి దివికిని వాసవుం డరిగె.

సీతారాము లయోధ్యకు చేరుట

జనకుని వాక్యానుసారమ్ము తనదు
వనవాసకాలమ్ము పరిపూర్తి యయ్యె
తొలఁగె దైత్యక్షోభ దుర్మార్గ మణఁగె
ఇలనెల్ల వారికి కలిగె సుఖమ్ము
సురలకిచ్చినమాట నెఱవేఱె నింక
ధరణిని మిగిలెను ధర్మపాలనము
ఎడదలో రామునికిటు లేదో తలపు

పొడము యయోధ్యకు పో నుత్సహించె
ఆనందమున పొంగి రచటి వారెల్ల
ఆనందధామమై యలరెను లంక.
దనుజేంద్రుఁ డల కుబేరుని వద్దనుండి
మునుఁగొన్న పుష్పకమ్మను విమానమును
రమణ నారోహించి రాముఁడు సీత
తమ వెంట నెల్లరున్ తరలి యేతేర
పరమసమ్మోదాన పయనమ్మైరి
మఱునాడె సాకేతపురమున కరుగ
ఎందఱెక్కినగాని యింకను స్థలము
పొందుగా మిగిలె నాపుష్పకమ్మందు.
ధరణిజన్ దైత్యుఁడు చెఱగొను టాది
జరిగినకథ, తాము తిరిగినస్థలుల
ఆవిమానమునుండి యంబరవీథిఁ
బోవుచు రాముఁడు ముదము మీఱంగ
జనకాత్మజకు దెల్పుచును వచ్చె వేగ
మునిభరద్వాజుని పుణ్యవాటికకు
ఘనసత్కృతుల జేసి మునియు వారలకు
వినుతించె రాముని విఖ్యాతి మిగుల
జనులకు మునులకు సంతసమ్మెసఁగ.
దనుజులఁ జంపి మేలొనరించి తనుచు.
త్వరగ మారుతి తోడ పంపె రాఘవుఁడు

భరతునికడకు తా నరుదెంచు వార్త
రాముఁడు విజయాభిరాముఁడై తిరిగి
భూమిజ జతగూడి భూమి నేలంగ
చనుదెంచుచున్నట్టి చక్కని వార్త
విని కోసలము హర్ష విమలాబ్ధిఁ దేలె
ఎదురుచూచును రాముఁడేగు దెంచుటను
సదమల స్వాగత సంరంభ విభవ
భాసురోత్సవకళా భాసమానముగ
భాసించె సాకేతపట్టణ మెల్ల
పరివారములతోడ గురువులతోడ
భరతశత్రుఘ్నులు పయనమై వచ్చి
జనకజారాముల చరణాంబుజముల
కినుమడించిన భక్తి నెఱిగి పూజించి
కొనివచ్చి రానంద కుతుకమ్ము లలర
జను లెల్ల పలుకంగ జయజయధ్వనులు.

## శ్రీ రా మ ప ట్టా భి షే క ము

శ్రీరామ పట్టాభిషేకోత్సవమ్ము
లారంభమై సాగె నామఱునాడె
సమధిక సామ్రాజ్య సకల సంపదల

అమరేంద్రుపురివోలె నలరె నయోధ్య
ధరణి కెల్లను క్షేమదాయక మ్మయిన
సురుచిర శుభయోగ సుముహూర్తమందు
శ్రీరమ్య నవరత్న సింహాసనమున
శ్రీరాముఁడును సీత చేరికూర్చుండ
మనమున నుప్పొంగ మాతకౌసల్య
మునివసిష్ఠాదులు తనరి దీవింప
ఇరుగడ సోదరు లెలమి నిల్వంగ
చరణముల్ హనుమంతుఁ డెఱఁగి సేవింప
తగుకానుకుల నీయ ధారుణీపతులు
అగణితముదమున నలర భూజనులు
వేదసూక్తులు శాస్త్రవిధిమంత్రములను
మోదమ్ముతో వచ్చి మునులు పఠింప
భూరిదానమ్ముల పుణ్యసత్క్రియల
ధారుణీప్రజ లెల్ల తనివి నెందంగ
సలలిత మంగళ స్నానము లింపార
విలసిత సామ్రాజ్య విభవమ్ము లలర
విపుల పావననదీ విమలోదకముల
కపులేగి కొనిరాగ కనకపాత్రముల
ధారుణి కైశ్వర్యదాయక మ్మగుచు
శ్రీరామ పట్టాభిషేకమ్ము జరిగె.

తమకోర్కె లీడేరి ధరణి నీనాడు
రమణీయమూర్తి శ్రీరామచంద్రుండు
రాజయ్యె సౌఖ్యముల్ రాజిల్లు ననుచు
భూజను లానంద పులకితు లైరి
ప్రవిమలశోభతో భరతున కపుడు
యువరాజ్యపట్టమ్ము నొసగె రాఘవుడు.

## కృతజ్ఞత

వానరరాజును వరవిభీషణుని
దానవవధయందు తనకు సాయమ్ము
నొసరించి నిలిచిన వనచరవరుల
వినుతించి మిక్కిలి వినయభావమున
వేడ్కతో సత్కృతుల్ విరివిగా సల్పి
వీడ్కొల్పె శ్రీరామపృథ్వీశుం డపుడు
ధరణిని రామునే తలచి దైవముగ
నిరతమ్ము రాముని చరణసేవలను
చేయుటకొఱకయి శ్రీరాముకడనె
సాయనిభక్తితో పావని యాగె
తమ కన్నివిధముల తగినసాయమ్ము
అమలుండై చేసినహనుమంతుం బిలిచి

మురువులొల్కెడు నొక ముత్యాలసరము
ధరణిజ యీయఁగాఁ దాల్చి యా హనుమ
రాజిల్లె నసమాన రమ్యరూపమున
రాజిత మహనీయ రవితేజ మలర.

## రామరాజ్యము

భూమికి మేలెంచి పుణ్యమ్ము నెంచి
నీమమ్ముతో రాజనీతిఁ దలంచి
వినయుఁడై పాటించి పెద్దలమాట
జనులెల్లరకిచ్చి శాంతిసౌఖ్యములు
గురుపురోహితవరుల్ కూర్మితో నొసగు
పరమోపదేశముల్ శిరసావహించి
బహుళాశ్వమేధముల్ పౌండరీకములు
విహితవిధానముల్ విలసిల్లఁ జేసి
గోదేవ భూసుర గురు పురోహితుల
నాదరమ్మున తన్పి యమితదానముల
సదమలకీర్తితో సలిపె రాఘవుఁడు
పదునొక్క వేలేండ్లు వసుధపాలనము
ప్రజలెల్ల రాముని పరమదైవముగ
నిజమనోవీథుల నిలిపి పూజింప,
ఆమోద సౌఖ్యాభిరామమై పొల్చి
రామమయమ్మయ్యె భూమి సర్వమ్ము

సకలమానవ పక్షి జంతుసంతతికి
అకలంక సౌఖ్యమ్ము లలరి పూర్ణముగ,
అమలమై ధర్మమ్ము లవనిపై నిలిచి
రమణీయమై పోల్చు రామరాజ్యమున
సలలిత రీతుల సర్వవర్ణములు
సలిపిరి వారల సహజధర్మములు,
సర్వదా ఫలియించి సస్యవృక్షములు
ఉర్విపై ప్రాణుల కుల్లాసమొదవె
జలసమృద్ధములయి వెలసె వాహినులు
వెలిగె సోమాగ్నులు విమలమ్ము లగుచు
అపమృత్యువులు లేవు ఆపదల్ లేవు
విపుల సౌఖ్యమ్ముల విలసిల్లె ధరణి
చోరాగ్ని కాటకక్రూరాసురోగ్ర
దారుణభయములు ధరణి నణంగె
క్షేమరాజ్యమ్మను కీర్తితో జగతి
సామెతయై నిల్చె రామరాజ్యమ్ము.
ధరణివాసులకెల్ల తల్లిదండ్రులుగ
ధరణికేతెంచిన దైవమూర్తులుగ
భూమిపై నిరతమ్ము పూజలంగొనుచు
కామితమ్ము లొసంగు కరుణాత్ములగుచు
నిలచిరి శ్రీరామనృపతియు సీత

ఇలువేల్పులై భువి నింటింటిలోన
ధర్మవర్తనులును ధర్మపాలకులు
ధర్మమూర్తులు నయి ధరణివర్ధిల్లి
శతసహస్రమ్ముగా సకలధారుణిని
అతులితఖ్యాతితో నభివృద్ధిఁ గాంచి
రాముని కీర్తిని భూమిపై నిలిపి
రామునివంశమ్ము రాజిల్లె భువిని
విదితభాసుర కీర్తి విభవమ్ముతోడ
సదమల సామ్రాజ్య సంపదతోడ.

ఫలశ్రుతి

రామాయణమ్ము శ్రీరాముని చరిత
భూమివాసులకెల్ల పుణ్యప్రదమ్ము
ప్రతిపద మధురమ్ము వాల్మీకి కృతము
క్షితి తీర్థజాల దా యతిరాజు ఋణము.
ఎన్నిసద్గుణము లీయిల నుండగలవొ
అన్నిటినిం గల్గి యలరిన నృపతి
పరిపూర్ణపురుషుఁడు పరమపావనుఁడు
హరియవతార మీ యవని రాఘవుఁడు.
లాలితగుణసాధ్వి లక్ష్మీస్వరూప
స్త్రీలకు మేల్బంతి సీతాలతాంగి

జానకీరాముల సచ్చరిత్రమున
లేనిధర్మమ్ములు లేవెందుగూడ
మానవనీతికి మానవీయతకు
మానితమార్గ మీ మహనీయగాథ
ఈ రామగాథయం దెవరికివారె
శ్రీరమ్యసద్గుణుల్ చిరకీర్తిధనులు
మునివసిష్ఠుండును మునిగాధిజుండు
ముని భరద్వాజుండు ముని యగస్త్యుండు
ముని యత్రి మున్నగు మునికులమ్మెల్ల
మన సనాతనధర్మ మార్గదర్శకులు
జ్ఞానులు త్యాగులు జగతిశ్రేయమ్మె
మానసమందెంచు మహనీయమతులు
అనురాగ మధుమూర్తు లయ్యరుంధతియు
అనసూయ శబరియు నా యహల్యయును.
జనకుండు దశరథ జననాథుండనంగ
ఘనకీర్తిమంతులు కర్మయోగులును.
కౌసల్య మున్నగు కాంతలెల్లరును
వాసిత కులధర్మ పావనవ్రతులు
తమ్ములనంగ నీధరణి రాఘవుని
తమ్ములే తమ్ములు ధర్మదేవతలు
ధీరులు త్యాగులు వీరశేఖరులు

శ్రీరామ పదపద్మ సేవనాపరులు
అసమాన జవసత్వ డాంజనేయుండు
వసుధ సామ్యము లేని స్వామిభక్తుండు,
దనుజుం డయ్యు విభీషణుని ధర్మగుణము
వినయాత్ముండు గుహుని విశ్వాసగరిమ
వానరవిభు చెల్మి పక్షి సాహసము
మాననీయము లివి మహికి నిత్యమ్ము
వెలుగుదారుల జూపు విశ్వధర్మములు
విలసితకీర్తితో నిలుచు కార్యములు -

తాను శ్రీహరియును తలపేమి లేక
మానవుం డేరీతి మసలుకో వలెనొ
తానట్లు వర్తించి తనరిన యట్టి
మాననీయాత్ముడు మహిని రాఘవుడు
ఆదర్శమానవుం డా దర్శనృపతి
మేదిని చేసిన మేటి పుణ్యమ్ము
రాముని హృదయమ్ము ప్రేమాంకితమ్ము
రాముని పాలన ప్రజల కంకితము.
అతిలోకసుందర మ్మాధ్యాత్మికమ్ము
అతుల రమ్యాలోక మతని భావనము
సాధువాదమ్మది సర్వసమ్మతము

వేదసారము విశ్వవిజ్ఞాన మహము
మానవశ్రేయమ్మొ మహితాశయముగ
జ్ఞానమార్గమ్మైన సాధనమ్మద్ది
శాంతమ్మొ సత్వమ్మొ సత్యసుందరము
కాంతివికాసమ్మొ కరుణాన్వితమ్మొ
వీరమర్యాదమ్మొ విశ్వదర్శనము
భూరిసాహస శౌర్య పౌరుషాన్వితము
దుష్టశిక్షణ మహాదుర్వార బలము
శిష్టరక్షణ కళా శీలోన్నతమ్మొ,
సకలపుణ్యోదయ సంపత్కరమ్మొ
సకలసమ్మత ధర్మసంస్థాపనమ్మొ
ప్రతియుగోద్భవభావ భాసురోద్యమము
సతత దీనావన సముహితత్వమ్మొ
సుజనచిత్తవిహార సుందరాకార
విజయాభిరామమ్మొ విశ్వమోహనము

అది రామచంద్రుని ఆత్మతత్త్వమ్మొ
సదమల వాల్మీకి వదనారవింద
విగళిత మధుసుధావిమలపూరమ్మొ
జగమెల్ల చేసిన సత్తపఃఫలము
ఎంతవర్ణించిన ఇసుమంత గూడ

అంతుపట్టగరాని దా రామమహిమ
ధ్యేయమై యవనికి దివ్యభాగ్యముగ
శ్రేయమై జనులకు శ్రీకరమ్మగుచు
శ్రీరామ చరితమ్ము క్షితినెల్ల ప్రాకి
శ్రీరామమహిమమ్ము క్షితినెల్ల నిండి
శ్రీరామనామమ్ము క్షితినెల్ల మ్రోగి
శ్రీరామ మయమయి హృదయమ్ములెల్ల
ధారుణీ ప్రజలకు ధరణికంతటికి
శ్రీరస్తు శుభమస్తు శ్రేయోస్తుసతము.

## గద్య

ఇది శ్రీభారతీకరుణాకటాక్ష లబ్ధకవితావిశేషహారిత సగోత్ర పవిత్ర సుబ్రాజార్య రత్నమాంబా పుత్ర కొండేపూడి సద్వంశ జనిత, కవిశేఖర, కవిభూషణ బిరుదాంచిత, బుధజన విధేయ సుబ్బారాయ నామధేయ ప్రణీతంబైన శ్రీమద్రామాయణమునందు
సర్వము సంపూర్ణము
సర్వేజనాః సుఖినోభవన్తు
ఓమ్ తత్ సత్

# శ్రీ కొండేపూడి సుబ్బారావు రచనలు

## ముద్రితములు

1. కావ్యాంజలి : క్రౌను 16+82 పుటలు వెల రు. 3-50
   రమణీయ ఖండకావ్య సంపుటి
2. గీతామృతము : డెమీ. 36+328 పుటలు 15-00
   18 అధ్యా. శ్లోకములు వానికి సులభశైలి
   తెలుగు పద్యములు, తాత్పర్యములు.
3. గీతాసంగ్రహము : డెమీ. 48 పుటలు 2-00
   భగవద్గీత 18 అధ్యా. సారము. వచనము
4. సర్వేశ్వర స్తవము : డెమీ. 32 పుటలు 1-50
   ప్రార్థన పద్యశతకము
5. శ్రీ వేంకటేశ్వరకర్ణామృతము : క్రౌను 72 పుటలు
   పద్యకావ్యము 3-00
6. శ్రీ సూర్యనారాయణశతకము : క్రౌను
   36 పుటలు 2-00

## సులభశైలి ద్విపదకావ్యములు

7. శ్రీమద్రామాయణము : క్రౌ. 24+300 రు. 12-00
8. శ్రీ ఉత్తరరామాయణము : క్రౌ. 16+138 5-00
9. శ్రీమహాభారతము : క్రౌ. 16+142 5-00
10. శ్రీమద్భాగవతము : క్రౌ. 16+312 12-00

మొత్తముగా కొనువారికి ప్రతులసంఖ్యనుబట్టి
తగిన డిస్కౌంటు లభించును.